ప్రచురణ నెం 340
ప్రథమ ముద్రణ
శ్రావణం, 1881
(ఆగస్టు, 1959)



వెల : రు 2.25

# NEWCOMER

By

GALINA NIKOLAYEVA

*Translated By*

A. PITCHESWARA RAO

**Visalaandhra Publishing House**
**Vijayawada.**

Printed at :
Swatantra Art Printers.
Vijayawada.

అంకితం

అల్తాయ్. కజఖ్‌స్తాన్
కామ్సొమోల్ సభ్యులకు

కృతజ్ఞత

పాటలను తెనుగుచేసి యిచ్చిన
మిత్రుడు రాంభొట్ల కృష్ణమూర్తికి

— అనువాదకుడు.

మాస్కో నగరం. క్రెమ్లిన్ భవనం. వ్యాపసాయిక రంగంలో ప్రముఖులైన కార్యకర్తల సమావేశం జరుగుతోంది.

హాలంతా కిటకిటలాడుతోంది కార్యకర్తలతో; ఒక్క కుర్చీ కూడా ఖాళీగాలేదు. ఎటు చూచినా విద్యుద్దీపాలు; కిటికీల మూలల్లో దాక్కున్న పగటి వెలుతురునిగూడా వెదకి వెదకి పారదోలు తున్నట్టుంది ఆ విద్యుద్దీపాలకాంతి. కెమేరాలు తీసుకుని. అటూయిటూ తిరుగుతున్నారు ఫొటోగ్రాఫర్లు. విశాలమైన వేదిక. ఆ వేదిక వెనకాక పెద్ద ప్రతిమ: లెనిన్ ప్రతిమ; సాచి, అంగవేసి హాల్లోపలికడుగు పెడుతున్నట్టున్నాడు లెనిన్. ఆయన్నాహ్వానించేందు కెదురెళ్తున్నారా అని పించుతోంది వేదిక మీద కెళ్లేవాళ్ళని చూస్తుంటే. అచంచల ఆత్మవిశ్వాసంతో వెళ్తున్నారు వాళ్ళంతా ఆ వేదిక మీదికి. ఔను మరి వాళ్ళకా హక్కున్నది. ఇదే మొదలుకాదు; ఇదివరకెన్నో సార్లధిష్టించారు వాళ్ళు ఆ వేదిక మీది స్థానాల్ని.

"కామ్రేడ్స్, బంగాళా దుంపల్ని తవ్వి పైకి తీసేందుకు గూడా యంత్రాలు కావాలి, నే నివ్వాళ ఆ సంగతిని గురించే మాట్లాడదలచు కున్నాను" అన్నది ఎఫిమోవా. బాగా పేరుమోసిన కాయగూరల సమిష్టి క్షేత్రాని కధ్యక్షురాలు ఆవిడ. బాగా బొద్దుగా వుంది. భుజాల మీదొక అంగోరా రుమాలు కప్పుకునుంది. ప్రేక్షకుల్లో చాలా మందా విడ్నిదివరకే యెరుగుదురు. 'తప్పకుండా' అని నొక్కిమరీ అంటుం దావిడ తరచు, మాట్లాడేప్పుడు. "ఔను. ఆ యంత్రా లిప్పుడు చాలా అవసరం. అవి మాకు తప్పకుండా కావలసిందే. అదే యిప్పుడు మాకొక గొప్ప సమస్య. ఈ యేడు మా పంట రెట్టింపయ్యింది. కానేం లాభం! దుంపలు బయటికి తియ్యడానికి యంత్రాలు లేవు! వెంటనే

మంత్రిగారి దగ్గరికెళ్లాను. 'ఏ మైనాసరే, మాకు తప్పకుండా యంత్రాలు పంపాల్సిందే' అన్నాను. అడిగినందు కాయన వొకటి పంపారు. కాని అదేమంత మంచి యంత్రం కాదు. ఇక్కడింత మంది కామ్రేడ్సున్నారు; ఫ్యాక్టరీ డైరెక్టర్లూ, ఇంజినీర్లూ, డిజైనర్లూనూ. మీరే చెప్పండి. నూటికి ముప్పై నలభై వంతుల దుంపల్ని నేలలోనే వదిలి పెట్టేసే యంత్రాలేం మంచి యంత్రాలో, మీరే చెప్పండి? ఎందుకు మా కట్లాంటి యంత్రాలు!"

ఆ ప్రశ్న హాలంతా ప్రతిధ్వనించింది. డిజైనర్లూ, ఇంజనీర్లూ, డైరెక్టర్లూ శ్రద్ధగా విన్నారు. తర్వాత, సమావేశం అధ్యక్షుడు మరో కార్యకర్తని పిలిచాడు వేదిక మీదికి. ఫాలికోవ్ వచ్చాడు. ఝురావినో ఎమ్టియస్* కి మానేజరతను. యువకుడు. బుగ్గలింకా ఎర్రగానేవున్నై. మెడ, కుర్రవాడి మెడలా, అతి సన్నగావుంది. వచ్చి, గబగబా యెక్కాడు వేదికమీదికి. ఇంతవరకు ఆ హాలులోవున్న వాళ్ళెవళ్ళూ, ఆ ఎమ్టియెస్ పేరుగాని, అతనిపేరుగాని విననేలేదు.

"కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, సెప్టెంబర్లో, ప్లీనమ్ సమావేశం జరిగింతర్వాత, మా ఎమ్టియెస్ మా కోటాని పూర్తిచేసింది. కోటాకంటే ఎక్కువే పనిచేసింది..." అంటూ ఒక క్షణం తడబడ్డాడా యువకుడు. "మిగతా స్టేషన్ల లాగానే దేశంలో వున్న వేలకొద్దీ ఎమ్టియస్ల లాగానే. దేశంలో వున్న లక్షలాది ప్రజల్లాగానే. మా ఝురావినో ఎమ్టియస్గూడా, నూతనోత్సాహంతో, నవోత్తేజంతో, మా పదిరోజుల కోటాల్ని; మా తదితర కర్తవ్యాల్ని. యెప్పటికప్పుడు, ముందుగానే పూర్తిజేస్తున్నవి; అనుకున్న దానికంటే యెక్కువే వుత్పత్తి చేస్తున్నాం. దమ్ము చెయ్యడాన్ని గురించి చెప్పవలసొచ్చినప్పుడు...."

అంతకు పూర్వం మాట్లాడిన వాళ్ళందరూ సూటిగా, అవసరమైన విషయాన్ని గురించి మాట్లాడుతూ వచ్చింతర్వాత. యీ వుపన్యాసం అపశ్రుతిలాగానే వుంది అందరికీనీ. అసలు విషయం చెప్పకుండా

* మెషీన్ ట్రాక్టర్ స్టేషన్

యీ 'నూతనోత్సాహాలూ, కొత్త వుత్తేజాలూ' దేనికని విసుగు పుట్టింది గూడాను.

క్రెమ్లిన్‌లో వేదికమీదికి ఎఫిమోవాలాంటి వాళ్ళెలా రాగలిగారో అందరికీ తెలుసు. కాని యీ యువకుడు, యింత మెత్తటి మనిషి, ఏం మాట్లాడాలో నిర్ధారణ చేసుకోలేక ఉపన్యాసం వ్రాసుకొచ్చిన మనిషి. యీ సమావేశానికే అర్హతలుండబట్టి వచ్చాడో అర్థంకాలేదు.

ముందా వుపోద్ఘాతం ఐపోయింతర్వాత, ఇంక అంకెలు చదవడం ప్రారంభించాడా యువకుడు.... హెక్టేర్లు, శాతాలు....సమావేశం అధ్యక్షుడు బెల్ నొక్కాడు:

"ఈ శాతాలూ, అంకెలూ అవసరమని నేనూ అంగీకరిస్తాను; కాని ఆ అంకెల వెనకవున్న విషయం చెప్పాలి మాకు. వర్షాలు పడక పోయినా, మీరు మీ చుట్టుప్రక్కల్ల వాళ్ళందరికంటేనూ, రెట్టింపుపంట ఎలా పండించగలిగారు? ఏం చెయ్యడంవల్ల పంట రెట్టింపయ్యింది? అది చెప్పాలి." అన్నాడు.

"జిల్లాలో సగటు పంటకంటే, మా ఎమ్‌టియస్ రెట్టింపు పంట పండించింది. దానిక్కారణం..." అంటూ ప్రారంభించి అక్కడే ఆగి పోయాడు ఆ యువకుడు మళ్ళీనీ.

మారానేదో వస్తువు వంక చూస్తున్నట్టున్నాడు; ఆ సన్నటి మెడ వణకినట్టని పించింది.

"దానిక్కారణం..." అని మళ్ళీ అన్నాడు; మళ్ళీ ఆగిపోయాడు.

హాలంతా నిశ్శబ్దంగా వుంది. ఇందులో నుంచి యెలా బయట బడదామా అన్నట్టు హాలు గోడలవంకా, కుర్చీల దారుల వంకా చూస్తూ నిలబడిపోయాడతను.

"దానిక్కారణ..." అని మూడోసారి మళ్ళీ అన్నాడు, నాడి చెడిన గ్రామఫోన్ రికార్డులాగా.

"కామ్రేడ్ ఛాలికోవ్ మాట్లాడేందుకు సిద్ధమైరాలేదు. ఐనా, ఫర్వాలేదు మాట్లాడమని మేమే కోరాం." అన్నాడు సమావేశం

అధ్యక్షుడు అతని జంకు పోగొట్టేందుకు, అని ప్రోత్సహిస్తున్నట్టు చూశాడు. ఫాలికోవ్ వంక "ఎలా చేశారో చెప్పండి. మీ ఎస్టియస్‌ని పైకెలా తెచ్చారు ?" అంటూ, దేన్నో పట్టి బలవంతాన పైకిలేపు తూన్నట్టు చేతులు పైకి ఊపుతూ, ప్రోత్సహించాడు.

యువకుడి ముహమంతా నల్లబడి పోయింది; కాళ్ళమీద బరువు కాస్సేపటూ, కాస్సేపిటూ మార్చుకున్నాడు. చిట్టచివరికి :

"మమ్మల్ని పైకి లాగారు..."

అని ముచ్చెంగా మూడు మాటలని, మళ్ళీ ఆగిపోయాడు. ఇంక మాట్లాడలేక పోయాడు. ఆ విద్యుద్దీపాల వెలుతురులో, ఆ వేలకొద్దీ జనం కన్నులముందు, అలాగే నిలబడి, తబ్బిబ్బై, తత్తరపడిపోయాడు. నేలకి మేకులు కొట్టినట్లు, ఏమీ తోచక నిలబడిపోయినవాణ్ణి పట్టుకుని, ఫోటోగ్రాఫర్లు ఫోటోలుతీసేశారు జాలన్నాలేకుండా. వేదికమీద, అధ్యక్ష వర్గంతోపాటు, కుర్చీలో కూర్చున్న ఎఫిమోవా, సద్ హృదయంతో మనసారా నవ్వింది; ప్రేక్షకులూ నవ్వారు.

"హుఁ" అన్నాడు సమావేశం అధ్యక్షుడు, తోసుకొస్తున్న చిరునవ్వు నాపుకోవాలని ప్రయత్నిస్తూ;" మాటల్లో కంటే చేతల్లోనే దిట్టమైన వాళ్ళన్నమాట మీరు. ఐనా, అదేమంచిదిలే కాలు గడపదాటక పోయినా మాటల్తో కోటలు దాటడం కంటే !"

ఎలాగో, 'కాళ్ళకు కొట్టిన మేకులు' కదిలించి పదిలించుకుని. వేదిక మెట్లుదిగాడు యువకుడు నిస్పృహగా చేతులూపుకుంటూ.

అంత చక్కగా ప్రారంభమైన వుపన్యాసం యింత చక్కగా ముగియడం చూచి, హాలంతా గొల్లుమంటూ చప్పట్లు కొట్టింది. ఫోటోగ్రాఫర్లనీ, జర్నలిస్టుల్ని తప్పించుకుంటూ, తన కుర్చీ దగ్గరికి దారి చేసుకుంటూ వెళ్ళాడతను అతికష్టంమీద.

అతనలా వెళ్తూంటే, హాలులో రేగిననవ్వు హేకిలినవ్వు మట్టుకు కాదు; స్నేహపూర్వకంగా నవ్వినవవ్వే. ఎంతో కొంత సానుభూతి గూడా వున్నదా నవ్వులో. ప్రేక్షకుల్లో వున్నవాళ్ళలో చాలా మందికి, వాళ్ళ వాళ్ళ మొట్టమొదటి వుపన్యాసాలు గుర్తుకొచ్చినై యీ సంఘటన

చూస్తూంటే. ఇదే జంకు; ఇదే భయం; ఇదేత త్తర పాటు. అందు లోనూ, అధ్యక్షుడి మాటలువిన్న తర్వాత, యీ యువకు డొట్టి కోతల రాయడు కాదని గూడా తెలిసింది. మొట్టమెదటా నాలుగు మాటలూ చెప్పేందు కెంత శ్రమపడ్డాడో అని గూడా అనుకున్నారు కొందరు.

ఆ కాస్సేపూ నవ్వారు; అంతే, తర్వాతా విషయమే మరచి పోయారు.

ఆ కార్యకర్తల సమావేశం అయ్యాం తర్వాత కొద్ది రోజులికి మాస్కోనుంచి బయల్దేరాను నేను. నాతోపాటు, నా రైలు పెట్టెలో యింకొక్కతనే వున్నాడు. అతని ముహంగూడా కన్పించడంలేదు నాకు; నా వైపుకు వీపుతిప్పి కూర్చున్నాడు. కదలడంలేదు, మెదలడం లేదు. పెద్ద ఓవర్‌కోట్ వుందా వీపుమీద.

నేను టీ తీసుకుని. యింక పండుకుందామని పక్క సర్దుకుంటు న్నాను. మా పెట్టె అంతటా నిశ్శబ్దం. నాతోటి ప్రయాణీకుడు కూర్చున్న బల్లపైన, సామాను దగ్గర మూడు బియెర్ సీసాలు మట్టుకు టకటక లాడుతున్నై రైలుబండి కుదుపుకి.

అర్థరాత్రయ్యింది. అప్పుడు కనిపించిందా వీపులో చలనం; అప్పటిదాకా ప్రాణంలేని కట్టెలావుంది.

నాతోటి ప్రయాణీకుడు కదిలాడు; నెమ్మదిగా నిట్టూర్చాడు.

"ఎంతపనిచేశా నెంతపని చేశాను!" అని గొణుక్కున్నాడు; నాకు స్పష్టంగా వినిపించింది. "ఛీ! అంతా పాడుచేసేశాను!" అను కున్నాడు. కాస్సేపాగి, మళ్ళీ, "లేదు, లేదు, ఏమంత పాడుచెయ్య లేదులే "అనుకుని సమర్థించుకున్నాడు తన్నుతానే; "ఉపన్యాసం చాలా బాగానూ వుంది; ఏమీబాగానూలేదు."

నేను దగ్గాను; దగ్గి, లైట్ వేశాను. వెనక్కి తిరిగిచూశాడతను. అవే నీలికళ్లు; అవే కనురెప్పలు. సందేహంలేదు; సమావేశంలో తడ బడిన యువకుడే యితను.

నిట్టూర్చాడు.

అతని ముఖంలో భావాలు. తెరమీది బొమ్మల్లా స్పష్టంగా కన్పించినై నాకు; ఆశ్చర్య పోయాను. చేపట్టిన పనిని సంతోషంగా సంపూర్తి చెయ్యగల ధైర్యమూ కనిపించింది; అంతా తన కర్మకొదిలి చేతులు ముడుచుకు కూర్చునే నిస్పృహా కనిపించింది. మనిషి నిజంగానే బాధపడుతూన్నట్టూ వుంది; తన బాధనిచూచి తానే నవ్వుకూంటున్నట్టూ వుంది. ఆ ముఖంలో, యింకొక విచిత్రంగూడా, కొట్టొచ్చినట్టు కన్పించింది: ముఖంలో పై సగమంతా స్త్రీ ముఖంలా అతి సౌమ్యంగా వుంది; కలలు గంటున్నట్టున్న ఆ పెద్దపెద్ద కనులూ, యువతుల కనురెప్పల్లాంటి ఆ కను రెప్పలూనూ. కాని ఆ ముఖంలోనే క్రింది సగమూ యింకొక అభిప్రాయాన్ని కలగజేస్తుంది: గడ్డం బలంగావుంది; ఆ పెద్ద నోరూ, పెదవుల కలయికా చూస్తే అపరిమితమైన ఆత్మ విశ్వాసం వున్నట్టు యిట్టే తెలిసిపోతుంది; ఆ చిరునవ్వు గూడా చిరునవ్వేం దుకు వీల్లేదు; ఉత్సాహవంతులైన యువకులు, ధైర్యవంతులైన యువతులు, ప్రతీ విషయాన్నీ జాగ్రత్తగా ఆలోచించి ఆచరించగల యువకులు ఎన్ని కష్టాలొచ్చినా వెనుకంజ వెయ్యకుండా తమ కర్తవ్యాన్ని తాము నిర్వహించేప్పుడు చూపే ఆత్మ విశ్వాసం ప్రతిబింబించు తోంది ఆ చిరునవ్వులో.

తమకెంతో ఆత్మీయులైన స్నేహితుల్తో కూడా చెప్పలేని విషయాల నొక్కొక్కసారి, తోటి ప్రయాణీకులికి చెప్పేస్తారు కొంతమంది. నా పెట్టెలో, నాతోపాటు కూర్చున్న మనిషెందుకు, ఎలా, మాట్లాడం ప్రారంభించాడో తెలియదునాకు. బహుశా రైలు పెట్టెలో నిశ్శబ్దమేమో అందుకు కారణం; లేకుంటే అతని హృదయ మంతా ఆ భావాలతో నిండిపోయి పొర్లడం ప్రారంభించిందేమో; ఎక్కువ ఉప్పునీళ్ళల్లో వున్న ఉప్పు కొంతసేపటికి అడుగుకు తేటపని ఘనీభవించడం ప్రారంభించుతుందే, అలా, అతని భావాలుగూడా మాటల్లోకి ఘనీభవించక తప్పని సరైందేమో; ఏమో. ఏదైతేనేం ఒక్క సంగతి మట్టుకు నిజం: ఆ రాత్రి నా కనేకమంది జీవితాల వైవిధ్యం తెలిసొచ్చింది.

"ఇప్పుడంతా స్పష్టంగా తెలుస్తోందినాకు; ఇంతవరకూ నా కింత స్పష్టంగా తెలియలేదు" అంటూ ప్రారంభించాడతను; "వేదికమీద వున్నప్పుడే. వున్నట్టుండి అకస్మాత్తుగా కన్నులముందు కట్టినట్టు కన్పించింది. అన్ని ప్రశ్నలకీ సమాధానం చెప్పగలననిపించింది. అంతా తెరమీది బొమ్మలా కన్పించింది. కాని అప్పట్లో పూర్తి అర్థం అవగతం కాలేదు; తర్వాత తెలిసొచ్చింది. ఐనా యిదంతా యెందుకుగాని, నా కప్పుడు కనిపించినట్టు చెబుతా నాగండి...."

నేనేమి మాట్లాడినా, ఏ మాత్రం కదలినా, ఒకదాని వెనకొకటి తరుముకొస్తున్న స్మృతులు చెరగిపోతాయేమోనని భయపడినట్టున్నాడతను; నావైపుకు గూడా చూడకుండా, ప్రక్కకు తిరిగి కిటికీలోంచి చూస్తూ చెప్పడం ప్రారంభించాడు. ఆ మాట్లాడేది నాతో కానట్టూ, ఆ కిటికీలతోనే మాట్లాడుతూన్నట్టూనూ :

'వ్యావసాయిక యంత్ర నిర్మాణ సాంకేతిక కళాశాలలో డిగ్రీ పుచ్చుకున్నాను నేను. కళాశాలలో నేను కనపరచిన తెలివితేటల్నీ, అంతకు పూర్వం ట్రాక్టర్ డ్రైవర్‌గా నాకున్న అనుభవాన్నీ బట్టి నన్ను మెషీన్ - ట్రాక్టర్ స్టేషన్‌కి మానేజర్‌గా వేశారు. కాలేజీలో వుండగా బాగానే వుండేది నాపని : మయకొవస్కీ పాటలు కంఠతాపట్టి పాడుతుండేవాణ్ణి; పట్టణంలోని పదిపదకొండు మంది ఆటగాళ్ళలోనూ నేనూ ఒక ముఖ్యుణ్ణే. డిగ్రీ పుచ్చుకున్న తర్వాత గొప్పగొప్ప పనులు చేసేస్తాననీ, అందరికీ ఆదర్శంగా వుంటాననీ, వుండగలననీ అనుకున్నాను అప్పట్లో నేను. కాని ఝుఝురావినో ఎమ్‌టియస్ కొచ్చింతర్వాత, అలాంటి గొప్పగొప్ప పనులేమీ వుండవనీ, యిందులో పెద్ద ఆదర్శ

వంతంగా వుండేందుకు గూడా ఏమంత అవకాశం వుండదనీ తెలి శొచ్చింది. మా స్టెప్పీ భూములన్నీ సారవంతమైన భూములు. మెషీన్ ట్రాక్టర్ స్టేషన్‌గూడా చాలామంచిది; విశాలంగావుంది. పని గూడా బాగా పోటీలమీద సాగుతోంది. మా ఎమ్‌టియస్‌గూడా మిగతావాటికంటె వెనకబడేమీలేదు ! మా వార్షిక పొడంబడికలన్నీ ఎప్పటికప్పుడు పూర్తి చేశేస్తున్నాం. ప్రతీయేటా ఇంధనంలో యెంతొకొంత పొదుపుచేసి చూపించగలుగుతున్నాం. మొత్తంమీదా ప్రాంతంలోకల్లా మంచిపేరు సంపాయించుకున్నాం. ఇక, చెయ్యవలసిన గొప్ప గొప్ప పను లేముంటై గనక ? ఇంక అందరికీ ఆదర్శంగా వుండాలంటే మాత్రం అవకాశం యేది ?' అంటూ నవ్వాడతను సగర్వంగా. 'అంటే మా సమస్యలు మాకులేవనిగాదు; వున్నై. వెనుకబడిన సమిష్టి క్షేత్రాలు మాకూ వున్నై; అన్నిచోట్లా వున్నదే గదా ఆ పరిస్థితి ! నేనక్కడికెళ్ళిన మొట్టమొదటేడు. అక్కడున్న కామ్రేడ్సంతా నాకు బాగా సాయంజేశారు యీ సమస్యలన్నీ పరిష్కరించడానికి. అక్కడున్న వాళ్ళం అందరం విచిత్రమైన వాళ్ళం: ఫెద్యా ఒకడు. నావయస్సే వుంటుంది, మా పార్టీ నాయకుడతను. ఐదేళ్ళ క్రితం ట్రాక్టర్ డ్రైవర్‌గా పనిజేస్తుండేవాడు. కాని, తొందర్లోనే, అవ్వాయిసువ్వలా పైకొచ్చేశాడు. పార్టీస్కూలు పూర్తి చేశాడో లేదో, పార్టీ పనిలోకి దూకాడంతే. అసలు తను పుట్టిందే పార్టీ పనికోసమా అన్నట్టు చేశేవాడావని !

అతనీ ఝురావిన్లో ఎమ్‌టియెస్ కొచ్చి నప్పుడు మానేజరొతి అసమర్థుడు, అంచేత ఆ స్టేషన్ మిగతా అన్నిటి కంటే బాగా వెనక బడుండేది. ఫెద్యా, మా ఛీఫ్ ఎంజినీరూ కలిసి, కష్టపడి పోటీపడి పనిజేసి మిగతా స్టేషన్లతో కలిశేట్టుచేశారు మాదాన్ని గూడా. సిద్ధాంత సమస్యలమీద ఫెద్యా వుపన్య సించుతుంటే విని తీరవలశిందే; అంతబాగా మాట్లాడేవాడు. జిల్లాలోకల్లా మంచి వక్త అనిపించుకున్నాడు.

కాని, ఒకందుకు బాగా నిస్పృహ పడిపోయేవాడతను. అతని రూపురేఖలూ, యౌవనమూ కారణం అందుకు. రూపురేఖలు మంచివి కాదని కాదు; తీర్చిదిద్దినట్లుంటై. రష్యన్ కుర్రాడిలా బొద్దుగా వుంటాడు. గులాబీ బుగ్గలు, వొంకులు తిరిగిన బంగారపు తీగల్లాటి జుత్తు.

నేను చూశాను చాలాసార్లు: అంతర్జాతీయ పరిస్థితులమీద ఎంతో వుత్సాహంగా, వుత్తేజంతో మాట్లాడేవాడు. ఐనా, ఆ వుపన్యాసం విన్న ట్రాక్టర్ డ్రైవర్ యువతులు ప్రశ్నలువేసి, విషయాలు తెలుసుకోక పోవడం మాటట్లావుంచి, 'నీలిరంగు చొక్కావాడే, నీటైన సోగ్గాడే, కుర్రాడు బిల్‌నీటైన సోగ్గాడే' అంటూ అప్పటికప్పుడు పాటలు గట్టి పాడేవారు. అతనేమో ఆ పాటలు విని, లోలోపల సిగ్గుపడి, బాధపడేవాడు.

"ఛాఛ, నాది మరీ యింత వెధవముఖం ఐపోయిందే!" అంటూ మండిపడేవాడు; "మనిషిలో వున్న సరుకుకీ, రూపానికీ, యింత భేదం యెందుకుండాలి. ఇక రోజూ, వినీగర్* అన్నాతాగాలి, యీ బుగ్గలరంగు పోవడానికి!" అనేవాడు.

మా ముఖ్య గ్రామీణ ఆర్థిక వేత్త పేరు ఇగ్నాత్ ఇగ్నతొవిచ్. బాగా అనుభవం వున్నాయన. ఉక్రేనియన్ వంశాల్లో పుట్టిన మనిషి. పూర్వం ఉక్రేనియన్ రైతులు చాలా మంది వలసొచ్చి, మా ప్రాంతాల్లోనే వుండి పోయారు. మా స్టెప్పీల్లో మొట్టమొదట మట్టియిల్లు కట్టేటప్పటికి మా ఇగ్నాత్ బాగా కుర్రాడు. కాని, యిప్పుడు...యిప్పుడాయన పళ్ళతో టంటే జిల్లా అంతటా పేరు మోగింది. ఇంటి నిండా పిల్లలే యిప్పుడాయనికి: కొడుకులూ, కూతుళ్ళూ, మనమలూ, మనమ రాళ్ళూ. మనిషి బాగా లావుగా వుంటాడు. ఆయన భార్యా అంతే; బాగాలావుగా హుషారుగా వుంటుంది. ఎప్పుడు చూచినా ఒక డజను మందుంటారు ఆయనచుట్టూ మనమళ్లు. వాళ్ళందరి తలలూ గుండ్రంగా నున్నగావుంటై; ఎర్రటి బుగ్గలూ వాళ్ళూనూ. అందుకని వాళ్ళందరికీ కలిపి ఒకటే పేరు పెట్టేశాడాయన, 'గుమ్మడికాయలు' అని!

ఏమైనా మా అందరిలోకీ మరీ విచిత్రమైన మనిషి మా తాత్కాలిక ఛీఫింజనీరు. ఆయన పేరు అర్కాడీ పెత్రోవిచ్ ఫర్జనోవ్.

ప్రత్యేకించి ట్రెయినింగంటూ ఆయనేమీ పొందలేదుకాని, ఆయన కాలంలో మొదట కొన్ని రోజులు షాప్ మేనేజర్‌గానూ, తరువాత

---

* పులవబెట్టిన ద్రాక్షా రసం.

ఫ్యాక్టరీ డైరెక్టరుగానూ పని జేశాడు. కాని యంత్రాలకి సంబంధించి నంతమట్టుకు ఆయన్ని చెప్పి చెప్పాలి యింకెవరైనా. కారు దగ్గర్నుంచి, విమానందాకా యేదైనాసరే నడప గలడు. మంచి వేట గాడు గూడాను; గురి తప్పడమంటూ వుండదు ఆయన తుపాకి పట్టుకుంటే. మేఘాల్లో ఎగిరే పక్షినైనా, యిట్టేకొట్టి అట్టే కూలుస్తాడు నేలకి :

యుద్ధంలో పనిజేసి. యింటికొచ్చేప్పటికి మనిషి పూర్తిగా డీలా పడిపోయాడు. ఏదో దీర్ఘవ్యాధి లంకించుకుంది. స్టెప్పీ వాతావరణంలో. ప్రశాంతంగా, జీవితం గడపడం మంచిదని సలహాయిచ్చారట డాక్టర్లు. అందుకని వచ్చాడు మా ప్రాంతానికి.

నేనుద్యోగంలో ప్రవేశించ బోయేముందు, మా ప్రాంతీయ కేంద్రంలో వున్నవాళ్లు, "మీ ఎమ్‌టియెస్‌లో వున్న ఛీఫింజినీరు చాలా గొప్పవాడు ! అక్కడికే వెళ్తున్నావ్ నువ్వూనూ, అదృష్టవంతుడివి" అని అన్నారు.

ఆ మనిషిని చూచీ చూడకముందే అనుకున్నాను; ఆ ఎత్తూ, లోపలికి తోసుకుపోయిన రొమ్మూ, కొక్కెంలాంటి ముక్కూ. గుబురుగా పెరిగిన కనుబొమల్లోంచిచూచే ఆ చూపూ, నోట్లో ఆ నల్లటిపైపూ చూడగానే అనుకున్నాను ; 'రాబందులాంటి మనిషిరాబాబూ !' అని.

నన్ను చూడగానే చెప్పేశాడు ఆయన తన కథంతా :

"అబ్బాయ్, నాకు రెండు దురదృష్టాలు సంప్రాప్తించినై" అన్నాడు. "ఒకటి, నా జబ్బు; రెండోది నాపై అధికారులు, ఇంత వయసొచ్చి, ముసలివాణ్ణయిన తర్వాత గూడా యీ స్టెప్పీల కొచ్చానంటే. అందుకనే ననుకో, నాకు సరిగ్గా సరిపోయింది కూడాను యీ ప్రాంతం. ఈ చుట్టు ప్రక్కల పంద మైళ్ళలోనూ నువ్వే నాకు తోడు. వొచ్చే కొత్త మానేజరెలా వుంటాడోనని ఆందోళన పడిపోయానంటే నమ్ము. నిన్ను చూశాను; ఫర్వాలేదను కున్నాను. అంతే. ఇంకేం ఫర్వాలేదు; యిద్దరం హాయిగా కలిసిమెలిసి చేసుకుందాం పని."

ఒకటి మట్టుకు చెప్పగలను నేను. పని చెయ్యడమంటే యేమిటో, బ్రవకడం యెలాగో అతనికి తెలిసినట్లిం కెవ్వరికీ తెలియదు ఆయన భార్య....మంచి అందగత్తె. ఇల్లు...స్వర్గంలాగా వుంటుంది. ఎప్పుడూ పథకం ప్రకారం చేశినట్టు చేస్తాడు పని. చుట్టు ప్రక్కల వాళ్ళకంటే, కనీసం ఒక మూడు రోజులు ముందైనా, ఐపోతుంది మా మెషీన్లన్నీ బాగు జెయ్యడం. ఈ జిల్లాలో. యూనిట్ పద్ధతి ప్రకారం, యంత్రాల్ని న్నిటినీ వూడదీసి బాగుచేసే పద్ధతిని ప్రవేశపెట్టింది గూడా ఆయనే. అంటే. యిప్పుడాయన పని చేసే పద్ధతి అక్షరాలా యూనిట్ పద్ధతేనా అంటే కాకపోవొచ్చు ననుకోండి. కాని, ఆయనన్నట్టు, మా పరిస్థితుల్లో "వివరాల్ని గురించంతగా పట్టించుకో గూడదు; పని జరుగుతోందా లేదా అనేది చూ స్తే చాలు :"

కాలేజీలో చాలా మంచి మార్కులు సంపాయించి, డిగ్రీ పుచ్చుకున్నానన్న మాటేగాని నాకు అనుభవం యేముంది ? సున్నా. మొట్టమొదట్నుంచీ గూడా ఫర్గ్యసోన్ నాకు బాగా సాయం జేశాడు. ఎంత సాయం జేశాడో చెప్పలేను! ఎప్పుడు సాయంకావలిస్తే అప్పుడు, మళ్లీ ఐదో కంటికి తెలియకుండా. ఇటు ఆర్థిక వ్యవహారాల్లోనూ అంతే; అటు శిక్షణకి సంబంధించిన విషయాల్లోనూ అంతే.

ఉదాహరణకి, మాకిద్దరున్నారు, భలేజంటలే: స్తింకా, పెంకా, అని.

స్తింకా గమ్మత్తుగా వుంటాడు. ఆ నల్లజుత్తూ, చిన్నచిన్న చిలిపి కళ్లూ; సన్నని మెడమీద బాదామి తల; ఎప్పుడూ గాలి చక్రంలా అటూ యిటూ తిరుగుతూంటుందావల! కొద్దిగా గూనికూడాను. పెంకా అట్లా వుండడు. అందంగా వుంటాడు. అతనేదన్నా పొరపాటు చేసినప్పుడు నేను కోప్పడితే, అహోరకంగా చూస్తాడు నా వంక; నేననేది నిజమే నన్నట్టుగా కూడా చూస్తాడు. 'మీరు మాంచి తెలివిగలవాళ్లు సుమండీ! మీరామాటలనక పోతే యెట్లా ? అనపలశిందే! నేనూ తెలివి తక్కువ వాణ్ణికామలెండి; మీరలా యెందుకు కోప్పడుతున్నారో నాకూ తెలుసు. అంతెందుకు. మీ స్థానంలో నేనుంటే, నేనూ సరిగ్గా మీరు కోప్పడినట్టే

కోప్పడేవాణ్ణి; తప్పదు !' అన్నట్టుండేది ఆ చూపుచూస్తుంటే. నేనెంత కోప్పడినాసరే, ఎదురుతిరిగి పల్లెత్తుమాటనేవాడుకాదు. ఆ పరిస్థితుల్లో అతనేమని జవాబుచెప్పితే మంచిదనుకునేవాణ్ణో, సరిగ్గా, ఆ మాటలే అనేవాడు. వెళ్ళిపోయేవాడు. వెళ్ళిపోయిం తర్వాత, మళ్ళీ యధా ప్రకారమే. తన చిత్తం వచ్చినట్టు చేసేశేవాడు ! నా మాటలన్నీ తుంగలో తొక్కేసినట్టు. వొట్టప్పుడు మాతో మాటన్నా అనకుండా, దేశాలన్నీ తిరిగేవారు యిష్టం వొచ్చినట్టు. మళ్ళీ విత్తనాలుచల్లే సమయానికొచ్చి పడేవారు. వేరే యేమీలేదు. అప్పుడైతే యిక్కడ నాలుగురాళ్ళ బాగుగా కిట్టుబాటౌతాయని. నేనూ యిప్పుడొచ్చారెందుకని వెళ్ళగొట్టేవాడినీకాదు. ఎందుకనంటే, నాకూ గత్యంతరంలేదు. అసలే జనం తక్కువ అందులోనూ, అందరికీ యంత్రాలు నడపడంచేతకాదు. ఎన్నిచెప్పినా, యంత్రాలు నడపడంలో యిద్దరూ మొనగాళ్ళు. అందుకని, ఎప్పుడొచ్చినా, వొద్దనకుండా, పనిచేయించుకునే వాణ్ణి.

ఐనా, యింకొకటి గూడా వుంది. వాళ్ళిద్దరితో పని చేయించడం మా పల్లెవరివల్లా అయ్యేది కాదు; ఒక్క ఫర్జనోవ్‌కి తప్ప. ఆయనేం జెపితే అది చేసేవారు మారు మాటాడకుండా.

అదీ సంగతి. వాళ్ళక్కూడా ఆయనంటే మంచి గురన్నమాట, నామట్టుకు నేనూ వెళ్తూండెవాణ్ణి ఆయన దగ్గిరికి ఎప్పుడే విషమ సమస్య వొచ్చినా.

ఆ మాట కొస్తే, స్టెప్పీలలో, అంత విశ్రాంతిగా, సగర్వంగా బ్రదకడం నాకు నేర్పిందీ ఆయనే; ఫర్జనోవ్ ! టౌను కెళ్ళినప్పు డల్లా చూస్తుండే వాణ్ణక్కడ. వ్యవసాయ కార్యాలయంలో; గ్రామీణ ఆర్థిక వేత్తలందరూ, వూరికే కాగితాలు చంకనబెట్టుకుని తిరుగుతూండే వారు హడావిడిగానేనా హడావుడేమీ పడే వాణ్ణిగాదు. తాపీగా వెళ్ళి, నా పనేదో నేను చూసుకుని రాజాలాగా వచ్చేశేవాణ్ణి. మా ప్రాంతంలో కల్లా, మా ఎమ్‌టియెస్ అంటే మంచిపేరుంది. నా చేతికింద నలభై యేడువేల యెకరాల భూమివుంది; మిగతా యంత్రాలన్నీ తీసేశినా, కనీసం ఒకొంద ట్రాక్టర్లన్నా వున్నై. నామట్టుకు నాకు, సొంతంగా, ఒక కారుంది.

నాచేత్తో నేను సంపాయించిన తోడేళ్ళ చర్మాలు ఐదున్నై యింట్లో. ఇంకేంకావాలి ! అది చాలదూ నేనంత గర్వంగానూ, తాపీగానూ, బ్రదికేందుకు !

నిజం చెప్పాలంటే, న్యాయాని కప్పుడసలు యింకేమీ యిబ్బం దులూలేవు మాకు.

పగలల్లా. మా ఎమ్‌టియెస్‌లో అటూ యిటూ వూపిరాడకుండా తిరిగేవాణ్ణి, సాయంత్రంపూట యేవేటకో బయల్దేరేవాణ్ణి. ఒక్కోసారి, ప్రక్కనే వున్న సరస్సుకెళ్లేవాణ్ణి చేపలుపట్టుకోడానికి. అదీకాకపోతే, అందరంకలిసి కట్టకట్టుకువెళ్లే వాళ్లం మా ఇగ్నాట్ పళ్లతోటకి. ఆయన భార్య చక్కగా చాపలూ అవీ పరిచి గౌరవంచేశేది. నాలుగు వైపుల్నుంచీ దొర్లుకుంటూ వొచ్చేవాళ్లు 'గుమ్మడికాయలు.' ఎటు చూచినా స్టెప్పీ అంతటా విశ్శబ్దం. రైల్వేస్టేషన్‌కీ మాకూ చాలా దూరం. రైలురోడ్డు గూడా మాకు దగ్గర్లో ఎక్కడా లేదు. ఎటు చూచినా స్టెప్పీయే."

చెబుతూ చెబుతూ మధ్యలో ఆగిపోయి ఆలోచనలో పడ్డాడు ఛాలికోవ్; ఆ యువతుల కనురెప్పల్లాంటి కనురెప్పలు లేపి చూశాడు నావంక.

"మా స్టెప్పీ లెప్పుడైనా చూశారా మీరు ?" అనడిగాడు నన్ను: అచ్చంగా వుయ్యాలకి మల్లే ఊగొడుతుంది: గాలికి అలల్లా కదుల్చాడే గోధుమ పైరు, ఆకాశంలో, అతినెమ్మదిగా, తెరచాపకి మల్లే తేలిపోయే మబ్బూ. అంతే. ఎటు చూచినా ప్రశాంతంగా వుంటుంది. జీవితమే, ఏ వేగిరపాటూ లేకుండా, అతితాపీగా, మెల్ల మెల్లగా, అడుగుతీసి

అడుగు వెయ్యడం గూడా అనవసరమే ననుకుంటోందా అని పిస్తుంది. దూరాన కొలనులో వొంటి కాలిమీద నిలబడిన కొంగగూనా, కాలు మార్చుకు నేందుకు బద్ధకించి, ప్రశాంతంగా, వున్నచోటనే, వున్న తీరులోనే. వుండాలనుకుంటోందా అని పిస్తుంది. ఇక, గాలి సంగతి చెప్పవలసిన పనేలేదు; కావలచినంత గాలి. ఆ గాలి పీలిస్తేనే చాలు, మత్తెక్కి పోతుంది. అన్ని విషయాలూ మరిచిపోయి, అలాగే వుంటి పోతాం, యిక్కి ప్రపంచంలో యిటు పుల్లతీసి అటు పెట్టవలసిన అవసరం గూడా లేనట్టు! నాకా వాతావరణం బాగానే వున్నట్టనిపించింది. బాగా లావెక్కాను; కాస్త పెరిగాను గూడాను. ఇప్పుడిలా వున్నానని అనుకో బాకండి; ఇప్పుడంటే చిక్కిపోయా ననుకోండి; అదంతా తర్వాతి సంగతి. నిజమే ననుకోండి; అప్పుడప్పుడూ రకరకాల ఆలోచనలొచ్చేవి నాకు అప్పుడు కూడా; 'ఇదేమిటి, నా వయసులో మంచి భాగం అంతా యిక్కడ గడచి పోతోందే; ఐనా కదలించే సంఘట నొక్కటీజరగడంలేదు; ప్రేమంటూలేదు, వాదంటూలేదు; గొప్పగొప్ప పనులేమైనా చేస్తున్నామా అంటే, ఏమైనా ఆదర్శాలు నెలకొల్పు తున్నామా అంటే అదీలేదు; ఇదేమిటూ ? అని అనుకుంటూనే వుండే వాణ్ణి అప్పుడూనూ, అప్పుడప్పుడూ.

ఈఆలోచనలు...పనిచేస్తున్నప్పుడుగాని. వేటాడుతున్నప్పుడుగాని వచ్చేవికాదు. కాని, ఒక్కోసారి, నేనూ ఫర్జనోవ్ వేటకెళ్ళి కలిసొస్తూండే వాళ్లం. దారిలోనేవుంది రైల్వేస్టేషన్. సరిగ్గా మేం తిరిగొచ్చే సమ యమూ, మాస్కోనుంచి రైలొచ్చే వేళా ఒకటే అయ్యేది. మేం వచ్చే టప్పటికి, ప్లాట్‌ఫారంమీద రైలు పొగలు కక్కుతూ వుండేది. ప్రయాణీకులటూ యిటూ హడావుడిగా పరుగెత్తుతుండేవారు. మా కొస్త్యా- వైర్‌లెస్ ఆపరేటరతను - రికార్డులు పెట్టి లౌడ్‌స్పీకర్లు బాగా తిప్పొదిలి పెట్టేవాడు; ఇంకేముంది, ప్లాట్‌ఫారం అంతా ప్రతిధ్వనించి పోయేది పాటల్తో; చెవులు గింగురు మని పోయేవి.

అన్ని రికార్డుల్లోకీ 'మదోన్మాదనృత్తకేళి' అన్న రికార్డంటే మా కోస్త్యాకి చచ్చేటంత మోజు.

నేనూ, ఫర్డనోప్, యిద్దరం కలసి స్టేషన్లో కెళ్ళి, రెండు బీయెర్లు తెమ్మని చెప్పి, కాస్పే పక్కడే అటూ యిటూ చూస్తూ గడిపేవాళ్ళం కాలం.

ఏదేమైనా వొకటి మట్టుకు నిజం: మా నేలంతా బాదంకాయ రంగుగా వుంటుంది; ఒంట్రన్న మాట. నేల ఎరుపు; ఆ నేల మీద నుంచి గాలికి రేచే దుమ్ము ఎరుపు. చివరకా చిన్ని చిన్ని గుడిసెలు గూడా ఆ నేలకి మల్లేనే ఎర్రగా వుంటై. ఆ ఎర్ర మట్టితోనే గదా, ఆ గుడిసెల గోడలు పెట్టేదీని ఆ రంగు పోవడానికింత సున్నం వేశే అలవాటు గూడా లేదు మా ప్రాంతం వాళ్ళకి. చివరికా ప్లాట్ఫారం తీగవెనక నుంచి నిక్కించి చూచే ఆ ఒంటె మెడగూడా ఆ మట్టితోనే చేసినట్లుంటుంది ఎర్రగా. మా ముందున్న బల్లదీ అదేరంగు: యెరుపు. ప్రయాణీకులు తినిపారేశిన వేరుసెన్నావుంటే కతుకుదామని ప్లాట్ఫారంమీదా మూలనుంచి యీ మూలకి వొడు తీశేపక్కా రంగూ అంతే; ఆ ఒంటెరంగే; ఎరుపు. బీరా బియెర్ తీసుకుని రెండు గుక్కలేస్తే, యిదిగూడా అదేరంగు తుప్పు నీరు కాదుగదా అనిపించేది. 'ఛాఛ: ఏం రంగిది. వెధవ రంగు, దరిద్రపు రంగు!' అని పించేది.

ఇది చాలదా అన్నట్టు ఆ దుమ్ము; ఆ దుమ్ముకు తోడా పాటొకటి, ఆ స్టేషన్లో, ఆ వాతావరణంలో ఆ పాట ఒక పెద్ద అపస్వరంలా బాధ పెట్టేది.

*మహోన్మాద నృత్తకేళి*
*సదా నిగుర్వించు తరిని*
*నే కన్నుల నేగంటిని*
*ఘోరహో గీతి ఘరిని!....*

ఆ పాట మాటయూ అంతే. ఈ లోకానికి సంబంధించిన వాటి లాగానే కన్పించేదికాదు; ఇంకేలోకంభాషో అది అనిపించేది: అచుకోలేని వుద్వేగాల బరువుని భరించలేక వణికిపోతున్నట్టుండేది ఆ పాట. ఆపాట ప్రారంభమైతే చాలు, చుట్టుపక్కల జరిగే గందరగోళమంతా మటు మాయమైనట్లనిపించేది. ఉన్నట్టుండి, అగస్మాత్తుగా, అవే వుద్వేగాలు

ఆవేశావాలు కావాలని ఆరాటపడి పోయేది మనసంతా; ఆ 'రహస్యాల' నందుకోవాలని వువ్విళ్లూరేది.

అని చెప్పి, వూపిరి పీల్చుకోడానికా అన్నట్టు, ఆగిపోయాడు ఛాలికోవ్. మళ్ళీ, అతని వింత చిరునవ్వునవ్వి. చెప్పడం ప్రారంభించాడు :

సరే. మా పొరుగునే వున్న ఒలోఛిఖినో ఎమ్‌టియెస్ కి ఒక కొత్త గ్రామీణ ఆర్థిక వేత్త వచ్చిందని విన్నాం మేం. సినిమా తారలందరూ యీ కొత్తావిడ ముందు బలాదూరని చెప్పడం మొదలెట్టారు ట్రాక్టర్ డ్రైవర్లంతా. నేనూ. ఫెద్యా కలిసివెళ్ళాం అక్కడికి; వాళ్ళ పనెలా చేస్తున్నారో పోటీ యెలా సాగుతోందో చూళొద్దామని. వెళ్ళి చూస్తే. మొత్తానికసలా ప్రదేశాన్నే గుర్తుపట్టలేక పోయామంటే నమ్మండి; అంత మారిపోయిందన్న మాట! అంతా శుభ్రంగావుంది; కొత్తగా సున్నం వేశారు; రంగులు వేశారు. అక్కడి మానేజర్, లుకాచ్, గూడా కొత్త పెళ్ళికొడుకు లాగా అలంకరించుకుని కూర్చున్నాడు ఆఫీసులో. అతని ప్రక్కనే కూర్చునుంది ఆవిడాను. ఆవిడ ముక్కుఎలా వుంది, మూతెలావుంది అని చూస్తే ఆ రూపురేఖల్లో ఏమంత పెద్ద అందమేమీ వున్నట్టు కనిపించదు కాని. మొత్తం మీద చూస్తే యింత చక్కని అందం యీ వొక్క మనిషిలోనే యెలా మూర్తీభవించిందా అని ఆశ్చర్య పోతాం! ఆవిడ కనురెప్పలేమంత పెద్దవి కాదు; ఐనా ఆ కనురెప్పల వంపులూ, ఆ వంపుల్లో నీడలూ ఒకసారి చూశామంటే చాలు; యిక కళ్ళుతిప్పుకోలేం అటునుంచి. నెత్తిమీది

కురులుగూడా ఏమంత వొత్తుగా వున్నట్టు కన్పించవు; కాని ఆ కురుల వంపులూ, ఆ నిగనిగా ఒకసారి చూస్తేచాలు; యిక జన్మలో మరిచిపోలేం. పెదవులూ...పెదవులూ అంతే: మంత్ర ముగ్ధుల్ని చేసేస్తాయి చూసే వాళ్లని; ప్రక్కనుంచి చూచినా యింతే అందంగా వుంటాయేమో, ఒక సారి ఆ కోణంనుంచిగూడా చూదామనిపిస్తుంది. లుకాచ్‌గూడా, ఎందు కనోగాని. ఆ విణ్ణి పరిచయం చెయ్యలేదు మాకు. చివరికావిడ లేచి వెళ్ళి పోయింతర్వాత తలుపుకేసి గడ్డంవూపి,

"చూశారా?" అన్నాడు.

అని, ఆ అందాన్నంతా తనే, తన ఎమ్‌టియెస్ కార్ఖానాలోనే తయారు చేశినట్టు చూశాడు. మా వంక.

"ఆఫీసులో ఒక వాష్‌బేసిన్* పెట్టాలని గల్లంతు చేశారు మా ట్రాక్టర్ డ్రైవర్లంతా. ఇప్పుడు రోజుకి కనీసం మూడు సబ్బిళ్ళ లన్నా అరిగిపోతున్నై!" అని చెప్పాడు లుకాచ్.

అప్పట్నుంచిక నేనూ, ఫెద్యా తరచూ వెళ్ళడం ప్రారంభించాం ఒలోఛ్కినోకి. లీనా వొఠి అందగత్తె మట్టుకేకాదు; పరిస్థితుల కవసర మైనట్టు మారగల శక్తి గూడా వుంది ఆమెలో. అక్కడి కొచ్చి నెల రోజులైందో లేదో ఎవళ్ళెటువంటివాళ్లో, ఎవళ్ళతో యెలా మెలగాలో అన్నీ తెలుసుకుంది. ప్రథమ కార్యదర్శి మొండిపట్టు మనిషని గ్రహించి, ఆయ నొప్పుకోడనుకున్న పనులన్నీ. ఆయన లేనప్పుడు చూచి, రెండో కార్యదర్శి ద్వారా చేయించుకోవడం ప్రారంభిం చింది. జ్వెజ్దా సమిష్టి క్షేత్రం అధ్యక్షుడు మరీ రాయిలాంటి మనిషనీ, ఐనా అతని కొడుకుని గురించి మాట్లాడితే చాలు మెత్తబడి పోతాడనీ పసికట్టేశింది. ఆయన కొడుకిప్పుడు జలాంతర్గా ముల్లో కమాండర్‌గా పనిజేస్తున్నాడులే. అధ్యక్షునితో పనివచ్చి నప్పుడల్లా. వెళ్ళి ఆ కొడుకుని గురించి కాస్సేపు మాట్లాడి, తనపని

* ముహము చేతులూ కడుక్కోడు కుపయోగించే చిన్న నీటి పళ్ళెం లాంటిది.

క్రాస్తా చేయించుకుని వచ్చేశేది. నివేదికలు, ఒడంబడికలు.... ఒకటేమిటి, అన్నీ చక్కగా పూర్తిచేశేసుకునేది. ఇంటిదగ్గర, తన గిటార్♦ తీసుకుని,

*ఒక గడియ ప్రణయ వారాసిలో ఏలత*
*ఆ పైన ఎదబాయుతో గుంపెకోత.*

అంటూ పాటలు పాడేది. ఆ చేతి వ్రేళ్లుగూడా సన్నగా చూడ చక్కగా వుంటాయి. ఆవిడలా గిటార్ మీటుతూంటే, గిటార్ మీటుతున్నట్టే వుండేదికాదు; హృదయతంత్రుల్ని మీటుతున్నట్టుండేది. ఇలాంటి అనుభవాలు యిదివరకెప్పుడూ స్టెప్పీలో యెరిగిన వాళ్ళం కాదు మేం. ఆవిడ లేకపోతే, యికీ స్టెప్పీ ప్రాంతం ఏమైపోతుందో ననిపించేది. సాయంత్రం అయ్యిందంటేచాలు, వెళ్లొకసారావిణ్ణి చూచి రావాలనే పించేది; లేకుంటే బ్రదకడమే కష్టమనిపించేది. ఫెద్యాకి నాకున్నంత గొడవలేదు; క్రమేపీ చల్లబడి పోయాడు. కాని నేను మాత్రం మానలేదు, ఎప్పటికప్పుడు, పోటీ యెట్లా సాగుతోందో చూశొస్తానని సాకుచెప్పి బయల్దేరేవాణ్ణి అక్కడికి. నేనట్లా వెళ్లడం ఫెద్యాకేమంత యిష్టంగాలేదు. ఒకనాడు, నన్నుపిలిచి, మందలించాడు :

"ఆ పోటీ అంటే నువ్వు చూపే కుతూహలం మంచిదే, పార్టీ దృష్ట్యా; కాని, రోజూ ఆ కారేసుకుని అలా తిరగాల్సిన అవసరం యేమిటో బోధపడ్డంలేదు నాకు. అదట్లావుంచి, మనచుట్టు ప్రక్కలున్న రెండు ఎమ్‌టియెస్‌ల వాళ్ళు నిన్నూ, నీ కారు ప్రయాణాన్నీచూచి అప్పుడే ఎగతాళిచెయ్యడం ప్రారంభించారు. ఎంతలేదన్నా నువ్వీ ఎమ్‌టియెస్ మానేజర్‌వి; ఆ సంగతి గూడా మరిచిపోతే యెట్లా చెప్పు? ఇక్కడ పార్టీ నాయకుడిగా వున్నాననే సంగతి గుర్తుకు తెచ్చుకుని, నేను తగ్గలా వెనక్కి ? నేనేమైనా వొళ్లుమరిచి తిరుగుతున్నానా యిప్పుడు ?"

ఏదో వొకటి చెప్పి తప్పుకోవాలని చూశాన్నేను. మేం యిద్దరం ఆ సంగతి మాట్లాడుకునేప్పుడు, ఫర్జనోవ్ అక్కడే వున్నాడు. మా మాటలు విని నవ్వాడు :

---

♦ సంగీత వాయిద్యం.

"ఆ గండయ్యా, ఆగండి. మన స్టేషన్‌కి వస్తోందొక గ్రామీణ ఆర్థికవేత్త. ఒలోభిఖినో అమ్మాయి తలదన్నే మని షొస్తోంది మనకి!" అన్నాడు ఫర్జనోవ్.

ఇగ్నాత్ ఇగ్నతొవిచ్ మంచి అనుభవం వున్నవాడే; పనిజెయ్యడంలో మంచి సమర్థుడు కూడాను. కాని ఆయనకి కాలేజీ చదువులేదు. అదీగాక, ఆ మధ్య కొంతకాలం నుంచి 'నన్ను విత్తనాల శాఖకి బదిలీ చెయ్యండి' అని కోరుతున్నాడు. అందుకని మాకు ఆయన స్థానంలో యింకొక కొత్త మనిషి రావలసిన అవసరం వుంది. ఉన్నట్టుం డొకనాడు ప్రాంతీయ కేంద్రంనుంచి వార్తొచ్చింది మాకు: 'మీ కొక గ్రామీణ ఆర్థికవేత్తని పంపుతున్నాం. పట్టాపొందిన ఆర్థిక వేత్తని పంపుతున్నాం. కాలేజీనుంచి, సరాసరి, మీ స్టేషన్‌కే పంపుతున్నాం. అక్కడన్నివిషయాలూ పరిచయం చేసుకునేందుకు కొద్దిగా వ్యవధివ్వండి; తర్వాత ముఖ్య గ్రామీణ ఆర్థికవేత్తగా పనిజేస్తుంది' అని

ఆవిడకోసం ఒక గది సిద్ధం చేశాం నేనూ, ఫెద్యా. ఇద్దరం కొత్త 'టై' లు కట్టుకుని బయద్దేరాం రైల్వే స్టేషన్‌కి, ఆవిణ్ణి ఆహ్వానించేందుకు. మాతోపాటు ఫర్జనోవ్ కూడా బయల్దేరాడు. రైల్లోనుంచి చాలామంది దిగారు; కాని అందులో మేం కలుసుకోడానికని వచ్చిన మనిషిలాంటి వాళ్లెవ్వళ్ళూ వున్నట్టే లేదు. బాగా వయసు ముదిరి నావిడ ఒకావిడా, యింకో పదిహేనేళ్ళ పిల్లా మిగిలిపోయారు ప్లాట్‌ఫారం మీద. చివరికి, కళ్లు పెద్దవి చేసుకుని చుట్టూ కలయజూస్తోందా చిన్నమ్మాయి. అప్పటికప్పు డక్కడే యేదో విచిత్రాతి విచిత్రం జరుగుతున్నట్టు చూస్తోంది; మా వెనకేమైనా జరుగుతోందేమోనని వెనక్కి తిరిగి చూశాం గూడాను నేనూ, మా ఫెద్యా. ఏమైనా వుంటేగా కన్పించేందుకు! తిరిగి, మళ్ళీ ఆ అమ్మాయివంక చూశాం. ఆ చూపొక్కటి మినహాయిస్తే, అందరు ఆడపిల్లల్లాగానే వుంది ఆ అమ్మాయినీ: బూడిదరంగు కోటు కిందనుంచి కన్పించే నీలిరంగు బిగుతు లాగూ, అల్లికం టోపీ, పాలుగారే పసిబుగ్గల మొహం. జడల్లి యీ జడటూ ఆ జడటూ నెత్తివెనకే మార్చి, కణతల దగ్గరికి తీసుకొచ్చి కట్టేశిన

నల్ల నల్ల రిబ్బన్లూ ... ఇంకా చిన్నమ్మాయే మా కొత్త గ్రామీణ ఆర్థిక వేత్తని తెలుసుకున్న తర్వాత, మే మెంత ఆశ్చర్యపడిపోయామో చెప్పలేం! ఆ వయసు ముదిరి నావిడ రైలులో తటస్థపడ్డ తోటి ప్రయాణీకురాలు మట్టుకేనట.

ఆవిడ్డా విడ గదిలోకి ప్రవేశపెట్టి, మా దారిన మేం బయటి కొచ్చేశాం. వరండాలో కొచ్చిం తర్వాత,

“నావీపొంకొకసారి చూడండి బాబూ! ఎందుకనోగాని, ఆ అమ్మాయిటు చూస్తే చాలు, నా వీపుమీదే గూనో ఎక్కుతున్నట్టూ, రెక్కలొచ్చినట్టూ అనిపిస్తోంది!” అన్నాడు ఫర్జనోవ్.

మొత్తంమీదా అమ్మాయంటే, మా ఎమ్‌టియెస్‌లో యెవరికీ నచ్చినట్టు కపబడలేదు. ఇగ్నాత్ ఇగ్నతొవిచ్ అంటే మా కందరికీ మంచి ఆదరమూ, గౌరవమూనూ. అలాంటి వ్యక్తికి బదులు యీ చిన్న పిల్లొచ్చిందీ అంటే అందరూ షాక్ తిన్నారు. వెంకా అన్నట్టు, ‘ఈ చిన్నమ్మా యేమిటి? గ్రామీణ ఆర్థిక వేత్తేమిటి!’ పాత అలవాటు ఒక పట్టాన పోదుగదా; ఏ సలహా కావలశొచ్చినా, ఆవిదొచ్చిం తర్వాతగూడా, అందరూ ఇగ్నాత్ దగ్గరికే వెళ్ళేవాళ్ళు అన్నట్టు, మా కొత్త వ్యక్తి పేరు నాస్తాస్యా వాసిల్యెవ్నా కొవ్‌షోవా. అందరూ అలా యింకా ఆయనద్గగ్గరికే వెళ్తున్నారని కోపం వొచ్చినట్టూ లేదావిడికి. ఎలుక పిల్లలా వూరుకుంది ప్రశాంతంగా. సమావేశాలు జరిగేప్పుడొక మూలమూలన కూర్చునుండేది, మధ్య మధ్య కన్నులార్పుస్తూ. ఆ కన్నులార్పడంగూడా ఎప్పుడోగాని చేశేది కాదేమో, మరీ వింతగా వుండేది; కనురెప్పలలా ఒకసారో రెండుసార్లో అల్లల్లాడించేది, అంతే; యిక సూటిగా చూశేది. ఆవిడ కన్నులేమంత పెద్దవీ కాదు; ఐనా చూడగానే ముందు కన్పించేవే ఆ కళ్లు. ఇతరుల కళ్లు చూచేటప్పుడు కంటిపాప రంగెలావుంది, ఆ కను పాప చుట్టూ రంగెలావుంది అని వేరువేరుగా ఆలోచించి చూడంగదా మనం? కానెందుకనో, ఆవిడ కనులు చూడగానే దేనికవి విడదీశి చూశి పట్టనిపించేది. నల్లని కను పాపమధ్య, లేత నీలంచుక్క కొట్టొచ్చినట్టు

కన్పించేది ఆ కనులు చూసీ చూడ్డంతోనే. ఆవిడెక్కడ కూర్చుని చూస్తున్నా నరే, సూదులు గుచ్చుతున్నట్టుండ వలశిందే :

దేన్ని గురించైనా అడుగుతామనుకోండి ఆవిణ్ణి, ముందు మన వైపుకు తిరుగుతుంది, కనుబొమలు రెండూ పైకి లేపి, ఒకటి రెండుసార్లు రెప్పలల్లలాడిస్తుంది; అలాంటప్పు డసలీవిడ చెవుల్తో కాదేమో, ఆ కళ్ళ తోనే వింటూందేమోనని పిస్తుంది : తర్వాత, చెబుతుందన్నమాట సమా ధానం. ఏ మని :

"ఇప్పుడప్పుడే యేమీ చెప్పలేను; యింకా నే నీ పనికి కొత్తదాన్ని గదూ, అందుకని" అని చెబుతుంది సమాధానం; నూటికి తొంభై తొమ్మిది పాళ్లెప్పుడుచెప్పినా అదే జవాబు.

ఒలోభిఖ్నో కి ఆ కొత్తావిడ, లీనా, రాగానే ఆ ప్రదేశమే మారిపోయింది, కాని మా దగ్గర కొచ్చిన మనిషి తన ఆఫీసునే శుభ్రంగా అట్టి పెట్టుకోదు. ఎక్కడ చూచినా దుమ్మే యీావిడ ఆఫీసులో; పాడు పడి నట్టుంటుంది. ఎప్పుడూ ఎక్కడికో వెళ్ళి తిరుగుతూంటుంది పగలల్లా. 'ఎక్కడికి వెళ్ళావమ్మా ?' అనడిగితే, 'సమిష్టి క్షేత్రాలకి' అని చెబుతుంది. కాని మా సమిష్టి క్షేత్రాలుగూడా ఆవిడంటే యేమంత యిష్టంగా వున్నట్టు కన్పించలేదు. మా మంచి మంచి సమిష్టి క్షేత్రాల్లో పనిచేశే వాళ్ళందరూ బాగా అనుభవం వున్నవాళ్లు; ఎవళ్ళుఅడితే వాళ్లొచ్చి చెబితే, వినవలశిన అవసర మేమీలేదు వాళ్ళకి. అందుకని, ఉప్పువర్రల కవతలున్న సమిష్టి క్షేత్రాల కెళ్తుందే దా అమ్మాయి. ఇకేమన్నా లాభం లేదులే అని వూరుకున్నాం మేము. అదీ సంగతి : ఆ అమ్మాయిని ప్రశంసించవలశిన పనీలేదు; మందలించీ ప్రమోజనంలేదు. మరీ అంత చిన్నమ్మాయాయె; ఎవరికీ యే హానీ చేసేమనిషికాదు. అలా ఒక నెల గడిచింది.

కాని, ఆ నెలాఖరయ్యేప్పటికి, మా నాస్త్యా క్రమక్రమంగా, నెమ్మది నెమ్మదిగా మాట్లాడడం ప్రారంభించింది. నమావేశాలు జర్గి

గేప్పుడు నేనూ మాట్లాడతానంటూ లేచేది; అంతకు పూర్వమే మాకు తెలిసిన విషయాల్ని గురించి వుపన్యాసం యిచ్చేది. అచ్చు అక్షరం అంటే ఆవిడ కంతులేని నమ్మకం. పుస్తకంలో వ్రాశినట్టు జరగకపోతే, ఎంతో ఆశ్చర్యపడేది.

ఒకసారిట్లాగే నా దగ్గర కొచ్చింది :

"ఆ ఉప్పు పత్ర లవతల స్టెప్పీల్లో ఎరువు పాతరోజుల్లోలాగా యెక్కడబడితే అక్కడ విసిరేస్తున్నారు. ఏ వాచకంలో చూసినా తెలుస్తుందే ఎరువట్లా పారెయ్యగూడదనీ, కుప్పలు కుప్పలుగా పొయ్యాలనీనీ" అని అంది.

"నిజమేలే ! వాచకాల్లో అట్లాగే వుంటుంది," అన్నా నేను.

"మరైతే, సమిష్టిక్షేత్రం రైతు లట్లా యిష్టంవచ్చిన ట్టెందుకు పారబోసినట్టు ? అర్థం కావడం లేదే."

ఆవిడ ముహం చూస్తేనే తెలుస్తోంది బాగా ఆశ్చర్యపోతోందని.

"వాళ్ళట్లా ఎందుకు పారబోస్తున్నారో చెప్పనా ? పోగులు బొయ్యడంకంటే పారబొయ్యడం తేలిక్కాబట్టి" అని వివరించాను నేను.

కాస్సేపు మాట్లాడకుండా వూరుకుని, మళ్ళీ యింకొక నీతి సూత్రం వల్లించింది :

"అట్లా ఐతే, జిల్లా గ్రామీణ ఆర్థికవేత్త ఆ రైతులికి తెలిసేట్టు చెప్పాలి, ఎప్పు డేది యెట్లా చెయ్యాల్సిందీని. కాలేజీలో మా కదే చెప్పారు : ఆ బాధ్యతంతా జిల్లా గ్రామీణ ఆర్థికవేత్తదని."

"నిజమే, నాస్త్రాస్యావా సిల్యెవ్నా !" అన్నాను నేను విసిగిపోయి; "కాలేజీల్లో మాకూ అదే చెప్పారు."

ఇలాంటి సంభాషణలు ఒకటీ, రెండూ కాదు. అన్నీ యిలాంటివే. అవి వింటూంటే నాకు విసుగూ, కోపమూ; ఫెద్యాకి విచారమూ; ఇగ్నాత్ కి అలసటా; ఫర్జనోవ్ కీ మంటా.

ఫర్జనోవ్ అసలే చురుకైనవాడేమో, యిలాంటి మందకొడి మనుషుల మాటలు వింటే చాలు అగ్గైపోయేవాడు.

ఇక, కార్ఖానాల్లో నాస్త్యా పెట్టే గొడవకి అంతే లేదు.

ఒకసారి, మా సమావేశం ముగియగానే వచ్చింది నాస్త్యా మా దగ్గరికి :

"రోజు రోజుకీ మనకొచ్చే ట్రాక్టర్ల సంఖ్యేమో పెరుగుతూందె, చూస్తే మన కార్ఖానా రోజురోజుకీ దిగజారి పోతోంది. నిన్న మట్టుకు నిన్న ఒక యంత్రం చెడిపోయింది. ఇంకొక యంత్రం బాగా పనిజేస్తే రేపటిదాకా చేస్తుందేమో; తర్వాతదీ మూలబడిపోతుంది. ఇక చెడిపోయే ట్రాక్టర్లనేంపెట్టి బాగు చేస్తామో తెలియదు." అంటూ ప్రారంభించింది.

పోనీ అని వూరుకుందా అంటే అదీలేదు. ఇక తర్వాత మేం యెప్పుడు యెక్కడ కనపడినా సరే, అదే మంత్రం; అదే పాఠం. ఆ విషయం ఆవిడ కొక్కదానికే తెలిశినట్టు; మా కెవరికీ తెలియనట్టు. ఆ విషయం ఆవిడకి తప్ప యింకెవ్వరికీ పట్టనట్టు. అందరూ కళ్లు మూసుకుని కూర్చున్నట్టు. అక్కడి కావిడ అందరినీ తట్టిలేపి, అర్థంకాని విషయం అర్థమయ్యేట్టు చెప్తున్నట్టు :

మేం అందరం విసిగిపోయాం ఆ మాటలు విని విని. ఎవరికి వాళ్ళం మామా కోణాల్నుంచి ఆవిడ కర్థమయ్యేట్టు విషయాలు తెలియ జెప్పాలని నిర్ణయించుకున్నాం.

ఫెద్యా, అతి ఓర్పుగా చెప్పాడు :

"ప్రస్తుతం మన నొక వైరుధ్యం ఎదుర్కొంటోంది : మన కొచ్చే యంత్రాలకీ, వాటిని బాగుచెయ్యాల్సిన మన కార్ఖానాలకీ మధ్య ఆ వైరుధ్యం వచ్చింది. ఒకటి ముందుకి లాగుతోంది; రెండోది దానికి తగినట్టు అభివృద్ధి కావడంలేదు. నిజమే. ఇదే వున్న వైరుధ్యం. ఏ అభివృద్ధి ఐనా సరే. జరుగుతూన్నప్పుడు, యిలాంటి వైరుధ్యాలు రాక తప్పవు. వస్తూనేవుంటై." అని చెప్పాడు.

అతను చెప్పేదంతా శ్రద్ధగా వింది నాస్త్యా.

"క్రిందటివారం పర్జనోవ్ ఒక కారు తీసుకొచ్చాడు. వెంటనే దానికొక మట్టి గరాజ్ వేసేశాడు. మన ఎమ్‌టిఎస్ గూడా మనకొచ్చే

యంత్రాల కన్నిటికీ, అట్లాగే, కనీసం షెడ్లన్నా వెయ్యొచ్చుగదా ?"
అంది.

ఇక లాభం లేదని నే నందుకున్నాను :

"వూరికే మట్టి షెడ్డు లేశినందువల్ల సమస్యలు పరిష్కారం కావు. అదీగాక, యీ సమస్యని యెదుర్కొంటున్నది మనం ఒక్కళ్ళమే కాదు. ఈ ప్రాంతంలో వున్న అన్ని జిల్లాల్లోనూ వుంది యీ సమస్య. ఈ జిల్లాలో వున్న ఎమ్‌టియెస్‌ల్లో పోనీ మనం యేమైనా వెనకబడి వున్నామా అంటే అదీ లేదు. మేం అందరం 'పోటీలుపడి' చేస్తున్నాం వని."

నేను చెప్పింది కూడా చాలా జాగ్రత్తగా వింది నాస్త్యా. విని.

"మనం అంత 'పోటీలు పడి' పనిజెయ్యడం ఎందుకు ? ఈ పోటీల గొడవేమిటో అర్థంకాకుండా వుంది నాకు. మాకు కాలేజీల్లో ఆ సంగతేమీ చెప్పలేదే. పుస్తకాల్లోగాని, పత్రికల్లోగాని యీ పోటీల గొడవ వెక్కడా వుండదు" అని అంది.

అప్పటిదాకా ఓపికపట్టి కూర్చున్నాడు ఫర్జనోవ్; యిక తమాయించుకోలేకపోయాడు :

"అనుభవం వున్నవాళ్లు పుస్తకాలు చదివేప్పుడు రెండు కళ్ళూ తెరిచి చదువుతారు" అన్నాడు. "ఒక కంటితో ఆ పుస్తకాల పేజీల్లో వున్న పంక్తుల అర్థం చూస్తారు; రెండో కంటితో, ఆ పంక్తుల మధ్య వున్న భావాన్ని చూస్తారు. నువ్వా రెండో కన్ను యింకా స్త బాగా తెరవడం మంచిది పుస్తకాలూ అవీ చదివేప్పుడు" అంటూ విసురుకున్నాడు.

నాస్త్యా వెళ్ళిపోయింది.

"ఎందుకయ్యా, ఆవిడ కర్థం అయ్యేట్టు చెప్పాలని వూరికే టైం వృథా చెయ్యడం ? మనం యెంత చెప్పినాసరే, అర్థం చేసుకుంటుందనే నమ్మకం నాకు మట్టుకులేదు" అన్నాడు ఫర్జనోవ్ తర్వాత.

క్రమ క్రమంగా, తర్వాత, అర్థమయ్యింది మాకు. ఎప్పుడెక్కడ ఏ శాస్త్ర లోపం జరిగినాసరే, నాస్త్యా వచ్చేశేది. మెత్తగానే, మృదువు

గానే అనుకోండి. ఆ లోపాలన్నీ విప్పదీసి చెప్పేది. మా యంత్రాల్ని బాగుచేశే కార్ఖానాలుమరీ అధ్వాన్నంగా వున్నాయన్న సంగతి మాకూ తెలుసు. ఐతే, మా వొక్కరి పరిస్థతేకాదు; జిల్లాలోనూ, మా చుట్టుపట్లా అన్నిచోట్లా అలాగేవుంది. ఇకైనప్పుడెట్లాగోట్లా సర్దుకు పోవలశిందే గదాఅని సర్దుకు పోతున్నాం.

ఐనా, నాస్త్యా వూరుకోలేదు. ఏ మాత్రం అవకాశం కలిగినాసరే, ఆ విషయమే ఎత్తుకునేది. మాట్లాడేందుకని ఆవిడ లేచిందంటేచాలు, మాకు దంత వైద్యుడి కుర్చీలో కూర్చున్నట్టుండేది; చెడిపోయిన పన్ను పీకుతున్నప్పుడేశేంత బాధ వేశేది.

"రోజూ అదే పాటా ? పాడిందే పాడరా పాచిపళ్ళ దాసరీ అని ! విసుగన్నా పుట్టడంలా ?" అనడిగా నొక పర్యాయం.

"అందుకని, వూరుకోడం యెట్లా ?" అనడిగింది నన్ను యెదురు; "నేనంతకంటే చెయ్యగలిగిందేమీ లేదని మీకూ తెలుసు. అందుకని నాకు చేతనయ్యిందేదో మాట్లాడుతున్నాను." అని, ఒక్క నిమిషం ఆగి, "ఒకొ్కక్క నీటి బిందువైతే మాత్రమేం. ఆగకుండా పడితేసరి, నల్ల రాయైనాసరే కరక్క తప్పదు." అంటూ వెళ్ళిపోయింది.

ఈ సాదింపుకు మేం అలవాటు పడిపోయాం అని అనుకున్న దంటే చాలు, యింకొక విషయం యెత్తుకుని సాదించడం ప్రారంభించేది.

'సమ చతురం మళ్ళ పద్ధతి' వ్యవసాయాన్ని గురించి నేర్చేందుకొక ఆరుగుర్ని పంపించమని వచ్చింది కబురు పైనుంచి. మా యంత్రాలన్నిటినీ బాగుచెయ్యడం బాగా ముమ్మరంగా సాగుతున్నప్పు డొచ్చిందా కబురు. సరే, న్యాయంగా అప్పుడు మేం యేమని ఆలోచిస్తాం ? మా పని దెబ్బతినకుండా ఆ యంత్రాలు బాగుచెయ్యడాని కవసరంలేని వాళ్ళని పంపాలని అనుకున్నాం. ఎందుకూ పనికిరాని వాళ్ళిద్ద రున్నారుగా : స్తెంకా; వెంకా. వాళ్ళిద్దర్నీ పంపుదాం లెమ్మనుకున్నాం.

ఇంకేముంది; మా గంభీర వనిత వొచ్చేశింది ! నా డెస్క్ ముందు నిలబడి నాస్త్యా అన్నమాట లింకా గుర్తున్నై నాకు :

"మనం ఆ 'మళ్ళ పద్ధతి' వ్యవసాయాన్ని గురించి నేర్చుకు రావడానికి సమర్థుల్ని పంపడంలేదని నా వుద్దేశం." అని అంది మెల్లగా.

నేను చెప్పాను: "ఇప్పు డిక్కడ యంత్రాల్ని బాగుచెయ్యడం అవసరం; పని ముమ్మరంగా సాగుతోంది. అంచేత సమర్థులందరూ యిక్కడే వుండాలి. అక్కడికి సమర్థుల్ని పంపితే, యిక్కడ పని దెబ్బతింటుంది." నిలబడి నేను చెప్పిందంతా వింది నాస్త్యా. కన్నురెప్ప లల్లల్లాడించి, నావంక వింతగా చూచి, వెళ్ళిపోయింది మారు మాట్లాడకుండా.

రెండు మూడు రోజుల తర్వాత, జార్జి ఛూమక్‌ని వెంటబెటు కొచ్చింది. ఛూమక్ మాకున్న మెకానిక్కు లందరిలోకీ మొనగాడు.

ఛూమక్ గుమ్మందగ్గరే వున్నాడు; నాస్త్యా లోపలికొచ్చి నా డెస్కు ముందు నిలబడింది; బుద్ధిగల విద్యార్థిని నిలబడుతుందే పంతులుగారి ముందు చేతులు కట్టుకుని; అలా నిలబడింది.

"సమచతురం మళ్ళ పద్ధతిని విత్తనా లెయ్యడం స్వంతంగా తనిఖీ చెయ్యదలచుకున్నాం మేం అందరమూనూ; విత్తనాల యంత్రాల్ని అన్నిటికీ సంసిద్ధంగా, మొదటిరకం యంత్రాలుగా, తయారు చెయ్యదలచు కున్నాం" అని చెప్పింది, గుక్క విడవకుండా.

"'మేం అందరం' అంటే?" అని కసురుకున్నాను నేను.

"ఈ మళ్ళ పద్ధతిని నేర్చుకునేందుకు, కామ్సొమోల్ * సభ్యులు గోషా, కోస్త్యా ముందు కొచ్చారు స్వచ్ఛందంగా."

ఇక నాకు నోటంట మాటరాలేదు. గోషా అసలు పేరు ఛూమక్; అట్లాగే కోస్త్యా అసలు పేరు బెలుసోవ్. వాళ్ళిద్దరినీ, 'గోషా' అనీ, 'కోస్త్యా' అని వాళ్ళతోబాటు పనిజేసేవాళ్ళూ, మరీ స్నేహంగా వుండేవాళ్లూ తప్ప యింకెవ్వళ్ళూ పిలవరు. ఈ నాస్త్యాకి వీళ్ళతో యింత సాన్నిహిత్యం యెప్పుడేర్పడిందా అని ఆశ్చర్యం వేసింది నాకు.

---

* కమ్యూనిస్టు యువజన సంఘం.

ఇంతలో, ఛూమక్ గూడా వచ్చాడు మా దగ్గరికి. మా ఎమ్‌టియెస్‌లో పనికి సంబంధించినంతమట్టుకు ఛూమక్‌కి మంచి పేరుంది మొనగాడని; కాని తెలివితేటలుగూడా వున్నాయని యెవరూ అనుకోలేదు. మా మెకానిక్ లందరిలోకీ 'బేరింగ్'లు బాగు చెయ్యగలిగిందత నొక్కడే. కలుపుగోలు మనిషికాదు. తనేమో, తన పనేమో; అంతే. రెండు మాటలనే బదులొక యిరవై హెక్టేర్లు * భూమి దున్నడం మంచి దనుకునే మనిషతను. అలాంటి మనిషి, నా దగ్గరకొచ్చి. గొంతు సవరించుకుని ఒక చిన్న వుపన్యాసం దంచేశాడు :

"క్రిందటేడు యీ 'మళ్ళ పద్ధతి' వ్యవసాయంలో వెనక బడి పోయాం మనం యీ జిల్లాలో. అందుకని; యీ యేడైనాసరే ఆ పద్ధతి అమలులోపెట్టి, ఆ పద్ధతిలోవున్న మంచిని నలుగురికీ తెలియజెయ్యాలని నిశ్చయించుకున్నాం. కామ్సొమోల్ సభ్యులుగానూ, దేశభక్తులుగానూ అది మా కనీస కర్తవ్యం" అన్నాడు.

విన్నాను. "నాయనా! ఇదంతా మీకు దేశభక్తిలాగా వుంది; బాగానేవుంది. మరి నా 'బేరింగు' లెవరు బాగుజేసిపెడతారయ్యా నాకు!' అనుకున్నాను.

అదే సంగతి, విపులీకరించి చెప్పాను వాళ్ళకి. నావం కాశ్చర్యంగా చూచి, వెళ్ళిపోయింది నాస్త్యా.

మర్నాడు మళ్ళీ వచ్చింది! అప్పుడే జిల్లా కమిటీ ఆఫీసు కెళ్దామని బయల్దేరుతున్నాన్నేను : మా యంత్రాల బాగుచేత వెనకబడింది. జిల్లా ఆఫీసులో యేం చీవాట్లు తినాల్సొస్తుందోనని అనుకుంటూ నా దిగులులో నేనుంటే, అప్పు డీవిడ మళ్ళీ తయారు! 'మళ్ళ పద్ధతి' వ్యవసాయం ;

నాకు చిర్రుమంది.

"అమ్మాయ్! నీకేమీ పనిలేకపోతే మానె; నీ యిష్టం వొచ్చినట్టు తిరుగు, నాకేమీ అభ్యంతరం లేదు. కాని యిట్లావచ్చి పని చేసుకునే

* షుమారొక కుంట లోపు.

వాళ్ళ పనికిగూడా అడ్డం తగలడం మాను; నీకు పుణ్యముంటుంది" అనేశాను, నిర్మొహమాటంగా.

నాస్త్యా చెంపలు ఎర్రబడినై; తలొంచుకుని వెళ్ళిపోయింది.

జిల్లా కమిటీ ఆపీసులో, కార్యదర్శితో మాట్లాడుతూ కూర్చుంటే అక్కడి కొచ్చేశిం దీవిడిగారు.

వెనకనుం చెవరో తోసుకొస్తున్నట్టొచ్చింది ముందుకి. ఎప్పటి లాగానే ఆ బిగుతు లాగూలు, రెండు కణతల దగ్గిరా కట్టిన జడల రిబ్బన్లు. వచ్చి గదిమధ్య నిలబడిపోయింది. కన్నుల్లో విచారం. చెప్పింది కాస్తా ఆగి ఆగి చెప్పింది. కాని ఆ ఆగి ఆగి చెప్పడంలోనే వుంది; ఎక్కడ, ఎప్పుడు, ఏమాట మాట్లాడాలోనని ఆచి ఆచి తూచి తూచి వేసినట్టుంది మాటలు! ఆ మాటలు గూడా ఎలాంటి మాటలని? 'మళ్ళ పద్ధతి నంత తక్కువ అంచనా వెయ్యకూడదు;' 'కామ్సొమోల్ సభ్యుల చొరవని తక్కువ అంచనా వెయ్యగూడదు' లాంటి మాటలు.

ఆ రోజుల్లో, నేనేకాదు, కార్యదర్శికిగూడా ఆవిడ గొడవ పట్టించు కునేపాటి తీరుబాటులేదు. ఆ గత రెండేళ్ళలోనూ మా వ్యవసాయ యంత్రాలు రెండు రెట్లు పెరిగినై; కాని కార్ఖానాలు యెప్పటిలాగానే వున్నై ఎదుగూ బొదుగూ లేకుండా. అంతే కాకుండా, పూర్వంనుంచీ వున్న వస్తువులన్నీ పాతబడిపోయినై. కొన్ని పనికిరాకుండా పోయినై. యంత్రాలక్కావలసిన అదనపు పరికరాల్లేవు. వీటి కన్నింటికి తోడు జనం తక్కువ. యంత్రాన్ని బాగుచెయ్యడానికా యేడు పడినంత రొడతొక్కి డంతకు ముందెప్పుడూ పడియెరగం. మొత్తం జిల్లా అంతా అట్లాగే వుంది. వెనుకబడిపోయి. ప్రాంతీయ కేంద్రాలనుంచి, ప్రతీరోజూ, కార్యదర్శికి ఫోన్; నానా చీవాట్లూ పెడుతూ. కార్యదర్శి గారేంజేస్తాడు; సహజంగా ఆ వొత్తిడంతా మా మీదికి బదిలీ చేస్తాడు. అలాంటప్పుడు యీ నాస్త్యా వచ్చి మాకున్న మంచి మెకానిక్ల్ని 'మళ్ళ పద్ధతి' వ్యవసాయం నేర్చుకునేందుకు పంపమంటే! ఆ క్షణం చెయ్యవలసిన కర్తవ్యాన్ని మరచిపొమ్మంటే ఎలా సాధ్యం?

ఛాలికోవ్ మళ్ళీ నావంక చూచి, ఒక చిరునవ్వు నవ్వాడు నర్మ గర్భంగా.

కార్యదర్శి తాను చెప్పవలసినదంతా చెప్పాడు నాస్త్యాకి. ఆవిడా, నేనూ, యిద్దరం ఒకే కారులో బయల్దేరాం యింటికి. ప్రయాణం ఏమీ బాగాలేదు; నాకు విసుగ్గా వుంది. నాస్త్యా శక్తిసామర్ధ్యాల్ని చూపడానికి చాలాకాలం పట్టింది; తీరా చూస్తే, ఆ నాస్త్యా మే మనుకున్న నాస్త్యా కాదు.

"నీ ఫిర్యాదేమీ పనిచెయ్యలేదు" అన్నానేన్నను.

నా వంకొక సారి సూదులుగుచ్చే చూపు విసిరి, మామూలు ధోరణిలో,

"నేనంటే మీ క్రోధం అనవసరం. కార్యదర్శికి ఫిర్యాదుచేసింది మిమ్మల్ని మూడుసార్లు కలుసుకున్న తర్వాతేగదా. అంతకుముందు మూడుసార్లు కలుసుకున్నాను మిమ్మల్ని" అంది.

అని, కాస్సేపు మెదలకుండా వూరుకుని, కనురెప్ప లల్లల్లాడించి,

"బహుశా నే ననుకునేదీ, నే చెప్పేదీ తప్పైతే కావొచ్చు. నాకు మట్టుకది తప్పని అనిపించడంలేదు. అందుకనే నేనింత పట్టు పడుతున్నాను, అలెగ్జీ అలెగ్జీయెవిచ్." అని అంది, వున్నట్టుండి.

రోజులు గడచినై. జిల్లా కమిటీనుంచి ఒకనాడు ఫోనొచ్చింది అకస్మాత్తుగా. 'మళ్ళ పద్ధతి' వ్యవసాయం నేర్చుకునేందుకు పంపే వ్యక్తుల పేర్లని గురించి పునరాలోచించమని హెచ్చరిక అది. మా గ్రామీణార్థికవేత్త, జిల్లా కమిటీకి అధికారపూర్వకంగా ఫిర్యాదు చేశిందట; ఆ ఫిర్యాదు కాపీని ప్రాంతీయ కేంద్రానికి గూడా పంపిందట.

చివరి కావిడకి లోబడక తప్పలేదు. కాని మా అందరికీ ఆవి డంటే బాగా మంటగా వుంది. ఇంతవర కెప్పుడూ, జిల్లా కమిటీకిగాని

ప్రాంతీయ కేంద్రానికిగాని యిలాంటి ఫిర్యాదు లెవరూ పంపియెరుగరు. ఈవిడగారొచ్చి రెండు మాసాలైందో లేదో, అప్పుడే ఫిర్యాదులు రాయడం ప్రారంభించింది! పోనీ యేమన్నా పనిజేస్తోందా అంటే అదీ లేదు; పని జెయ్యలేకపోతే మాత్రమే. ఫిర్యాదులు చెయ్యటంలో బాగా ఆరితేరిన చెయ్యైపోయింది!

మాలో వొక్కళ్ళకి గూడా యిష్టం లేకుండాపోయింది నాస్త్యా అంటే. మా అందరిలోకీ ఫర్జనోవ్‌కి మరీనీ. ఆవిడ పొడంటేనే గిట్ట కుండా పోయిందాయనకి. అందులో యిద్దరూ రెండురకాల వ్యక్తులు. ఫర్జనోవ్‌కి అంతులేని ఆత్మవిశ్వాసం. గదిలోకొచ్చి, తలతిప్పి మాట్లాడ్డం ప్రారంభించాడంటే చాలు, అందరూ ఆయనవైపుకి తిరిగేవారు ఏం మాట్లాడతాడో వినాలని. తనలాంటివాళ్ళు కాని వ్యక్తులంటే ఆయనకు చిరాకు. అలాంటి వాళ్ళంటే చిన్నచూపుగూడా చూచేవాడు. అంచేత, నాస్త్యా అంటేనే కోపం ఆయనకి. నాస్త్యాకి అధికారపూర్వకంగా ప్రవ ర్తించడం చేతరాదు; ఇతరుల గౌరవాన్ని పొందడం యెట్లాగో తెలి యదు. దానికితోడా బిగుతులాగూలు; ఆ జెడలు. అందుకని, 'ఆర్థిక దివాళా' అని పిలిచేవాడు నాస్త్యాని.

"భలే గ్రామీణార్థిక వేత్తలే!" అనేవాడు; "అసలావిడ మాట్లాడే దాంట్లో ఒకదానికొకదాని కెప్పుడూ సంబంధమంటూ వుండనే వుండదు. అదేం ఆడదయ్యా! జుత్తుదువ్వుకోడం చేతగాని ఆడది; భలే ఆడదిలే!"

ఉన్నట్టుండి కార్ఖానా వ్యవహారాల్లోనూ, యంత్రాల వ్యవహారా ల్లోనూ గూడా జోక్యం పెట్టుకోవడం ప్రారంభించింది నాస్త్యా! అలా [illegible] జోక్యం కలగజేసుకున్నా వూరుకోలేని మనిషి ఫర్జనోవ్. ప్రథ మంలో వార్నికే ఎద్దేవ చేశాడు; తర్వాత అసలు లక్ష్యం చెయ్యడమే మానేశాడు. కాని, నాస్త్యా అంత తేలిగ్గా పట్టినపట్టు వదలదని తెలుసు కుని ఆశ్చర్యపోయాడు.

ఒకసారిక కోపం పట్టలేక, నా దగ్గరకొచ్చాడు మండిపోతూనూ. "[illegible] ఆ చిన్నమ్మాయి వున్నచోట వుండదిక. మనక్కావలసినవన్ని [illegible] తెచ్చిపెడ్తుంది [illegible] అలాంటి వాళ్ళనా యిక్కడకు తీసుకు

కావలసింది? భలేదాన్నే తీసుకొచ్చావు. వాళ్ళతో పనిచెయ్యడం అంటే, యిక కొరివితో తలగోక్కున్నట్టే. మరీ మొద్దుబుర్రలు. చెప్పిందొక పట్టాన యెక్కదు. సొంతంగా యెలాగూ ఆలోచించరు. ఏదో ఒక చిన్న విషయం పట్టుకుంటారు; తెగేదాకా లాగి వదిలిపెడతారు. ఎమ్‌టియెస్‌లో పనంటే మాటలా. వొఠి గందరగోళప్పని. అలాంటి చోట. ఎవరైనా పట్టుకోగలరు యేదోవొక తప్పు. ఇకా లోపం పట్టుకుని అందరి గౌరవమర్యాదలూ తీసెయ్యనూవచ్చు. ఇప్పటికైనా నువ్వావిణ్ణి హెచ్చరించడం మంచింది. చేతులు కాలింతర్వాత, ఆకులు పట్టుకుని లాభం వుండదు; ఇప్పుడే చెబ్తున్నా" అన్నాడు.

నాస్త్యా వచ్చిన మొట్టమొదటి రోజుల్లో ఎంత చిరాకుగా వున్నా, పైకి మర్యాదకి లోపం రాకుండా మాట్లాడేవాడు; ఇప్పుడదికూడా మానేశా డాయన. మమ్మల్నిగూడా తనలాగే వుండమని చెప్పాడు.

"ఆవిడ మన ఎమ్ టి యెస్ మనిషి కానేకాదు. ఆ విషయం ఆవిడక్కూడా అర్థమయ్యేటట్టు ప్రవర్తించడం మంచిది" అనేవాడు.

మేమందరం ఆవిడకి దూరం దూరంగా వుండడం ప్రారంభించాం, అప్పుడే మాలో మాకు స్నేహం గూడా బాగా యెక్కువైంది. ఇకప్పట్నుంచి మా అందరికీ లీనా అంటే ఆకర్ష ణెక్కువైంది; సహజమేగా. ప్రతిరోజూ వేటకి అందరం కలసి వెళ్ళేవాళ్ళం. ఒక్కోసారి మంచుమీద ఆటల కెళ్ళేవాళ్ళం. సాయంకాలమప్పుడు అందరం కలిసి పాటలూ అవీ పాడుకునేవాళ్ళం. లీనా మాకు కొన్ని కొత్త డాన్సులు గూడా నేర్పింది. మేం అందరం కలసికట్టుగా వుండేవాళ్ళం; నాస్త్యాని వెలేశినట్టు చూచేవాళ్ళం.

మాలో మేం నవ్వుకుంటూ, హాస్యాలాడుకుంటూ మాట్లాడుకునేవాళ్ళం. నాస్త్యాతో మాట్లాడాల్సొస్తే మట్టుకు లేనిపోని అధికార స్వరం వుపయోగించి మాట్లాడేవాళ్ళం. పాపం, యెంత బాధపడుతోందో లోపల అనుకునేవాణ్ణి నేను ఆవిణ్ణి చూచినప్పుడల్లా. అందులోనూ చిన్న పిల్ల. చోటా కొత్తది. నా అన్న వాళ్ళెవళ్ళూ లేరు. స్నేహితులూ లేరు; బంధువులూ లేరు. అలాంటిచోట ఒంటరిగా; ఏకాకిగా వుండడం అంటే

మాటలా. నేనే ఆవిడ స్థితిలో వుంటే, తప్పకుండా నిస్పృహ పడిపోయే వాణ్ణి; అనుమానంలేదు. బహుశా ఆవిడా బాగా నిస్పృహ పడిపోయే వుంటుంది. ఎందుకనంటే, మొదట్లో ఎప్పుడూ తనలోకి తాను ముడుచుకుపోయినట్టుండేది. మేం మాట్లాడినప్పుడల్లా, మావంక కను రెప్ప వెయ్యకుండా చూస్తూనేవుండేదిగాని, మేం యిదివరకటికిమల్లే మా వీపుల వెనక యేం విచిత్రాలు జరుగుతున్నాయోనని వెనక్కి తిరిగి చూడడం మానేశాం. ఉన్నట్టుండి అగస్మాత్తుగా మమ్మల్ని గుర్తించడమే మానేశింది నాస్త్యా. మమ్మల్ని చూశినా, చూచీ చూడనట్టు వెళ్ళిపోవడం ప్రారంభించింది. మెకానిక్కుల్లో కొంతమందిని స్నేహం చేసుకున్న ట్టుంది. మమ్మల్ని ఖాతరు చెయ్యడం మానేసింది.

ఛాలికోవ్ యేదో ఆలోచనలోపడి మాట్లాడడం మానేశాడు. అలాగే రైలుపెట్టె కిటికీలవంక చూస్తూ కూర్చున్నాడు :

"బహుశా నాస్త్యా అప్పటికే మేమంటే ఒక అభిప్రాయాని కొచ్చేశుండాలి; యిక మమ్మల్ని గురించాలోచించడం అనవసరం అని అనుకునుంటుంది; అంతేనా ?" అని బిగ్గరగా ఆలోచిస్తున్నట్టు, తన్ను తానే ప్రశ్నించుకున్నాడు. "లేకుంటే యింకొకటి గూడా కారణమై వుండొచ్చును : అప్పటి కావిడ తన గమ్యస్థానం ఫలానా అని నిర్ణయం చేశేసుకుంది. కాబట్టి యికా గమ్యాన్ని చేరుకునేవరకూ యిలాంటి స్వల్ప విషయాల్ని గురించి మాట్లాడ్డంగాని, పట్టించుకోవడంగాని మానేయాలని అనుకున్నా అనుకుని వుండొచ్చును. బహుశా, అవి రెండూగూడా కారణాలేనేమో. ఏమో. ఈ ఆలోచనలన్నీ యిప్పు డొస్తున్నాయిగాని అసలప్పుడు యీ విషయం ఆలోచించనైనా ఆలో

చించలేదు మేం. మేమందరం దళ నాయకులం కాబట్టి ఆవిడ మా స్థాయికి చాలా క్రిందవున్నదనీ, ఆ ట్రాక్టర్ డ్రైవర్లూ, మెకానిక్కులే ఆవిడకి తగినవాళ్లలే అనుకునీ వూరుకున్నాం.

తర్వాత మెకానిక్కులికీ, సమిష్టిక్షేత్రం రైతులికీ పాఠాలు చెప్పడం ప్రారంభించింది నాస్త్యా. పాఠాలు చెప్పడం పూర్తి ఐపోయిం తర్వాతగూడా, సాయంకాలాలప్పుడు చాలాసేపు వాళ్ళతోనే గడుపుతుండేది. ఔనుమరి! ఇంకేం చేస్తుంది. ఇంకెవరున్నారు కాబట్టి వెళ్తుంది యెక్కడికైనా. అక్కడున్నా ఒకటే; ఇంకెక్కడికెళ్ళినా ఒకటే. గోషా అంటే, నాస్త్యాకి స్నేహం మరీ యెక్కువైంది. ఎమ్‌టియెస్ గేటుపక్కన బల్లమీద కూర్చునేవారు యిద్దరూనూ సాయంకాలమప్పుడు. ఒకనాడు, బాగా పొద్దుపోయింతర్వాత అటెళ్ళాలిశొచ్చింది నేను. పైన చందమామా లేదు చుక్కలు లేదు. ప్రతిచోట అంతా నిశ్శబ్దంగా వుంది ఆ చీకట్లో గోషా మాటలు వినిపించినై నాకు. మాట లన్నీ స్పష్టంగా వినిపించలేదు. మధ్యమధ్య ఆగిపోయినట్టుగా గూడా వున్నై. ఒక్కోసారి గిటార్ నలాగే వాయిస్తాను. తంత్రులు మీటిమీటి, చివరికి తంత్రు లన్నిటిమీదా ఒక్కసారి వేయేసి ముగిస్తారు పాటని. 'తన ప్రేమని గురించి నాస్త్యాకి చెబుతున్నా డనుకుంటా, అంతే; సందేహం లేదు!" అనుకున్నా నేను.

'ఇష్టం', 'మనసు', 'నాస్త్రాస్యా వాసిల్యెవ్నా' లాంటి మాటలు గూడా వినిపించాయి దూరంగా వుండగానే. కాని, దగ్గరకెళ్ళిం తర్వాత అర్థమయ్యింది నాకు, గోషా యేమంటూన్నదీనీ.

"నాస్త్రాస్యా వాసిల్యెవ్నా! ఎప్పుటికప్పుడు మనకి కావలసినవన్నీ ముందే తెప్పించుకుని అట్టిపెట్టుకోవడమంటే యిష్టం నాకు. మనక్కావలసినవన్నీ మన దగ్గర వున్నాయనే ధైర్యం వుండాలి మనకి. డీజల్ ట్రాక్టర్ ఎంత మంచిదైనా, ఒక మామూలు గుర్రం కంటేగూడా తక్కువ పనే చెయ్యవచ్చును. ఎందుకని? ఎందుకంటే, ఏదైనా చెడి పోతుందనుకో-అప్పుడు మన దగ్గర ఆ చెడిపోయినదానికి బదులు కొత్తదెయ్యాలంటే వుండదు. ఇక ట్రాక్టరేం చేస్తుంది; మూలవి

పడుండడం తప్ప! నా మన సిలాంటి అస్తవ్యస్తపు పనుల కొప్పుకోదు నాస్త్యా వాసిల్యెవ్నా!" అని అంటున్నాడు గోషా.

"మరి ఛీఫెంజినీర్ సంగ తేమిటి?" అనడిగింది నాస్త్యా మృదువుగా.

"ఈ ట్రాక్టర్ల కన్నిటికీ వ్యక్తిగతంగా చీఫెంజినీరే బాధ్యుడు" అని చెప్పాడు గోషా; "కాని యేం లాభం? ప్రశ్నలేసుకునేదీ ఆయనే; జవాబులు చెప్పుకునేదీ ఆయనే. రెండూ చేసే దొకమనిషే ఐతే యింకా మంచి జరగాలంటే యెట్లా జరుగుతుంది?" అంటూ పుద్రేకపడి పోయాడు గోషా; "లాభం లేదు; ఇలాంటి అస్తవ్యస్తప్పనులు చూచి కోపం తెప్పించుకుని లాభంలేదు అనుకుంటూనే వుంటా. ఐనా నా మన సొప్పుకోదు, వూరుకోదు!"

'బాగానే వుంది. మంచి ప్రేమే! చుక్కల వెలుతుర్లో కూర్చుని వాళ్ళ పై అధికార్లని విమర్శించుకుంటున్నారు!' అనుకున్నా నేను.

నాస్త్యాకి గోషా ఒక్కడే కాదు స్నేహితుడు; ఇంకొకతను గూడా వున్నాడు. అతని పేరు స్త్యోపా బెస్సొనోవ్. మా సమిష్టి క్షేత్రా లన్నిటి లోకీ వెనకబడివున్న అక్టోబర్ సమిష్టి క్షేత్రంలో దళ నాయకు డతను. చీకటి పడింతర్వాత. ముళ్ళకంచె ప్రక్కనో వూళ్లో వీధులవెంటో తిరుగు తుండేవారు యిద్దరూ కలిసి. ఎప్పుడూ కొత్త జాకెట్ వేసుకునుండేవా డతను పెద్ద ప్రముఖ వ్యక్తిలాగా. గ్రామీణార్థిక వేత్తతో కలిసి తిరగడమే మహా గొప్పలాగా అనిపించుంటుందతనికి. ఒకనాడు నేను క్లబ్బు కెళ్ళి తిరిగొస్తున్నా; నా ముందే నడుస్తున్నారు వాళ్ళిద్దరూనూ.

ఆవిడతో యేదో ఫిర్యాదు చేస్తున్నా డతను: "మా సమిష్టి క్షేత్రం యింకొద్దికాలంలో బాగా అభివృద్ధి ఔతుందనే నా నమ్మకం; కాని మాకొక బెడదొచ్చి పడింది. మా దళంలో ముగ్గురు ఓల్గాలున్నారు. ఎంతసేపూ నిద్రపోవడమూ, లావెక్కుతూవుండడం తప్ప యింకొక పనంటూ లేదు వాళ్ళకి. క్రిందటి సంవత్సరం గోధుమపంట దెబ్బతింది. కాస్తదైనా మనసులో పెట్టుకుని సరిగ్గా పనిచెయ్యండని ఎంత చెప్పినా చపేమిరా వినడంలేదు. పైపెచ్చు నా ముహంమీదే నవ్వి పారేశారు.

ఇకే మొహం పెట్టుకుని మాట్లాడగలను వాళ్ళతో. మీరే చెప్పండి నాస్త్యా వాసిల్యేవ్నా! మీరు తప్ప యిక నామాటలు వినేవాళ్లుగూడా కన్పించడంలేదు. మీకు చెప్పుకుంటేనే, యెంతో కొంత వుపశమనం కలుగుతుంది నాకు.'

నాస్త్యా నిట్టూర్చింది.

'ఆ ఓల్గాల నందరినీ వార్వారా దళానికి మారిస్తే ఎలావుంటుంది ? మీకేమీ అభ్యంతరం వుండదుగా ?' అనడిగింది.

'వార్వారా మంచి నిక్కచ్చి మనిషి. కాని, ఆవిడ భర్త చని పోయాడు. అప్పట్నుంచీ అదోకరకంగా వుంటోందావిడ. మీ రెప్పుడూ అలా వున్నట్టే వుండరు....'

నాస్త్యా తాను చెప్పే విషయా న్నొదిలిపెట్టలేదు.

'ఆ ఓల్గా లందరిలోకీ మరీ కనాకష్టం మనిషిని యింకొక దళం లోకి మారిస్తే ?' అనడిగింది మళ్ళీనీ.

ఆ సంభాషణ విన్నతర్వాత, నే నొక టనుకున్నాను. స్త్యోపా బెస్సొనోవ్‌కి నాస్త్యా అంటె బాగా యిష్టం. వీలుంటే ఎగిరి గంతేసిమరీ చెప్పడానికి సిద్ధంగా వున్నాడతను, తన లోపలి అభిప్రాయాన్ని. కాని, ఆవి డలా దైనందిన వ్యవహారాలు మాట్లాడుతూంటే ఆపలేదు; కిక్కురు మనకుండా వింటాడు.

కాని, నాస్త్యా ఆప్తులందరిలోకీ ముఖ్యుడు సిలాంతీ తాత. ఎప్పుడూ హుషారుగా వుండే మనిషి. వెనకటపిన అక్టోబరు సమిష్టి క్షేత్రం అన్నానే యిందాక. ఆ సమిష్టి క్షేత్రంలో దళనాయకుడుగా వుండేవాడు యిదివరకు. ఆ క్షేత్రంలో రోజువారీ కూలి చాల తక్కువ. ఆ తాత కిద్దరే బిడ్డలు; ఆ యిద్దర్నీ ఫాసిస్టులు పొట్టన పెట్టుకున్నారు. వయసునిబట్టి చూస్తే, ఎప్పుడో పనిమానేసి విశ్రాంతి తీసుకోవలసింది ఆయన. కాని, పని వదల్లేదు; ఇప్పటికీ బాగా దృఢంగా వుంటాడు.

'నా యింట్లో రొట్టెకెప్పుడూ కరువులేదు' అనేవాడా తాత. 'మాంసమూ, సోమరితనమూ....ఇవి రెండూ మహా చెడ్డవి; ఊరికే లావెక్కిపోతాం. ఇంత రొట్టె, ఇంత కూర, చేతినిండా పని, చుట్టు

ప్రక్కలంతటా న్యాయం సౌహార్ద్రతా వుంటే చాలు....జీవితం అంతా భూతలస్వర్గంలా వుంటుంది.'

ఆ తాత, అన్నమాటకి కట్టుబడి నడిచేవా డెప్పుడూనూ. జవదాట కుండా. అందుకని విచారించవలసిన అవసరమూ కలగలే దాయనకి. ఉపన్యాసాలంటేనూ సినిమాలంటేనూ బాగా సరదా. జిల్లాలోకి ఏ నాయకుడైనా సరే వచ్చాడంటే చాలు, ఆ వుత్సాహంలో అంతా తల క్రిందులు చేసేశేవాడు సిలాంతీ తాత. ప్రత్యేకించి తనని చూచేందుకే ఆ నాయకు డొచ్చాడన్నట్టు హుషారు పడేవాడు. భలేవాడులే ఆ సిలాంతీ తాత! కొత్త గ్రామీణ అర్థికవేత్త వచ్చిందీ అని వినగానే, వెంటనే వచ్చి పరిచయం చేశేసుకున్నాడు; తన రెక్కక్రిందికి తీసుకున్నాడు.

'ఆ యమ్మాయి చాలా చిన్నపిల్ల. తల్లి దండ్రులా ఎక్కడో దూరాన వున్నారు. కనీసం యీ తాతనన్నా వుండనివ్వండా అమ్మాయి ప్రక్కన' అన్నాడు.

సిలాంతీ తాతా, నాస్త్యా ఎప్పుడూ కలిశే వుండేవారు; ఎప్పుడూ యేదో వొకటి మాట్లాడుకుంటూ వుండేవారు. అదీగాక, వాళ్ళిద్దరి చూపులికీ రూపాలకీ కొంత సామ్యం వుంది గూడాను. మొట్టమొదటి రోజుల్లో నాస్త్యా చూశేదే, ఏదో పెద్ద విచిత్రం జరిగిపోతూన్నట్టు: తాత గూడా అంతే, అలాగే చూస్తుంటాడు.

అదీ కథ. అలా ఎవరి దారిన వాళ్ళం బ్రతుకుచూ వున్నాం. నాస్త్యా స్నేహితులు నాస్త్యా కున్నారు; సరే మా సంగతిదివరకే చెప్పాను గదా. ఒకళ్ళ గోడ వొకళ్ళం పట్టించుకోకుండా యెవరి దారిని వాళ్ళం వుంటూవున్నాం,

ఆ వసంత కాలంలో, బాగా యిబ్బంది పడిపోయాం మేం. బోలెడు యంత్రాల్ని వూడదీశి బాగుచేయాల్సొచ్చింది. కార్ఖానాలో రెండు పనిముట్లు మూలనబడిపోయినై. గోరుచుట్టుమీద రోకటిపోట న్నట్టు, మా మెకానిక్కుల్లో మంచివాళ్ళు 'ఆ మళ్ళ పద్ధతి' వ్యవసాయం నేర్చుకు రావడాని కెళ్లారు. అప్పుడుగాని తెలిసి రాలేదు మాకు, గోషా విలవ యెంతైందినీ: అతని నిలువెత్తుబంగారం పోశినా అలాంటి మనిషి

దొరకదనిపించింది. ఇదివరకెక్కడ యే యంత్రం చెడిపోయినా సరే, గోషా వచ్చేశేవాడు. రాడు అన్న ప్రశ్నే వుండేదికాదు. ఆ యంత్రాలు నడిపే వాళ్ళే పిలచుకొచ్చే వాళ్ళందర్నీ లేకుంటే నేనే పిలిచి.

'కాస్త సాయం చేసిపెట్టు గోషా' అనేవాణ్ణి.

అంతే. సాయంచేసేవాడు. మాట్లాడకుండా. మూడో మనిషికి తెలియకముందే. పూర్తిచేసేశేవాడు పని. అతను కార్ఖానానుంచి వెళ్ళిం తర్వాతగాని అర్థం కాలేదు మాకు, మేం యెంత మంచివ్యక్తిని పోగొట్టు కొన్నదీనీ. ఆ 'మళ్ళ పద్ధతి' వ్యవసాయం నేర్చుకొచ్చేందుకు వెళ్ళిన వాళ్లు బహుకొద్దిమందే; ఐనా మా గుండెకాయ తీసేసి నట్లయింది. ఇది వరకెప్పుడూ యంత్రాల్ని బాగుచేసుకోవడం, మా చుట్టు ప్రక్కలందరి కంటే చాలా ముందు పూర్తిచేసుకునేవాళ్ళం. అలాంటి దిప్పుడు తల్లి క్రిందులైంది. దానికి తోడు పాడు వాతావరణం ఒకటి! ఇవ్వాళ చూస్తే మే నెలలాగా వుండేది ఆ యెండా అదీనీ; రేపీపాటికి జనవరి నెలలోకి మల్లే ఎక్కడచూసినా ఒకటే మంచుపోత. మేం అలాంటి ఆందోళనలో బాధపడుతూండగా, వచ్చింది నాస్త్యా ఒకనాడు. ఆవిడ ముహం చూచి, ఫర్జనోవ్ అనసే అన్నాడు.

'మళ్లీ యేదో ఒక బ్రహ్మాండమైన విషయం కనిపెట్టినట్టుందయ్యో' అని.

వచ్చి, మా టేబుల్ దగ్గిర కూర్చుని, ఒక పునర్నిర్మాణ సమస్య నుంచింది మా ముందు.

ఆ 'మళ్ళ పద్ధతి' వ్యవసాయాన్ని గురించి మూలాగా అభిప్రాయ పడినట్టు లేదు నాస్త్యా. తన పనికీ, ఆ పద్ధతికీ యేదో అవినాభావ సంబంధం వున్నట్టు మాట్లాడింది. మా ప్రాంతంలో క్లోవర్ గడ్డి బాగా పెరగదు కాబట్టి, జొన్నా, ప్రొద్దుతిరుగుడు పూలచెట్లూ వెయ్యడం మంచిదనీ. అదికూడా మళ్ళ పద్ధతిని జరగాలనీ చెప్పుకొచ్చింది మాకు.

తానేసుకొచ్చిన లెక్కలూ అవీ అన్నీ మా టేబుల్ మీద పెట్టి, కొంచెం మునిగిపోయినట్టు మాట్లాడ్డం ప్రారంభించింది. మాకు ఏడవాలో, నవ్వాలో అర్థం కాలేదు; కళ్ళప్పగించి వింటూ కూర్చున్నాం. అసలు

విషయం యేమిటంటే. మా సాగు పద్ధతుల పథకాలన్నీ యిదివరకే పూర్తైపోయినై. ఆ పద్ధతు లన్నిటినీ ప్రాంతీయ కేంద్రం ఆమోదించింది. సమిష్టి క్షేత్రాల సమావేశాల్లో ఒడంబడిక లన్నిటిని గురించి చర్చించ డమూ. సంతకాలు పెట్టడమూ గూడ పూర్తైపోయింది. విత్తులు చల్లి. ఆకుమళ్లు పోశేకాలమా దగ్గరకొచ్చింది. యంత్రాల్నెంత తొందరగా బాగు చెయ్యగలమా అని మేం సతమత మౌతున్నాం. ఆవిడగారేమో. తన తలతిక్కంతా చేతిలో కాగితాలమీద పెట్టుకుని తయారైంది. అన్నీ ఐపోయింతర్వాత !

నిజమే. ఇదివరకే మా జిల్లాలోనూ, మా చుట్టుప్రక్కలా వున్న గ్రామీణార్థికవేత్తలు యిప్పుడావిడ చేస్తూన్న సూచనల్ని. క్రిందటి ఆకు రాలు కాలంలోనే చేశారన్నమాట నిజమే. ప్రాంతీయ శాస్త్ర పరిశోధన కేంద్రంవాళ్లు అందు కొప్పుకోలేదు. పాత పంటల్నే. యింకా జాగ్రత్తగా చేసి, యెక్కువ పండించడానికి కృషి చెయ్యండని సలహా యిచ్చారు. మా కదంతా కొట్టిన పిండి. ఈవిడగారి కదేమీ తెలియదేమో అంతా తానే కనిపెట్టేశే నట్టొచ్చిందిప్పుడు.

ఆవిడ కిదంతా వివరంగా చెప్పాం. ఈ పంటల్ని గురించి వాస్లీలీ విలియమ్స్ చెప్పిన సూత్రాలుగూడా గుర్తుచేశాం

'విలియమ్స్ చెప్పింది నేనూ చదివాను పంటలు బాగా పండేట్టయితేనే. తాను చెప్పిన సూత్రాలు వర్తిస్తాయనీ ఆయనే వ్రాశాడు' అంది నాస్త్యా.

'సరే. ఐతే నువ్వేగదా గ్రామీణ ఆర్థికవేత్తవి. ఇంకేం. పంటలు బాగా పండేట్టు చూడడం నీ బాధ్యత !' అన్నాను నేను.

' ఈ నేలకి అనువైన విత్తనాలు కావాలంటే. ఎంతోకాలం పరిశోధన చేసి, అమలుజరుపుతూవుంటేగాని, తెలుసుకోవడం సాధ్యం కాదు; అప్పటిదాకా యెట్లా ఆగుతాం. ఈ సంవత్సరానికి ధాన్యం కావాలి గదా ?'

'నిజమే. ఐనా మనకి ముందు చూపుండాలి మీరు చెప్పినట్లు క్లోవర్ గడ్డిని వెయ్యడం మానేద్దాం సరే; మరి నేల సారం సొదేస్తుందే ఆదా పడం ఎట్లా ? అనడిగా నేను.

'ఆపడం యెట్లాగా? నేన్చెపుతా వినండి. నన్ను తెరెంతీ సెమ్యో నొవిచ్ మాల్త్సెవ్ దగ్గరకి పంపండి; తెలుసుకునీ నేర్చుకునీ వస్తా.'

'నీకు తెలియదాయె; నువ్వూ నేర్చుకుని రావాలనే అంటూంటివి. నీకు తెలియని విషయం గూడా మంచిదేనంటే ఎట్లా ఒప్పుకునేది మేం? దా న్నమలు చెయ్యమంటే యెలా చెయ్యగలం? ఇదేమైనా బొంగరా లాటనుకున్నావా!'

ఇట్లాగే చెప్పి చూశాం చాలాసేపు. కాని ఆ టేబుల్ దగ్గర తా నేసుకొచ్చిన లెక్కల కాగితాలు పట్టుకుని అట్లాగే కూర్చునుంది నాస్త్యా. చివరకి, ఆ సూదుల్లాంటి చూపులు నా మీదికి తిప్పి.

'సరే, సమిష్టిక్షేత్రా లన్నింటిలోనూ కాకపోతే మానె, కనీసం నా వెనకపడ్డ క్షేత్రాల్లోనన్నా ప్రయత్నంచేశి చూడ్డాని కంగీకరించండి' అనడిగింది.

'నా వెనకబడిన క్షేత్రాలంటే ఏమిటి నీ వుద్దేశ్యం?' అనడిగాడు ఫెద్యా.

సిగ్గుపడింది ఆ ప్రశ్న విని.

'నాలుక జారి అన్నమాటది. ఇక్కడికి కొచ్చిందగ్గర్నుంచీ. ఆ ప్రాంతంతో కాస్త సాన్నిహిత్యం యేర్పడింది; అందుకని అన్నా.'

'ఆ ప్రాంతం అంటే? ఏ ప్రాంతం?'

'సమిష్టి క్షేత్ర ప్రాంతం. ఆ ఉప్పు పర్రలవతల వున్న సమిష్టి క్షేత్రాలు.'

మళ్లీ చెప్పి చూశాం. వివరించి చెప్పి చూశాం. లాభం లేక పోయింది. తాబట్టిన కుందేటికి మూడేకాళ్లంటే. యింకా చెప్ప గలిగే దేముంటుంది! చివరికి. ఫెద్యా అందుకున్నాడు.

'నిజంగానే. నాస్త్రాస్యావాసిల్యెవ్నా! నువ్వు పసిపిల్లకంటేగూడా కనాకష్టం! నీ మాట లెవరైనా విన్నారంటే. మన వ్యవసాయంలో వున్నంత అరాచకం యింకెక్కడా వుండదనిగూడా అనుకునిపోతారు. నీ చేతుల్లోనే అధికారం అంతా వుంటేనా.యీ క్షేత్రాల్లో గోధుమ నాటడానికిక్కూడా సిద్ధపడతావు. నాట్లెయ్యడాని కింకొక అరగంట

వ్యవధి వున్నానరే. జొన్న నాటాలని నీకు బుద్ధిగనక పుడితే. అంతకుపూర్వం అనుకున్నదంతా రద్దుచేసి. ఆ జొన్నే నాటగలవు గూడాను. నీ వుద్దేశం ఏమిటి? దేశంలో కేంద్రీకృత పథక మంటూ లేనే లేవనా నీ వుద్దేశం! మాకు ప్రాంతీయ కేంద్రంనుంచి వచ్చే పథకాల్ని మాస్కో అంగీకరించి, ఆమోదించి పంపడం లేదనా?'

'ఫ్యోదోర్ ఇవనోవిచ్! నేను చెప్పేదనలది కానే కాదు' అంటూ నిట్టూర్చింది నాస్త్యా; 'వెనకబడిన క్షేత్రాల్లో వాళ్ల రోజువారీ ప్రతిఫలం యింకా పెరగాలనే దొక్కటే నా వుద్దేశం.'

ఫెద్యా తమాయించుకున్నాడు గాని, ఫర్జనోవ్ యిక ఆగలేక పోయాడు :

'నాస్త్యాస్యా వాసిల్యెవ్నా! నువ్వాలోచించనూలేవు; నీకొక వుద్దేశమంటూనూ లేదు! అసలు నీ కెలా ఆలోచించాలో తెలిస్తేగా. ప్రతీ విషయాన్ని అన్ని కోణాలనుంచి చూడడమూ. ఆలోచించడమూ నేర్చుకో ముందు. అది నేర్చుకున్నతర్వాత రా మా దగ్గరికి. మాతో మాట్లాడ్డానికి. కూర్చుని పోసుకోలు వాదనలు చేసుకోడానికిప్పుడు సమయం లేదు'

ఇక చూడండి. కుర్చీమీంచి లేచి నుంచుంది నాస్త్యా. ఇదివరకు మేం చూచిన నాస్త్యాకీ. యీ నాస్త్యాకీ అసలు పోలికే లేదంటే నమ్మండి! ఆ బిగుతులాగూ జేబుల్లో చేతులు పెట్టుకుని నిలబడింది. మా వైపుకు సగం తిరిగి నిలబడిందేమో తల కొద్దిగావంచి. ఫర్జనోవ్ వంక గురి చూస్తున్నట్టుంది.

అప్పుడు నాకు చిన్నప్పుడు మా వూళ్లో నాతో ఆడుకునే పురచేతి వాల్కా గుర్తుకొచ్చాడు. వాడూ యిట్లాగే నుంచునేవాడు. కొద్దిగా ప్రక్కకి తిరిగి. జేబుల్లో చేతులు పెట్టుకుని. వాడు ముష్టిలోహం దెబ్బలాటలో మొనగాడు. ఎడం జేబులోవున్న ముష్టిలోహం అడ్డం పెట్టుకుని నిలబడేవాడలాగా ఒక్క నిమిషం సేపు; కన్నుమూసి తెరిచేటప్పటికి ఆ జేబులోంచి చెయ్యి పైకొచ్చేశేది; అవతలివాడి జబ్బ పూడవతల పడినంతపనీ ఐపోయేది. నాస్త్యాని చూస్తుంటే ఆ పురచేతి

వాల్కా గుర్తుకొచ్చాడు. అచ్చంగా, ముమ్మూర్తులా వాడికిమల్లేనే వుంది. ఇంకొకటి గూడా చూశాన్నేను నాస్త్యాలో మార్పు. అప్పు డావిడ పెదవు లేమైపోయినయ్యో కన్పించలేదు; ఆ పెదవు ఉండెచోట చిన్న గీతొకటి మట్టుకు కన్పించింది. పెదవులు లేవుగాని. గడ్డం మట్టుకు, ఆ గడ్డం చివరుండే చిన్న సొట్టతోసహా ముందుకు తోసుకొచ్చింది, నేలమీది కెళరే పారలాగా.

ఆ పెదవులు లేని నోరు తెరచి, ప్రతిమాటా విదుస్తూ,

'నేను చెప్పిందాంట్లోగాని. అన్నదాంట్లోగాని బాహ్యతారాహిత్యం అనేదేమీలేదు ; మీ పనిలోమట్టుకు కావలసినంతుందా బాధ్యతలేనితనం' అంది బిగ్గరగా.

ఆవిడ వుద్దేశం మేం అందరమూ ననే. పెద్దపెద్ద పదవుల్లో వున్న వాళ్ళనేకమంది పొగిడారు మా ఎమ్. టి. యస్. ని. ఇప్పు డీవిడ గారొచ్చి యీ మాటన్నది ! గ్రుడ్డొచ్చి పిల్లని వెక్కిరిస్తోంది.

ఇగ్నాత్ ఇగ్నాతొవిచ్ ముహాన కత్తివేస్తే నెత్తురుచుక్క లేదు. బిల్లమీద సిరా వొలికింది ఫెద్యా చేతిలోంచి. ఇక నాస్త్యా అన్నారూ, నాస్త్యా గొంతంత పెద్దదని నా కిదివరకు తెలియనే తెలియదు. ఎప్పుడూ నెమ్మదిగా, మృదువుగా మాట్లాడేది, ఆ చిన్న ఆకారానికి తగినట్టు. ఇప్పుడో...ప్రళయ కాళిలాగా మాట్లాడింది. నా చెవుల్ని నేను నమ్మలేక పోయాను. పిట్ట కొంచెమూ, కూత ఘనమూ అని !

పరిస్థితి విషమించిందని గుర్తించాను.

'ఇక దయచెయ్యి ! మమ్మల్ని బాధ పెట్టకు' అన్నాను.

'బుర్ర దగ్గిర పెట్టుకుని ఏదన్నా పని చెయ్యగలిగితే చెయ్యి. లేకపోతే మొత్తం మా ఎమ్టియస్ నే వదిలెళ్ళి పో నీ యిష్టంవొచ్చిన చోటికి' అని కేకలేశాడు ఫర్జనోవ్.

'నేను చచ్చినా తగ్గను !' అని మొహంతిరిగింది నాస్త్యా. 'నాపని నేను చెయ్యకుండా చచ్చినా వూరుకోను, మీ రెన్ని అడ్డంకులు పెట్టినా సరే !' అంది.

మళ్ళీ జిల్లా కమిటీకి ఫిర్యాదు చేస్తానని చెప్పి, వెళ్ళిపోయింది.

మేం అందరం బెల్లంకొట్టిన రాళ్ళకిమల్లే కూర్చుని వుండిపోయాం; తలా ఒక గ్లాసుడూ నీళ్లు తాగాం. చివరికి ఇగ్నాత్ గుక్క తిప్పు కున్నాడు.

"ఇంతవర కా అమ్మాయివల్ల నష్టం యేమీ కలుగలేదు కాని, మన ఎమ్‌టియెస్‌లో కొక రహస్య శత్రువు ప్రవేశించిం దన్నమాట మట్టుకు నిజం' అన్నాడు.

ఏదో చిట్టెలుక అనుకున్నాం యింతవరకూ. మంచి చిట్టెలుకే. కుర్చీలో కూర్చుని కనురెప్ప లల్లల్లాడించే చిట్టెలుక! చివరి కింతదూరం వచ్చిందన్న మాట. అవకాశంకోసం వేచి కూర్చుందన్న మాట!

సరేలే. యింతకంటే యింకేమౌతుందిలే అనుకున్నాం. పొర పడ్డాం. జరగవలశిందంతా ముందే వుంది; జరిగింది వుపోద్ఘాతం మట్టుకే; గ్రంథం యింకా చాలా వుంది.

జిల్లా కమిటీకి వ్రాశింది; కాని ప్రథమ కార్యదర్శి వూళ్లో లేడు. అంచేత ఏమీ చర్య తీసుకోవడం జరగలేదు, అంతటితో వూరుకుందా? లేదు. మిగతా పనుల్లో వేలెట్టడం మొదలెట్టింది. మా పాలిట యమ దూతగా తయారయ్యింది.

ఊరికే కూర్చుని, అదేపనిగా ఆలోచించడం ప్రారంభించింది. ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయాని కొచ్చిందీ అంటే యికావి జ్ఞాపడం యెవరి తరమూ గాదు; అనుకున్నది చేసితీరాల్సిందే. చేశేదాకా నిద్రపట్టదు; నిద్రపోదు.

ప్రతిరోజూ పేచీయే; ఏదో వొక పేచీ. ఇకిట్లా ఐతే లాభం లేదనుకున్నాం. మా పని కడ్డంరాకుండా, ఏదో వొక పని అప్పజెప్పా లనుకున్నాం. పని వివరం పట్టికలూ అవీ పూర్తిచెయ్యమని వ్రాతపని పెడ్తే మంచిదనుకున్నాను నేను. ఒక్కో పట్టికలోనూ నూరూ నూటిరవై ప్రశ్నలుంటై. అలాంటి పట్టికలు వందలకొద్దీ వుంటై. అవి పూర్తిజెయ్యా మని చెబితే, రాత్రింబగళ్లు పనిజేసినా, యిక గదిబయటికొచ్చే తీరిక గూడా వుండదు అదే మంచిపద్ధతి అనుకున్నా. అలా ఐతే యీ పేచీ

గూడా కొంత తగ్గుతుందిలే అనుకున్నా. అనుకుని, ఆ పని వప్పజెప్పా నాస్త్యాకి.

ఏం లాభం: జిల్లా కమీటీకిగాని ప్రాంతీయ కేంద్రానికిగాని, ఒక్క రిపోర్టు పంపితే ఒట్టు. ఒకదాని తర్వాతొకటి హెచ్చరికలూ, చీవాట్లూ రావడం మొదలెట్టినై నాకు. ఆ రిపోర్టులన్నీ వెంటనే పంపిం చెయ్యమని ఆజ్ఞాపించా. ఖాతరు చెయ్యలేదు. సంగతేమిటో తేల్చేసు కుందామని, రమ్మని కబురుచేశా. వచ్చింది. చిరునవ్వులు గుమ్మరిస్తూ హుషారుగా, సరదాగా వచ్చినట్టొచ్చింది. అంతా సవ్యంగానే వున్నట్టు.

'నా ఆదేశాల్ని పాటించకపోవడానికీ, రిపోర్టులు పంపకపోవ డానికీ కారణం ఏమిటి? ఎవరిచ్చారు నీకా హక్కు'? అనడిగా.

'ఆ పట్టికల్లో ప్రశ్నల కర్థంలేదు, వాటి అర్థంలేని ప్రశ్నలు' అని జవాబు చెప్పింది.

'ఆ పట్టికల్లో ప్రశ్నలకి సమాధానం రాసి పంపాలని ప్రాంతీయ కేంద్రం ఉత్తరువు. వాళ్ళ ఆదేశాల్ని కాదని నే నెట్లా అంటాను?' అనడిగా.

'అందులో ఏముంది? నేను చేసినట్టే నువ్వూ చేస్తే సరి. నీ ఆదేశాల్ని నే నేం చేశాను!' అంటూ నా మొహంమీదే నవ్వేసింది.

నాస్త్యాని వ్రాతపూర్వకంగా హెచ్చరించాను; ఆ హెచ్చరికని 'రోజువారీ ఆదేశం'లో నమోదుగూడా చేసేశాను.

గ్రామీణార్థిక విషయాల్లో మట్టుకే అగకుండా, మా యంత్రాల విషయంలోగూడా జోక్యం కలగజేసుకోవడం ప్రారంభించింది నాస్త్యా.

విత్తనాలు పోసేప్పుడు, ఏమైనా యంత్రభాగాలు చెడిపోతా యేమో. వెంటనే వాటి స్థానంలో కొత్తవి వుపయోగించేందుకు ఇప్పుడే సిద్ధం కావడం మంచిదంటూ చెప్పడం మొదలెట్టింది.

'యంత్రాలు బాగుచెయ్యడానికనీ, అప్పుడు విత్తనాలు జల్లే పని ఆపేస్తే ఎట్లా? పని నష్టం కాదూ? అవసరమైన బాగుచేతలన్నీ ఎప్పటి కప్పుడు చేసేట్టు సిద్ధంగా ఉండాలి.' అన్నది మాదగ్గరకొచ్చి.

'అలా చెయ్యాలంటే మనదగ్గర అవసరమైన యంత్రభాగాలన్నీ వుండాలి. అన్నీ మనదగ్గర లేవు.'

'లేకపోతే యెట్లా! తెప్పించండి.'

'సరఫరాశాఖ దగ్గర అవి లేవు; ఇంకెక్కణ్ణుంచి తెప్పిస్తాం?' అనడిగాను నేను.

'ఐతే, యంత్రాలు పని జేస్తూ చేస్తూ పాడై పోతే?'

'ఇకప్పుడు తప్పదు కాబట్టి. ఎట్లాగోట్లా మనమే కిందా మీదా బడి తయారు చేసుకుందాం.'

ఇక, ఫర్జనోవ్ వైపుకి తిరిగింది;

'ఆ భాగాలు తయారు చెయ్యడం ముందే పూర్తి జెయ్యరాదూ, కామ్రేడ్ చీఫెంజినీర్!'

'ఇప్పు డవన్నీ చెయ్యాలంటే చాలాకాలం పడుతుంది. అదీగాక, మనమే తయారు చేసుకోవాలంటే ఖర్చు ఎక్కువౌతుంది; అంత మేలు రకంగానూ వుండవు' అని చెప్పాడాయన;

'ఐనా మన అదృష్టం తిన్నగావుంటే అసలు యంత్రాలు చెడిపోక పోయినా పోవచ్చు!'

'ఎవరో శాస్త్రం చెప్పినట్టుంది యిది' అంది నాస్త్యా; 'అనగా అనగా ఒక వూళ్లో, ఒక యింటి తల్లి, ఆపూట యింటికి చుట్టాలొస్తారని తెలిసి కూతుర్ని పిలిచిందట, పిలిచి. అమ్మామ్మా! స్నానం అదీ చేసి మంచి బట్టలు కట్టుకో, యివ్వాళ చుట్టాలొస్తారేమో అని చెప్పిందట, వాళ్ళు రాకపోతే యేంచేస్తామమ్మా. వూరికే వృథాగా స్నానంచేసి చక్కని బట్టలు కట్టుకొని కూర్చున్న తర్వాత వాళ్లు రాకపోతే నా కసహ్యంగా వుండదూ, నేను తెలివితక్కువ పెద్దమ్మ నవ్వనూ? అనడిగిందట కూతురు ఆ తల్లిని. అట్లావుంది మీ సమాధానం. యంత్రాలు పాడౌతా యేమో, అన్నిటికీ సంసిద్ధంగా వుండడం మంచిదని మీ ముఖ్య గ్రామీణార్థికవేత్త ఒకేపున చెబ్తూంటే. 'అసలు యంత్రాలు పాడుగాకపోతే... అవసరమైన యంత్రపరికరాలన్నీ వృథాగా ముందుపెట్టుకుని కూర్చోవడం యెందుకు?' అనేనా మీరు సమాధానం చెప్పవలశింది?'

ఫర్గనోవ్ తెల్లబోయాడు.

'నే నెవర్నీ తెలివితక్కువ పెద్దమ్మనిగాని. దద్దమ్మనిగాని అనమూ అనను; ఇంకొకళ్ళంటే పడనూ పడను ' అన్నాడు.

నాస్త్యా నవ్వింది.

'మీరు తెలివి తక్కువ దద్దమ్మలని నే ననలేదే.'

మేం చిట్టెలుక అనుకున్న మనిషి తెలివితేటల్లోనూ. హాస్యాలాడ్డంలోనూ చురుక్కుమనే మాటలనడంలో మమ్మల్నే మించిపోయింది.

ప్రతి రోజూ. ఇలాగే యేదోవొక గొడవ. ఇది గాకపోతే అది. అది గాకపోతే యిది; యేదో వొకటి. మా ఎమ్‌టియెస్‌లో పరిస్థితే మారిపోయింది.

చివరికి. జిల్లా కమిటీనుంచి పిలు పొచ్చింది నాకు. ప్రథమ కార్యదర్శి. యూఛెంకోని చూచేందు కెళ్ళాను. యూఛెంకో మంచి హుషారైన మనిషి; కష్టపడి పనిచేస్తాడు. ఏవిషయాన్ని గురించైనా. వెంటనే ఒక నిర్ణయానికి రాగలడు. పెద్ద అందమైనవాడు కాకపోవొచ్చుగాని. చూడగానే ఆకర్షించగలడు. సన్నటి పెదవులు; ఎప్పుడుచూచినా నవ్వబోతున్నట్లుంటై. జ్యోతుల్లాగా పెద్దపెద్ద కళ్లు. అతి వేగంగా మాట్లాడేస్తాడు మధ్యమధ్య హాస్యం చిలకరిస్తూ. అలాంటివాడు. ఆ వేళెందుకనో, 'మీ గ్రామీణార్థిక వేత్త వచ్చి నాతో మాట్లాడి వెళ్లింది పంటల్ని గురించి' అనిమట్టు కన్నాడు. నన్ను చూచి ముక్తసరిగా:

'పంటల పథకం యిదివరకే ఆమోదించబడిందిగదా' అని అన్నాను నేను: 'అదీగాక విత్తనాలు చల్లే సమయంగూడా దగ్గర కొచ్చేసింది. ఇప్పుడు మొత్తం పథకమే మార్చాలంటే యెలా? ఎవరూ వొప్పుకోరు. ఆవిడలో. ఒక్క పావుగంటైనా మాట్లాడారో లేదో, అప్పుడే మీ ముఖంలో యింత మార్పొచ్చిందే: ఎంత నల్లబడిపోయిందో మీ ముఖం చూసుకున్నారా!. మాకు యిరవైనాల్గంటలూ వుంటుంది ఆ పోరు: మే మెంత మారిపోవాలి? యిక్కడినుంచి దూరంగా పారిపోవడం తప్ప గత్యంతరం వున్నట్టు లేదు మాకు. మేం పారిపోవకముందే మీ రావిణ్ణి పారదోలడం మంచిది.'

'అదికాదు' అన్నా డాయన: 'తొందరపడగూడదు మనం. తొందరపడి యే నిర్ణయానికీ రాకూడదు ఆవిడ కింకొంత సమయం యివ్వడం మంచిది. ఇంకొంతకాలం ఆగి చూడడం మంచిది. కొన్ని కొన్ని సమస్యలు అప్పటి కప్పుడు పరిష్కరించుకోవలసినవి వుంటై. మరి కొన్నిటిని, సామెత చెప్పినట్టు బాగా ఆలోచించి చెయ్యాలి. మన వాళ్ళంటూరే, గుడ్డని కత్తిరించే ముందు అవసరమైతే, పదిసార్లైనా సరే ఆలోచించి మరీ కత్తిరించడం మంచిది; ఎందుకనంటే ఒకసారి కత్తిరించేశిం తర్వాత. యికేమనుకున్నా ప్రయోజనం వుండదు.'

ఆ వెనకబడిన సమిష్టిక్షేత్రాల కొకసారి నేనే స్వయంగా వెళ్ళి, మంచీ చెడ్డా యింకొకసారి జాగ్రత్తగా బేరీజు వేసుకురావడం వుత్తమం అని గూడా సలహా యిచ్చాడు ప్రథమ కార్యదర్శి.

పథకాలన్నీ తీసుకుని, అక్టోబర్ సమిష్టి క్షేత్రానికి కారేసు కెళ్ళా నేను. ఇప్పు డొక కొత్త అధ్యక్షు డొచ్చా డా సమిష్టి క్షేత్రానికి. సమిష్టి క్షేత్రాధ్యక్షుల మూడు సంవత్సరాల కోర్సునుంచి మొన్ననే వచ్చా డా యువకుడు.

ఆ అధ్యక్షుడి యింటిదగ్గరే, వార్వారా కనిపించింది. వార్వారా దళ నాయకురాలు. కూర్చుని ఏడుస్తోంది. అధ్యక్షుడి కుటుంబంలో అంతా గల్లంతుగా వుందని చెప్పారు యిరుగు పొరుగువాళ్లు. అధ్యక్షుడేమో వార్వారాని వివాహమాడా లనుకుంటున్నాడట. అందు కతని తల్లి అంగీకరించడం లేదట. వార్వారా అతనికంటే పెద్దదనీ, అదీగాక ఆవిడ కిదివరకే పిల్లలున్నారనీ నట అతని తల్లి అభ్యంతరం.

నే నింట్లో కడుగు పెట్టేటప్పటి కంతా ఒక మహా రణ రంగం లాగా వుంది. గది మధ్యని కూర్చుని, మెషీన్‌గన్ మోగిస్తోంది ముసలమ్మ :

'అదా వీడికి పెళ్ళాం? ఆ వార్వారాయా నా బిడ్డకి పెళ్ళాం? ముసల్ది. కళ్లు కనబడవు. దొడ్డికాళ్ళు; ఆడదేనా అదసలు! అది ఆడదీ కాదు యేమీకాదు; మహమ్మారి. ఆఁ, మహమ్మారి!' అంటోంది ముసలమ్మ.

తలకా యెంచుకుని కూర్చునున్నాడు అధ్యక్షుడు. అతని ప్రక్కనే నాస్త్యా, సిలాంతీ తాతా కూర్చునున్నారు.

వెళ్ళి అందరితోనూ కరస్పర్శ చేశాను. నే వొచ్చానుగదాని, మాట్లాడ్డం మానెయ్యొద్దనీ, సిగ్గు పడొద్దనీ చెప్పాను.

"సిగ్గా ? నే నెందుకూ సిగ్గుపడడం ? కావాలంటే దాన్నే సిగ్గుపడమనండి ?' అంది ముసలమ్మ.

దిగాలుగా నాస్త్యా వంక చూశాడు అధ్యక్షుడు.

'నాస్తాస్యా వాసిల్యెవ్నా ! నే నెంతచెప్పినా చెవిని బెట్టదు మా అమ్మ. మీరన్నా చెప్పిచూడండి. వింటుందేమో.' అన్నాడు.

అతని నోటంట మాటొచ్చిందో లేదో, నాస్త్యా అప్పటి కప్పుడే ముసలమ్మ దగ్గర కెళ్ళిపోయింది. వెళ్ళి, ముసలమ్మని కౌగలించుకుని,

'ఓల్గాని చేసుకుంటే మంచిదని కాదూ మీ వుద్దేశం ? ఓల్గాసంగతి మన కందరికీ తెలుసు. మరీ నికరంలేని మనిషి. అంతకంటె వార్వారా చాలా మంచిది' అంటూ నచ్చజెప్పుతూ, అలాగే, యింకా చాలాసేపు మాట్లాడింది.

నాస్త్యా అట్లా మాట్లాడుతూంటే, అక్కడ చేరిన వాళ్ళంతా అది శ్రద్ధగా విన్నారు. ఎవరో పెద్దమనిషి మాట్లాడుతూంటే వింటున్నట్టు, ముసలమ్మ గూడా ఎదురు మాట్లాడకుండా, వింటూ కూర్చుంది. విని విని ఏడవడం మొదలెట్టింది :

'ఓల్గాకంటే పెద్ద యిల్లుంది; రెండు ఆవులున్నై. అందులో ఒకావిప్పుడే మూడీత ఈనింది; బోలెడు పాలిస్తోంది. వార్వారా దగ్గర లేముంది ? మన్నూ మశానమూను. దాంతోపాటు యింకా యిద్దరు పిల్లలు. మొత్తం మూడుపొట్ట లౌతై. అంతేనా ?' అంది ముసలమ్మ.

'వార్వారా వస్తే, వార్వారాతోపాటు ఐదువందల రోజుల ప్రతిఫలం గిట్టుబాటైనట్టు కాదూ మరి ?' అని అడిగింది నాస్త్యా.

కాండ్రించి వుమ్మేసింది ముసలమ్మ. చెప్పుగాలితో ఆ వుమ్ము తుడిచేస్తూ.

'ఐదువందల రోజులొస్తే. యెందుకు ? నా ముహాన కొట్టుకోనా. ఇక్కడ వెయ్యిస్తే మాత్రం యేమిటీ లాభం. సంతకెళ్తే దమ్మిడీలో నాలుగోవంతు విలువుండదు దానికి :' అన్నది.

అని మళ్ళీ కాండ్రించి పుమ్మేసి. మళ్ళీ చెప్పుకాలుతో తుడిచేసింది.

సూటిగా ముసలమ్మ కళ్ళల్లోకి చూచింది నాస్త్యా :

'అట్లా అనబాకమ్మమ్మా ! ఈ యేడట్లాకాదు. క్లోవర్ గడ్డి వెయ్యడం మానేస్తాం. జొన్నలూ, ప్రొద్దుతిరుగుడు పూలూ వేస్తాం. ఒక్క పూలమీదే రెండు లక్షల రూబుళ్ళదాకా వస్తాయి యీ సంవత్సరం. చూస్తూండు. అందరికంటే వార్వారాయే యెక్కువడబ్బు సంపాదిస్తుంది. తనకీ, తాన్యాకీ, కాత్యాకీ గూడా సరిపడ సంపాదిస్తుంది' అని. అధ్యక్షుడి వైపుకు తిరిగింది నాస్త్యా: 'మీ కెందుకు, మీరు అమ్మ మాటలు పట్టించుకోబాకండి. అమ్మమ్మెప్పుడూ యింతే. వూరికే మాటలంటుంది; పనిలోనూ అంతే. ఎప్పుడూ గొణుగుతూనే వుంటుంది; తీరా పని చూస్తే అందరికంటే బాగా చేస్తుంది. అనాథల నోట మట్టిగొట్టుందా అమ్మమ్మ ! చచ్చినా చెయ్యదలాంటి పని.'

ముసలమ్మని శాంతపరచిం తర్వాత, వార్వారా యింటికి వరుగెత్తింది నాస్త్యా. నేను తిరిగొస్తూ నదివొడ్డున చూచాను వార్వారానీ, నాస్త్యానీ. ఇద్దరూ వొకళ్ళ ప్రక్క నొకళ్ళు నడుస్తున్నారు. అదే చూడడం వార్వారాని నేను. వార్వారా 'ముసలిదీ' కాదు; 'దొంగకాళ్ళదీ' కాదు; 'మహమ్మారి' అంతకంటే కాదు. మంచి మనిషి; పాపం ! ఏడుస్తోంది, నాస్త్యా ప్రక్కన అడుగులేస్తూ.

ఇంటి కొచ్చింతర్వాత లట్టింది నాకు. పంటలంటే మాకంతా పధకాలకిందా, శాతాలకిందా లెక్క. కాని. నాస్త్యా కలా కాదు; ఆ పంటలంటే, ఆవిడ దృష్టిలో, పధకాలూ కాదు. శాతాలూకాదు; వార్వారా, కాత్యా, తాన్యా, అమ్మమ్మలలాంటి వ్యక్తుల భవిష్యత్తు !

అంటే. నే నేదో కొత్తవిషయం నేర్చుకున్నాననికాదు; మా పధకాల ప్రకారం నడవడం మంచిదనే నా అభిప్రాయం యేమీ మారలేదు. కాని, ఎందుకనో, నది వొడ్డున, నాస్త్యా ప్రక్కనే నడుస్తూ, రంగు

మాసిపోయిన జేబు రుమాలతో కన్నీరు తుడుచుకునే వార్వారా కనిపించ డం ప్రారంభించింది నా కనులముందు. నా కేమీ తోచలేదు.

ఐనా, మా ఎమ్టియెస్‌కి తిరిగివెళ్లి, ఫర్జనోవ్‌తోనూ, ఇగ్నాత్‌తోనూ మాట్లాడిం తర్వాత, మనసు కుదటబడింది.

మొత్తంమీద. అప్పటికే, నా ఆలోచనలన్నీ ఫర్జనోవ్‌తో చెప్పడం మానేశాను. అంటే ఆయనకి తెలియగూడని రహస్యాలనే దృష్టితో దాయడం కాదు గాని, నా వుద్దేశాలు నావి అనుకున్నాను. ఆ వుద్దేశాల్నీ, ఆలోచనల్నీ ఆయనకి తెలియజెయ్యవలసిన అవసరం లేదు లెమ్మనుకున్నాను.

ప్రాంతీయ కమిటీ ప్రధాన కార్యదర్శి మా జిల్లా పర్యటనకొచ్చాడు; వచ్చిననాటి రాత్రి, ఒలోభిఖిన్ ఎమ్. టి. యెస్ లోనే వున్నాడు. మర్నాడుదయానికి జిల్లాకి జిల్లా అంతా గుప్పుమంది: లీనా ఆయన్ని 'టీ'కి ఆహ్వానించిందనీ, తన ఎమ్. టి. యెస్ కొక కొత్త లారీని తప్ప కుండా యిస్తానని ప్రాంతీయ ప్రథమ కార్యదర్శితో వాగ్దానం చేయించు కుందనీ నీ.

ఆవేళ వుదయం జిల్లా కమిటీ ఆఫీను దగ్గర ఎదురు పడిం దావిడ నాకు.

'మొత్తం మీదొక లారీ కొట్టేశారే?' అన్నాను ఈర్ష్య ధ్వనించేట్టు.

ఇతరుల యీర్ష్యని చూచి, తమ గొప్పతనాన్ని తలుచుకుని కొంతమంది కన్నుల్లో కొక వింత కాంతి వస్తుందే అలా వింతగా, మెరిసిపోయినై లీనా కళ్ళు. బుగ్గలు సొట్టలు పడినై. ఆత్మ సంతృప్తితో మనిషంతా పరవళ్లు తొక్కుతోం దనిపించింది. వెంటనే ముహం ప్రక్కకి తిప్పేసుకుని,

'అసలు కారణం, ఆ లారీ అవసరం మా కెంతవుందో ఆయన కర్థం అయ్యేట్టు చెప్పగలిగాను. ఇక తరవాతన్నారూ' అంటూ తన భావాల్నణచుకోలేక, తెల్లని పలువరుస కనబడేట్టు గభాలున నవ్వేశి,

'ఇక తరవాతన్నారూ, కార్యదర్శి మాత్రం దిగొచ్చాడా ? ఆయనా మనిషే : హుషారుచేస్తే హుషారు పడతాడు.' అన్నది లీనా.

అని, తలూపుకుంటూ, పరుగెత్తి వెళ్ళిపోయింది.

అలిడ వెళ్ళిపోతూంటే, అటే చూస్తూ నిలబడిపోయాన్నేను, నిజమే. అలాంటి యువతి ఎలాంటి మనిషినైనా, ఇట్టే హుషారు చెయ్యగలదు, చెయ్యాలని అనుకోవాలేగాని. లుకాచ్ అదృష్టవంతుడు; లినా లాంటి యువతిని సంపాదించుకున్నాడు తన ఎమ్ టి యెస్‌కి. మాకేముంది ? చెప్పులోని రాయి, చెవిలోని జోరీగ — మా నాస్త్యా

మన ఖర్మలావుంటే యెవళ్లేం చెయ్యగలరను కుంటూ ఝురావినోకి తిరిగొచ్చాను. వచ్చి చూస్తే కాళ్ళు చల్లబడినై; ఫర్డ నోవ్ అగ్నిమీద గుగ్గిలం పోతున్నాడు. యంత్రాల బాగుచేతపని ఎక్కడి దక్కడే వుంది.

అదృష్టంకొద్దీ, ఆపేళ వాతావరణం బాగుంది. చక్కగా ఎండ కాస్తోంది. స్టెప్పీలో మంచు గూడా కొద్దిగా కరిగింది. కరిగిన మంచు, మైకాలాగా, మెరిసిపోతోంది యెండలో. మర్నాడు, దూరానొక కారాగింది ఆ కారులోంచొక మనిషి దిగి, మా వైపుకే వస్తున్నాడు అంగ లేసుకుంటూ. ఆ నడక తీరూ, ఆ చేతు లూపడం అదీ చూచి, చూడగానే అనుకున్నాం అవొచ్చేది మా ప్రాంతీయ కమిటీ ప్రథమ కార్యదర్శి, సెర్గీ సెర్గెయెవిచ్ సొకొలోవ్ అని.

ఆయనకూడా స్టెప్పీల్లో పుట్టిపెరిగిన మనిషి. ఒక సమిష్టి రైతు కుటుంబంలో పుట్టాడు. మనిషిగూడా మంచి ఆజానుబాహువు. ముహం నిండా మశూచికం మచ్చలు. చేసే పనేదో గట్టిగా చేస్తాడు. ముక్తసరిగా మాట్లాడాడు. యుద్ధానికి పూర్వం నగరపార్టీ కమిటీలో పనిచేశాడు. అప్పటికే పేరు సంపాయించుకున్నాడుగాని, అందరికీ యింకా బాగా తెలియలేదు. కాని, తర్వాత యుద్ధకాలంలో ఆయన నిజాయితీ బాగా పని కొచ్చింది. చుట్టుప్రక్కల వాళ్ళందరికీ ఆయనంటే గురీ, గౌరవం ఏర్ప డినై . మా దగ్గరికి రావడాని కొక వారం రోజులు ముందు ప్రాంతీయ కమిటీ ప్లీనమ్‌లో ఆయనమీద కాస్త గగ్గోలు బయలుదేరింది. నాయు

కత్వం వహించే విధానంలో పొరపాట్లు చేశాడని యిటు పార్టీ పత్రికలూ, అటు పార్టీ కమిటీగూడా పట్టుకుని దుయ్యబట్టినై. అంత దుయ్యబట్టినా, ఆయనంటే వున్న విశ్వాసం మట్టుకు సడల్లేదు

ఇంతకు పూర్వంగూడా చాలాసార్లు వచ్చాడు మా ఎమ్‌టియస్‌కి. నాతోనూ, ఫెద్యాతోనూ కలిసి మా ప్రాంతం అంతా తిరిగేవాడు, నాలు గైదు ప్రశ్న లేసేవాడు. వాగ్దానం చేశిందంతా వెంటనే పంపించేశేవాడు. అంతే. వివరాల్లోకి ఎప్పుడూ వెళ్ళేవాడు కాదు. జనంతో అసలు మాట్లాడేవాడే కాదు.

కాని, యీ పర్యటనలో మనిషి పూర్తిగా మారిపోయినట్లు కన్పించాడు. ప్రతి విషయాన్నిగురించీ వివరంగా అడిగి తెలుసుకోవడం మొదలెట్టాడు. మా డ్రైవర్లతోనూ, మెకానిక్‌లతోనూ నిలబడి దీర్ఘంగా సంభాషించడం ప్రారంభించాడు. మధ్య మధ్య హాస్యాలాడ్డానిక్కూడా ప్రయత్నించాడు. ఆ హాస్యం కాస్త మోటుగావున్నా, మా కందరికీ హుంషారేశింది. ఇంతకుముందైతే నాలాంటి వాళ్ళెవరో యిద్దరో ముగ్గురో వుండే వా రాయనవెంట. ఈ సా రొక పెద్దగుంపు కూడింది ఆయన చుట్టునూ. సిలాంతీ తాత గూడా వచ్చి పడ్డాడు ఆకాశం మీదనుంచి వూడి పడ్డట్టు. సెర్జీ సెర్గెయెవిచ్ వ్యక్తిగతంగా తనని చూచేందుకే వచ్చాడని అభిప్రాయ పడ్డట్టున్నాడు మా సిలాంతీ తాత! మా నాస్త్యా గూడా మా వెంటే వుంది, నెమ్మదిగా నడుస్తూ. కనురెప్ప లల్లాడిస్తూ.

నా తోటి ప్రయాణీకుడు, ఛాలికోవ్, జేబులోంచి, అదొక రకంగా గమ్మత్తుగా వంగున్న పైప్ తీసి, వెలిగించాడు. మొత్తం మీదా పడుచు ముహానికీ, ఆ ఆడపిల్లల కన్నుల్లాంటి కన్నులకీ, ఆ పైప్‌కి పొత్తు కుదిరినట్లు లేదు; ఎబ్బెట్టుగానే వుంది అత నా పైప్ అట్లా కాలుస్తుంటే.

"నాస్త్యా కదొక అలవాటు. అవతల మనిషిని పూర్తిగా అర్థం చేసుకున్నానని అనుకునేవరకూ నోరు విప్పదు" అన్నాడు ఛాలికోవ్, ఆలోచిస్తూ. "చాలా మర్యాదగా వుంటుంది మెదలకుండా. అట్లా అని, అవి దేదో నటిస్తున్నట్టూ వుండదు. ప్రతి వ్యక్తిలోనూ యేదో మహత్తున్నట్టూ, ఆ మహత్తేమిటో తెలుసుకోవాలని తహతహ లాడుతున్నట్టూ వుంటుంది అలాంటప్పు డావిడప్రవర్తన. ఆంచేతనే మూగ బోయినట్టు, అవతలి మనిషంటే ఎంతో కుతూహలంతో వుంటుంది. అతన్ని బాగా అర్థం చేసుకోవా లనుకుంటున్నట్టు ఎంతో జాగ్రత్తగా చూస్తూంటుం దతన్ని. తర్వా తేవో సందేహాలు కలుగుతాయి. అవతలి మనిషి మంచి చెడ్డల్ని బేరీజు వేస్తుంది. తనలో ఏ స్వభావాన్నా వ్యక్తికి చూపించితే మంచిదోనని ఆలోచించుకుంటుంది. ఈ ఆలోచనలు జరుగుతూన్నంత సేపూ ఎంతో తాపీగా నిర్మలంగావుంటుంది. ఆ ఆలోచనలన్నీ పూర్తయి. ఏదో వొక నిర్ణయానికి వచ్చిందీ అంటే. అంతే.ఇక కాసుకోవలసిందే!

ఆ వ్యక్తి అంటే యిష్టమైతే సరేసరి, చక్కగా స్నేహితుడిలా ప్రవర్తిస్తుంది. తద్భిన్నమైతే, యిక చెప్పేదేముంది! నన్నూ ఫెహ్యానీ చేసినట్టే ముప్పు తిప్పలు బెట్టి మూడు చెరువుల నీళ్లూ తాగిస్తుంది. మధ్యేమార్గం అంటూ లేదు, ఆవిడంటే. ఆవిడంటే అపరిమితమైన స్నేహంగానన్నా వుంటారు; లేకపోతే, ఆవిడ పేరు వింటే చాలు మండైనాపోతారు.

మళ్ళీ ఆలోచనలోపడ్డాడు ఛాలికోవ్. నిమిషాలు గడిచిపోతున్నై. ఐనా అతను మాట్లాడ్డం ప్రారంభించలేదు.

"అన్నట్టు మీరు ప్రథమ కార్యదర్శి పర్యటనని గురించి కాదూ, చెబుతూ చెబుతూ ఆగిపోయారు? తర్వా తేమైంది?" అని గుర్తు చేసాను.

ఆలోచనలోంచి బయటపడి, మళ్ళీ చెప్పడం మొదలెట్టాడు :

ఔనౌను. ప్రధమ కార్యదర్శితోపాటు మేమందరం బయల్దేరాం ఎమ్‌టియెస్‌ని చూడ్డానికి. నాస్త్యాగూడా మాతోనే వుంది. కళ్ళు పెద్దవి చేసుకుని చూశిందాయన్ని. ఔనుమరి. అంత ప్రముఖవ్యక్తి నంత దగ్గరగా యిదివరకెప్పుడూ చూచుండదు. అదీగాక, ఆయన్లో యేదో అసాధారణ ప్రతిభ వుండివుండాలనీ, అదేదో కనుక్కోవాలనీ చూస్తున్నట్టుంది.

ఎమ్‌టియెస్ అంతా తిరిగాం; కాస్సేపు మాట్లాడుకున్నాం, ఇక కామ్రేడ్ సొకొలోవ్ వెళ్ళే వేళయ్యింది. అందరం కలిసి, ఆయన వెనకే కారుదగ్గరి కెళ్ళాం.

ఆయన్తో మాట్లాడిందా కాస్సేపే ఐనా, మా శంపరికీ ఆత్మ విశ్వాసం అధికమయ్యింది. వసంతకాలం, ఆపరణలో వున్న మంచు గూడా కరిగింది. ఎటు చూచినా, ఆ మంచుకరిగిన నీళ్ళలో సూర్యరశ్మి పడి తెల్లగా మెరిసిపోతోంది. మా కొత్త యంత్రాలుగూడా, ఎండ పడిన చోటునల్లా మెరిసిపోతున్నై; తళ తళలాడుతున్నై. నేనూ కార్యదర్శి ప్రక్కనే నడుస్తున్నాను; సరైన సమయం చూచి, మాకూ వొక లారీ పంపాలని కోరదామని.

'స్టెప్పీల్లో యిలా మంచుపడి చాలా యేళ్ళయ్యింది నేల యింత తేమగా వుండీ చాలాకాలం ఐవుంటుంది' అన్నాడు కామ్రేడ్ సొకొలోవ్. 'ఆ ఆకాశంవంక చూడండి! ఈ యేడు చాలా మంచి వసంతం వస్తుంది.'

'వసంత కాలంలో వరదలొస్తే యింకా బావుణ్ణు. ఆకురాలు కాలానికి గోధుమపంట బాగా పండితే, అదే పదివేలు. నా చింతల్లా అదొక్కటే' అని నిట్టూర్చాడు సిరాంతీ తాత.

'ఇంత చక్కని వసంతం!' అంటూ తాతవైపుకు తిరిగాడు కామ్రేడ్ కార్యదర్శి. 'ఇంత చక్కని వసంతం, ఇంత మంచి

యంత్రాలు! ఏం పర్వాలేదు, తాతా! వీరగపండుతుంది, అనుమానం లేదు. మీ రోజువారీ ప్రతిఫలంగూడా బాగా పెరుగుతుంది. కాదూ, కామ్రేడ్స్? ఏమంటారు?

ఆయన చెప్పింది అక్షరాలా నిజమేనని అంగీకరించారు, ఆనందంతో.

ఉన్నట్టుండి, మా నాస్త్యా ముందుకొచ్చింది గుంపులోనుంచి, ఎవరో ముందుకు నెడుతున్నట్టు.

'కాదు, కాదు, సెర్జీ సెర్గెయెవిచ్, మీరు చెప్పేది నిజం కాదు' అంది, ముందుకొచ్చి.

ఎప్పటిలాగానే, అతి నెమ్మదిగా అంది నాలుగుమాటలూనూ. అని, కళ్లు పెద్దవి చేసుకుని, చూస్తూ నిలబడిం దాయన్ని.

సెర్జీ సెర్గెయెవిచ్ విస్తుపోయినట్టు చూశాడు నాస్త్యాని ఈ బిగుతు లాగులూ యీ జడలూ వేసుకునొచ్చి యింతింత మాటలంటున్న యీ చిన్న పిల్ల యెవరా అన్నట్టు.

'ఎందుకని? నేను చెప్పే దెందుకని నిజం కాదు? నే నన్న దాంట్లో అబద్ధం యేముంది?' అనడిగాడు.

'ఎందుకనంటే, ఆ వుప్పు పత్ర లపతలున్న సమిష్టి క్షేత్రాల్లో రోజువారీ ప్రతిఫలం యీయేడుగూడా యిదివరకటిలాగానే వుంటుంది కాబట్టి, యేమీ మెరుగ్గా వుండదు కాబట్టి.'

సెర్జీ సెర్గెయెవిచ్ ఆగిపోయాడు. అంతపరకూ ఆ ముహం మీదున్న చిరునవ్వు మాయమైపోయింది.

'ఇంకేం! మళ్ళీ మన నాస్త్యా ప్రత్యక్షమైంది. ఛాఛ!' అనుకున్నాను నేను.

సరిగ్గా కారు ముందు నిలబడుంది నాస్త్యా. కారు ముందుఅద్దం మీద పడి ప్రతిఫలించే సూర్యకాంతి, ఆవిడ ముహంమీదపడి దాగుడు మూత లాడుతోంది.

నీటిమీద పడిన సూర్య కాంతిలా, తరంగాలు తరంగాలుగా, ఆవిడ ప్రతి కదలికదగ్గరా ఎగిరెగిరి పడుతోం దా కాంతి. నాస్త్యా అదేమీ

పట్టించుకున్నట్టు లేదు. సెర్గీ సెర్గెయెవిచ్ కాస్సేపదేపనిగా చూశాడు నాస్త్యా వంక; తర్వాత,

'ముఖ్య గ్రామీణార్థికవేత్త యింత నిస్పృహగా వుండడం ఏమంత మంచిదికాదు. విత్తనాలు జల్లే ముందు యిలా నిరుత్సాహంగా మాట్లాడడం అసలు తగదు.' అన్నాడు

గుక్కలు మింగినట్టు మింగి విన్నది నాస్త్యా.

'ప్రాంతీయ కమిటీ ప్రథమ కార్యదర్శి, మూడేళ్ల వరసగా వెనకబడ్డ సమిష్టి క్షేత్రాలకి ఎప్పటికప్పుడు, యిదిగో మీ రోజువారీ ప్రతిఫలం పెరుగుతుంది, యిదిగో యీ యేడు పెరుగుతుంది అంటూ వాగ్దానాలు చేసి, మూడో యేడుగూడా మోసగించడం అంతకంటే తగదు' అని జవాబు చెప్పింది.

ఆ మాట లంటూన్నప్పు డావిడ కళ్ళల్లో కోపమూలేదు; భయమూ లేదు; ఆ నీలికనుల్లో విచారం మట్టుకే వున్నట్టనిపించింది.

ఆ మాటలు విని ఆశ్చర్యపోయాం మేము. 'నీ కసలేమైనా బుద్ధుందా, లేదా?' అనుకున్నాను నేను లోలోపలే. ఎమ్టియెస్‌లో యిప్పు డావిడకున్న వుద్యోగం యే క్షణాన వూడినా వూడిపోవచ్చునన్న విషయమూ తెలుసు తనకి. నిద్రపోతున్నప్పుడు లేపి అడిగినాసరే ఆపీడ ఎంత తొందరగా వదిత్తే అంత మంచిదని, మాలో అందరమూ అనేస్తామనిగూడా తెలుసు. ఇక ప్రాంతీయ కమిటీ ప్రథమ కార్యదర్శినిగూడా వ్యతిరేకం చేసుకుంటే....పాపం అనేవాళ్ళుగూడా వుండరు!

మరీ యింత మొండిధైర్యం యెక్కణ్ణుంచొచ్చింది ఆవిడకి? తెలియని చిన్నతనమా? లేకపోతే లోకం అంతా మంచిదేనన్న శైశవోద్దేశమా? మానవత్వంలోవున్న మూఢవిశ్వాసమా? ఏమిటీ కారణం!

సెర్గీ సెర్గెయెవిచ్ అక్కడే నిలబడున్నాడు. ప్రాంతీయ కమిటీ ప్రథమ కార్యదర్శిమీద నేరారోపణ చేసింది నాస్త్యా. అదేమంత సామాన్యమైన విషయం కాదు. మూడుసార్లు ప్రజల్ని మోసగించాడని చెప్పింది అంతమంది ముందు. మాటలా మరి? ఎక్కడో దూరంనుంచి చూస్తు

న్నట్టు చూశాడు కార్యదర్శి నాస్త్యా వంక. చూచి చూచి ఒక్కొక్క మాటా ఒక్కొక్క టన్నుబరువున్నట్టు బయటికొదిలాడు :

'ప్రాంతీయ కమిటీ కార్యదర్శికాదు పంటలు పండించేదీ రోజు వారీ ప్రతిఫలాలు ముట్టజెప్పేదీ వాగ్దానాలు చేశేదీనీ. ఆ మాట మట్టుకు మరిచిపోవద్దు, కామ్రేడ్. పంటలు పండించేది సమిష్టిక్షేత్రం రైతులు, ఆయా ప్రాంతాల్లో వుండే నిపుణుల సాయంతో, ఆ పంటల నిష్పత్తికి తగినట్టుగా రోజువారీ ప్రతిఫలాన్ని పొందేదీ ఆ సమిష్టిక్షేత్రం రైతులే. ఆ దారిని చూపించవలసింది నిపుణులు. అంతే. మీకన్నమాట ! మీరీ ఎమ్‌టియెస్‌కి ముఖ్య గ్రామీణార్థికవేత్తలు ! మీకా విషయం బాగా తెలుసుండాలి. ఇక నా సంగతంటారూ. పదేళ్ళనుంచి పనిచేస్తున్నాను ప్రాంతీయ కమిటీలో; ఇంతవరకెప్పుడూ, ఎవర్నీ మోసగించలేదు నేను.'

రెండు చేతులా గుప్పెట్లు బిగించి, రొమ్ముదగ్గర పెట్టుకుంది నాస్త్యా.

'ఎప్పటిలాగానే, యీయేడుగూడా వెనకబడిన సమిష్టి క్షేత్రాల రైతుల కేమీ గిట్టుబాటు కాదనుకోండి. మళ్ళీవచ్చే యేడుగూడా యిట్లాగే వచ్చి, యీ అర్థంలేని మాటలే అనెళ్తారా మీరు ?' అనడిగింది; ఆ మాటల్లో బాధవుంది; ఆ గొంతులో క్షోభ వుంది.

కామ్రేడ్ కార్యదర్శి కనుల్లో ఏదో మెరిసినట్లయింది. చిరాకా ; కోపమా ? బాధా ? ఏమో ! చెప్పలేను. కనపడని పచ్చి పుండు మీద కొరడాతో కొడితే యెలా వుంటుంది ? అట్లా వున్నై ఆయన కనులు. కనుబొమల కింద లోతుగా వున్న కనుల లోతుల్లోంచి వచ్చినట్టుంది ఆ మెరుపు. కనులు మరీ లోతుకు పోయినట్లయినై. ముఖం అంతా వుబ్బి నల్లబడి పోయింది :

'వచ్చే సంవత్సరంగూడా నే నీ సమిష్టి క్షేత్రాలకొస్తే, అప్పుడు యీ ఎమ్‌టియేస్‌కి ముఖ్య గ్రామీణార్థికవేత్తలు మీరు కాబట్టి, మిమ్మల్ని వెంటబెట్టు కెళ్తాను, ఆ వెనకబడిన సమిష్టి క్షేత్రాల దగ్గిరికి. అప్పుడు మీరే చెబుదురుగాని ఆ రైతులికి, 'అ లోపం యెక్కడుందో.'

నాస్త్యా వెనకాడలేదు. ఒకడుగు ముందు కేసింది :

'అప్పటిదాకా ఎందుకు ? ఇప్పుడే చెబుతాను. ఎందుకనంటే, క్షేత్రాల పర్యవేక్షణ సరిగ్గా జరగడంలేదు కాబట్టి; వేసే పంటలు యీ నేల కనువైనవి కాదు కాబట్టి; ఇంకా చెప్పనా ? ఇందుకనంటే...'

అంతవరకూ అన్న తర్వాత యి కావిడ గొంతు పెగల్లేదు; పెదవులు కదిలినవన్న మాటేకాని, మాట విన్పించలేదు,

ఆ సందు చూచుకుని, నా నాలుగు మాటలూ నే అన్నాను :

ఒక వారం కిందట, కామ్రేడ్ నాస్త్యాస్యా ఒక కొత్త సూచన చేసింది. ఇంతవరకు మనం వేసుకున్న పథకాలూ, చేసుకున్న ఒడంబడికలూ, అన్నీ పునరాలోచించుకోవాలని చెప్పింది. మార్చుకోవాలని అన్నది. విత్తులు జల్లే సమయం దగ్గర కొచ్చింతర్వాత, యిప్పు డవన్నీ మార్చాలంటే అసలు పనే పాడై పోతుంది.'

'పెద్ద పెద్ద ప్రముఖులూ నిపుణులూ అంతా కలిసి, ఈ సమస్యని క్రిందటేడే చర్చించారు' అని చెప్పాడు సెర్జీ సెర్గెయెవిచ్. 'వాళ్ళ మార్పుకు అంగీకరించలేదు. ఇ కిప్పుడు చర్చలు చెయ్యడానికి సమయమూలేదు; తీరికా లేదు ! అందర్నీ వి త్తనాల పనిలోకి పంపించండి' అంటూ కాడవైపుకు తిరిగాడు. కాని నాస్త్యా వూరుకోలేదు. ధైర్యం అంతా కూడదీసుకుని, బిగ్గరగా.

'సెర్జీ సర్గెయ్‌విచ్ !' అంటూ పిలిచింది; 'మీరు ప్రాంతీయ కమిటీకి ప్రథమ కార్యదర్శి హోదాలో వున్నారు. అన్ని సమిష్టిక్షేత్రాల్లోనూ కాకపోతే మానె. కనీసం నా వెనకబడిన క్షేత్రాల్లోనైనా ఆ మార్పులు చేసేందు కనుమతించండి !' అని అడిగింది.

కారువైపుకి తిరిగినవాడల్లా ఆగి,

'ఆ వెనకబడినవి 'మీవి' ఐతే, ముందుబడిన క్షేత్రా లెవరివి ?' అనడిగాడు.

ఇకావిడ కేమీ పాలుపోలేదు. ఏమీ తోచక అటూ యిటూ దిక్కులు చూసింది. ఇంతలో సిలాంతీ తాత ముందుకొచ్చాడు.

"సెర్జీ సెర్గెయెవిచ్! తల్లికి ఏ బిడ్డంటే యెక్కువ ప్రేముంటుంది. జబ్బుపడ్డ బిడ్డంటేనా? ఆరోగ్యంగా వున్న బిడ్డంటేనా? గ్రామీణార్థిక వేత్తకీ అంతే. వెనకబడిన సమిష్టి క్షేత్రాలంటే యెక్కువ శ్రద్ధ వుంటుంది. సహజంగా' అన్నాడు.

'ఏదేమైనా, పథకా లిప్పుడు మార్చడం కుదరదు. మార్చడానికి వీల్లేదు' అని చెప్పాడు సెర్జీ సెర్గెయెవిచ్. మళ్ళినీ; 'వీలుంటే. వచ్చే యేడు, పునరాలోచించితే, ఆలోచించుదాం. అంతే. ఇప్పుడు ప్రస్తుత పథకాల ప్రకారమే పని ప్రారంభం చెయ్యండి.'

అని, కారువైపుకు అడుగేశాడు.

నే ననుకున్నదంతా బూడిదలో పోసిన పన్నీరైంది! అందుకు నాస్త్యాయే కారణం. ఇకిప్పు డాయన్ని లారీ యిమ్మని అడిగినా ప్రయోజనం వుండదు. అస లేది చెప్పాలన్నా గుండె దడగా వుంటే! నాస్త్యా మట్టుకు, ఏదో స్వప్నంలో వున్నట్టు. ఆయన వెనకబడింది; చుట్టూ యింతమందీ జనం వున్నారన్న సంగతి గూడా మరచిపోయినట్టుంది. ఇ కక్కడ వాళ్ళిద్దరే వున్నారని అనుకున్నట్టుంది.

'ఇంకో యేడాదిదాకా వాయిదా వెయ్యడం మంచిదికాదు అక్కడ వాళ్ళకి సరిగ్గా తిండికూడా లేదు! చూడండి యిది ఆ యిళ్ళల్లో ఒకింట్లోంచి తీసుకొచ్చాను. అక్టోబర్ సమిష్టి క్షేత్రంలోవుండే, వార్వారా. పాల బదులు దీన్నిస్తోంది బిడ్డకి'

అంటూ, నేల ప్రొద్దుపొడుపు పువ్వు విత్తనాలూ నీరూ కలిపి చేసిన జావపోసి వున్న సీసా వొకటి బయటికి తీసింది జేబులోంచి.

'కా(మ్రేడ్ నాస్త్యా' అంటూ సెర్జీ సెర్గెయెవిచ్ మాట్లాడడం ప్రారంభించాడో లేదో మా గుండెల్లో రాయి పడ్డట్లయ్యింది. చాలా నెమ్మదిగా మాట్లాడాడాయన; 'వెనకబడిన సమిష్టి క్షేత్రాల్ని గురించి మీ కొక్కరికేగాదు మాకూ తెలుసు. ఇలా పదిమందిముందు ప్రదర్శనం చెయ్యవలసిన అవసర మేమీ లేదు' ఆయన ముహం బిర్ర బిగుసుకున్నట్లుంది; పెదవులు తెల్లబడిపోయినై.

గాయం చూచి దెబ్బ కొట్టడంలో మా నాస్త్యా ఆరితేరిన ఘట మన్నమాట; సందేహంలేదు :

ఆ నాలుగుమాటలూ అని, మళ్లీ కారు వైపుకు తిరిగా డాయన.

మేమందరం అలాగే ప్రతిమల్లా నిలబడి చూస్తున్నాం. అంతా నిశ్శబ్దంగా వుంది. చెట్లమీద పక్షులుమట్టుకు గుండె లవిసేట్టు కూస్తున్నై. ఆ కూతలు వింటే చిరాకు పుట్టుకొచ్చింది. వాటి నోళ్ళు మూయించితే బాగుండుననిపించింది. ప్రాంతీయ కమిటీ ప్రథమ కార్యదర్శి కారుదగ్గర కెళ్ళాడు. వీపుమీదున్న బూడిదరంగు పెద్దకోటు వెడల్పుగా వుంది; అడుగులు బరువుగా వేస్తున్నాడు. కాని, భుజాలదగ్గర మట్టుకు మనిషి వంగిపోయినట్టుంది, నాస్త్యా వంక చూశాన్నేను; ఇదివరకు మేం పోట్లాడుకున్నామన్న సంగతీ, ఆవిడంటే వున్న అసంతృప్తీ - అన్నీ వున్నట్టుండి అకస్మాత్తుగా మర్చిపోయాను. అలా వుందావిడ రూపం. మానసిక బాధ, విచారం, భయం, ఆందోళన అన్నీ కలిసి మూర్తీభవించి నట్టు నిలబడుంది నాస్త్యా.

ఆ మాట లంటూ నా తోటి ప్రయాణీకుడు తలవంచుకున్నాడు. మాట్లాడుతున్నప్పుడు యిక నా వంక చూడలేకపోయాడనుకుంటా; అలాగే, బొంగురు గొంతుతో చెప్పుకుపోయాడు.

'అప్పుడు నే నంతగా స్పందించిపోవడానికి కారణం ఏమిటో ? పసిపిల్లల్లా, ప్రజల్లో ఆవిడకున్న విశ్వాసమేనేమో ననుకుంటా. మను షులు పెద్దవాళ్ళయ్యేంతర్వాత హృదయం కరకుబారుతుంది. పసిపిల్లల్లో అలాగాదు; వాళ్ళ హృదయం అతిసున్నితంగా వుంటుంది....హృదయం

నిండా విశ్వాసం, నమ్మకం వుంటుంది. అంచే తా హృదయాని కింకో రక్షణంటూ వుండదు. చిన్నపిల్లలు పడే విచారం లోతులు కనుక్కోడం కష్టం. ఆ విచారానికి దరీ, దాపూ వుండదు....' అతని చేతిలో వున్న పైప్ జారి, బల్లలమధ్య వున్న రగ్గుమీద పడిపోయింది చప్పుడు చెయ్య కుండా. అతను వంగుని ఆ పైప్ తీసుకోనూలేదు; కూర్చున్న చోటు నుంచి కదలనూలేదు. 'నా చిన్నప్పటి సంగతొకటి గుర్తుకొస్తోంది నాకు. అప్పటికి నేను చాలా చిన్నవాణ్ణి; ఇంకా నాలుగేళ్ళుగూడా నిండివుండవు. మా అమ్మకి బాగా జబ్బుచేశింది. సాయంత్రంపూట కూర్చుని ఏడుస్తూం డేది. అదిచూస్తే నాకూ యేడుపొచ్చేది. ఎవరైనా చూచి నేనూ ఏడవ డాని కదే మొదలు. ఒకనాటి రాత్రల్లా నిద్రపోకుండా కూర్చుని ఆలో చించాను అమ్మకెలా సాయం చేయగలనా అని. ఆ మర్నాటి వుద యమే అమ్మ నీళ్ళు తేవడాని కెళ్ళింది. నేనుగూడా పక్కమీదనుంచి దూకి, దుస్తులేసుకుని పరుగెత్తాను. నే నెళ్ళేప్పటికే రెండు చేతుల్లోనూ రెండు కడవలు పట్టుకుని తిరిగొస్తోంది అమ్మ. 'అమ్మా! అమ్మా! నేనుగూడా తోడుపడతానే' అంటూ పరుగెత్తాను దగ్గరికి. ఆ నీళ్ళు నేనూ మొయ్యాలని నా వుద్దేశం. అట్లా ఐతే అమ్మపని తేలికౌతుందనీ, అమ్మకి సాయంచేసిన వాణ్ణౌతాననీ నా వుద్దేశం. ఏదోవొక విధంగా, నాకు చేతనైనట్టు అమ్మకు సాయం చెయ్యాలి! అదొక్కటే నా ఆలో చన. ఇప్పుడీ కడవలకి తోడుపట్టి, అమ్మకి సాయం చెయ్యగల అవ కాశం చిక్కిందిగదా అని సంతోషం! అమ్మకి మరీజబ్బుగా వుందేమో, బక్కకోపం వచ్చిందనుకుంటాను. 'ఛాఛా వెధవా! వెళ్ళు, అవతలికి వెళ్ళు' అంటూ విసురుకుంది, కోప్పడింది. ఐనా నా కర్థం కాలేదు; వెళ్ళి ఒక కడవ పట్టుకున్నాను. కాలితో దూరంగా నెట్టేసింది మా అమ్మ నన్ను. 'ఎందుకూ కాళ్ళకడ్డంపడి, దారి కడ్డొస్తావ్!' అని కసురుకుంది.

అప్పుడు ఛాలికోవ్ పెదవులమీది చిరునవ్వుని చూస్తే ఆశ్చర్యం వేసింది నాకు. బెదురు బెదురుగా, బిడియం బిడియంగా, నవ్వలేక, నవ్వ లేక వచ్చిపడినట్టుంది ఆ చిరునవ్వు.

'ఇంతకాలం గడిచింది. ఈ మధ్యనేక సంగతులు జరిగినై; అనేక సంగతులు మరిచిపోయాను. కాని ఆ సంఘటన మట్టుకు యింకా, యీనాటికీ, కళ్ళకి కట్టినట్టు కన్పిస్తూనే వుంటుంది. ఆ సంఘటన జరిగి నప్పుడు నాది పసి హృదయం; కల్లా కపటం యెరగని మనసు. ఆనాటి తోనే నా బాల్యం అఖరైం దనుకుంటా' అన్నాడు ఛాలికోవ్.

ఇతనేనా, ఆ దూర ప్రాంతాలనుంచి, స్టెప్పీల నుంచి వచ్చిన యువకుడు! క్రెమ్లిన్ సమావేశంలో నిటారుగా నిలబడి, నాలుగుమాటలు చెప్పలేకపోయిన మనిషి ఇతనేనా......

అతని భావాల్నీ, ఆలోచనల్నీ, ఆవేగాల్నీ, వుద్వేగాన్నీ, స్మృతుల్నీ తట్టి లేపిన ఆ వింత వస్తు వేమిటో? మాస్కోలో పొందిన అనుభవం యిచ్చిన వుత్తేజమా? ప్రేమ కాదుగద? ప్రతి జీవికీ జీవితంలో, ఒక్కసారంటే వొక్కసారి, ఎదురై వుక్కిరి బిక్కిరి చేసి పూర్తి పరిపక్వతని తీసుకొచ్చే ఆ వున్నతమైన ప్రేమ కాదుగద? లేకుంటే ఉద్వేగాల వుప్పెనలో వున్నాడా యితను? అలాంటి వుప్పె నలో గడచిన సంగతులన్నీ గుర్తుకు తెచ్చుకుని, అందులో మంచి చెడ్డ లన్నిటినీ, నిష్పక్షపాతంగా పునరాలోచించుకోవడం జరుగుతుంది. ఔనేమో! బహుశా, ఇవన్నీ కారణాలేనేమో. ఈ కారణాలన్నీ కలిసే, అతన్ని తట్టి, మేలుకొలిపి, మార్పు తెచ్చి, ఇంతవరకూ అతనిలో అణగి మణగి వున్న సద్భావనలనీ, ఆదర్శాశయాలనీ బహిర్గతం చేస్తున్నాయేమో?

ఔనుమరి; అంతవరకూ రాయిలా గట్టిగా వున్న చలనం లేని గ్రుడ్డులోంచి, యీకలులేని రెక్కల పిల్ల విచిత్రంగా సజీవంగా బయటి కొస్తుంది!

బహుశా, అలాంటి పరిపక్వతనే పొందుతూన్న క్షణంలో ఒక వ్యక్తిని చూచే అదృష్టం కలిగిందేమో నాకు. ఆ అదృష్టం, ఆసౌభాగ్యం

ఆ వొక్క క్షణానికి పరిమితమైతే కావొచ్చుగాక; ఐతేనేం ! ఆ వొక్క క్షణం కోసం ఒక జీవితకాలమంతా వేచివుండాలన్నా, వేచి వుండ గలను నేను !

ఆ ఎమ్ టి యెస్ మానేజరు. గుండె కొట్టుకోవడంగూడా చూడ గలుగుతున్నా ననిపించింది. ఏముంది. ఆ హృదయంలో ? ట్రాక్టర్ల ట్రేడ్‌మార్కులా ? వ్యవసాయం జరిగే ఎకరాల సంఖ్యా ? ఇంధనం బరువుచెప్పే టన్నులా ?

చిన్ననాటి చెరగని జ్ఞాపకాలమీది ముసుగుతీసి చూపించాడు నాకు; తన మనస్తత్వాన్నీ, జీవితాన్నీ ఒక్క క్షణమంటే ఒక్క క్షణంలో యెలా మార్చుకోగలడో చూపించాడు. తన వుద్వేగాలన్నిటినీ చాటూ మాటూ లేకుండా చూపించాడు.

రైలుపెట్టెలో గాలే అలా వున్నట్టుంది. మేమిద్దరమే వున్నాం ఆ పెట్టెలో.

పెద్ద గడియారం కొలిచినట్టు కొలిచి అవతల పారేస్తోంది రైలు కాలాన్ని.

"ప్రయాణీకులు దయచేసి కిటికీలు మూశేసుకోండి. రైలు వంతెన దాటబోతోంది. ప్రయాణీకులు...."

రైలుగార్డు మాటలు వినిపించుతున్నై దూరంగా.

వంతెన దాటుతున్న రైలు ధణధణ లాడింది. చీకటిలో. కిటికీ ప్రక్కనుంచి వంతెన కమ్ములు దూసుకుపోయినై. మళ్ళీ ఎప్పటి నిశ్శబ్దం.

'తర్వాతేం జరిగింది ?' అనడిగా నేను. కనులు లేపి చూసాడు. ఛాలికోవ్ :

ఏం చెప్పను ? ఏం చెప్పగలను ! అప్పుడు నాస్త్యా కనులు చూస్తే, భయపడిపోయిన పసిపిల్ల కన్నుల్లావున్నై. అదే విచారం. అదే

నిస్పృహ. అదే నిస్సహాయత, ఆ క్షణంవరకూ ఆవిడ నాకు "విరోధి'. కాని ఆవిడ భావాల్ని నేను గుర్తించినంత స్పష్టంగా యింకెవరూ గుర్తించి వుండరు. ఆవి డక్కడలా నిలబడి ప్రాంతీయ కమిటీ కార్య దర్శి వంక చూస్తూంటే, యికా నాటితోనే ఆవిడ యౌవనం ముగిసి పోతుందేమో ననిపించింది! ఇదిగో ఇది విచారం, ఇది నిస్పృహ. ఇది నిస్సహాయత అని నాకు తెలుసు; యిప్పుడు వీటి వొద్దనే నిల బడున్నాను; వీటిని చూచి భయపడుతున్నాను గూడా; ఐనా యీ ప్రపంచంలో యింత విచారం యింత నిస్పృహ, యింత నిస్సహాయత వుండగలదనీ, వుంటుందనీ విశ్వసించలేక పోతున్నాను' అని చెబు తున్నట్లున్నై ఆవిడ కనులు.

ఇంతలో, ప్రథమ కార్యదర్శి కారుదగ్గర కెళ్ళిపోయాడు. కారు తలుపు తెరిచాడు. కాలు తీసి, లోపలి కెక్కడానికని మెట్టుమీద పెట్టాడు. శిలా ప్రతిమల్లా నిలపడివున్నాం మే మందరం. ఇకప్పు డా క్షణంలో ఆయ నేం చేసినా అది మా జీవితంలోని సమస్య లన్నిటినీ నిర్ణయించ బో తోందన్న ట్లనిపించింది మా కందరికినీ; ఇక నాస్త్యా సంగతి చెప్పే పనేలేదు. ఆయ నలా ఒక చేత్తో కారు తలుపు పట్టుకుని, ఒక కాలు మెట్టుమీద వేసి నిలబడడం చూస్తూ నిలబడ్డాం. ఉన్నట్టుండి వెనక్కి తిరిగా డాయన; నాస్త్యా వంక చూసాడు.

'ఐతే, అక్టోబరు క్షేత్రంలో వార్వారా తన పిల్లల కేమిస్తూందో తెలుసన్నమాట మీకు? మంచిదే; తెలుసుకున్నారు; సంతోషం. కాని యీ పుప్పు పత్ర లవతలే, పూర్వం. మే మందరం యెలా బ్రదికామో తెలుసా మీకు? తెలియదు! నేను అక్కడ పుట్టి పెరిగినవాణ్ణే. పాల సంగతి దేవు డెరుగు; రొట్టెముక్కగూడా చూపెరగం మేం. గుడా రాల్లో వుండేవాళ్లం. ఎటుచూచినా ఎండిపోయిన నేల తప్ప యింకేమీ కన్పించేది కా దప్పుడు' అన్నాడు.

ఇప్పుడాయన గొంతులో చిరాకూ లేదు, విసుగూ లేదు, కోపమూ లేదు. ఆ క్షణంలో మే మాలోచించి వుంటాడాయన? తనలో వున్న యే బలహీనతని జయించి వుంటాడు? అక్కడలాగే నిలబడి, గతాన్ని

గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. మా మీదుగా, దూరాన్నున్న స్టెప్పీ భూముల వైపు చూస్తున్నాడు.

మంచునాగళ్లూ, ట్రాక్టర్లూ, జనమూ, మెషీన్ ట్రాక్టర్ స్టేషన్లూ లేని స్టెప్పీప్రాంత చిత్రాన్ని వూహించుకు చూశాన్నేను. ప్రక్కన కారులేని, నెత్తిమీద టోపీలేని సెర్గీ సెర్గెయెవిచ్‌ని చూశాను. స్టెప్పీలో ఏకాంతంగా, ముతకబట్ట లేసుకుని నిలబడ్డ సెర్గీని చూశాను. ఎందుకనోగాని, అప్పుడాయన్ని బాగా అర్థం చేసుకోగలుగుతున్నా నని పించింది.

ప్రశ్నమీద ప్రశ్నలేసి అడుగుతున్నా డాయన నాస్త్యాని; వింటూ నిలబడ్డాం మేం.

'యుద్ధం ఐపోయింతర్వాత యిక్కడి కెంతమంది తిరిగొచ్చారో తెలుసా మీకు? తెలియదూ? మాకు తెలుసు. ఈ అక్టోబర్ సమిష్టి క్షేత్రానికి రొక్కంగానూ, ధాన్యం రూపంలోనూ ఎంతెంత అప్పులు పెట్టామో తెలుసా మీకు? ఎంతెంత సాయంచేశామో తెలుసా? ఇంకా యెక్కువ సాయం చెయ్యవలసింది; నిజమే. . .కాని, నేను మీ వయసులో వున్నప్పు డిక్కడెన్ని పరిశ్రమలుండేవో తెలుసా? ఒక చిన్న కమ్మరి దుకాణం వుండేదిక్కడ. అదొక్కటే పరిశ్రమ అప్పుడు. కాని ఇప్పుడిక్కడున్న యంత్రాలు? చైనా దగ్గరనుంచి ఆల్బేనియా వరకూ అందరికీ తెలుసు యీ యంత్రాల్ని గురించి. ఇప్పుడు సమిష్టిక్షేత్రాల కింకా ఎక్కువ సాయం చేయగలుగుతున్నాం. పొరపాట్లు చెయ్యలేదని గాదు; చేశాం. ఈ క్షేత్రాన్నీ, మరికొన్ని క్షేత్రాల్నీ బాగుచెయ్యవలసినంత యెక్కువగా బాగుచెయ్యలేకపోయాం. అది మాకూ తెలుసు. ఎలా బాగు చెయ్యాలా అని ఆలోచిస్తున్నాం. మా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాం. యంత్రాల్నీ, విత్తనాల్నీ, నిపుణుల్నీ పంపుతోంది పార్టీ యిప్పుడు. ఇక ముందింకా యెక్కువగా పంపుతుంది. మిమ్మల్నిక్కడికి పంపిందిగూడా అందుకే, కామేడ్ నాస్త్యా. వెనుకబడిన క్షేత్రాలకి సాయం చేసేందుకు గాని మిమ్మల్ని పంపింది; ఇలాంటి సీసాలు తీసుకొచ్చి ప్రదర్శనా లివ్వడానికి కాదు.'

నెమ్మదిగా ఎంతో కష్టంమీద, ఎంతో ప్రయత్నంచేసి మాట్లాడు తున్నట్టు మాట్లాడాడాయన; కాని చివరికి, ముక్తసరిగా.

'సరే, రండి. మీ వుద్దేశం, మంచిచెడ్డల్ని గురించిగూడా ఆలో చిద్దాం; రండి' అన్నాడు.

అంటే, ఆ కారు తలుపు తీసి, మెట్టుమీద కాలు పెట్టిన ఆ ఒక్క నిమిషంలోనూ అంతా ఆలోచించుకున్నా డన్నమాట. నాస్త్యా ప్రవర్త నలో కొంత వేగిర పాటుంటే వుండవచ్చునుగాక; ఆ వేగిరపాటు వెనకున్న విలువైన సత్యాన్ని గ్రహించాడన్నమాట. గ్రహించి, మంచి చెడ్డ లాలోచించుకుని, తన చిరాకునీ, విసుగునీ, కోపాన్నీ దూరంగా పారదోల గలిగా డన్నమాట.

ఔను మరి. తెలివితేటలు గలవాడు. నిక్కచ్చైన మనిషి.

'పదండి, కామ్రేడ్స్, లోపలికెళ్దాంపదండి. అక్కడైతే కూర్చుని తాపీగా మాట్లాడొచ్చు' అన్నాడు.

నాస్త్యా చేతుల్లో సీసా జారి కింద పడింది; కను కొలుకులు ఎరు పెక్కాయి; ఇం కాస్సేపాగితే కళ్ళ నీళ్ల పెట్టుకుంటుందేమో నని పించింది. అంతరం బెలబెలమంటూ లోపలి కెళ్ళాం ఒక్కసారే; పెద్ద బరు వేదో దింపేసుకున్నట్టు సంతోషించాం అందరమూనూ.

ఇంతకుపూర్వం అనేక సార్లొచ్చా డాయన. అనేక సార్లాయన్తో మా వ్యవహారాన్ని గురించి చర్చించాం. ఎంతో గౌరవించేవాళ్ళం ఆయన్ని. కాని అదొక విధమైన అధికార మర్యాద; హోదాకిచ్చే గౌరవం; కాని, యీ క్షణంలో, యీ నిమిషంలో మే మంతరం ఆయన అరచేతిలో వున్నట్టున్నాం. ఇప్పు డాయనంటే మాకున్న గౌరవం ఆయన హోదానిబట్టికాదు. ఆయన మాకంటే తెలివిగలవాడనీ, మాకంటే సమర్థుడనీ యిప్పుడు మేం అనుకుంటున్నామంటే అందుకు కారణం, యిదివరకటిలా, ఆయన హోదాకాదు; ఆ క్షణంలో, మా హృదయంలో స్థానం సంపాదించుకున్నా డాయన;

అందరం నవ్వుకుంటూనూ. మాట్లాడుకుంటూనూ, నా ఆఫీసు వైపుకి బయల్దేరాం. మా అందరిముందూ దారి తీసింది సిలాంతీ తాత. కుర్చీ లవీ అన్నీ తీసుకొచ్చి, మమ్మల్ని కూర్చోబెట్టిందీ సిలాంతీ తాతే.

అందరం మాట్లాడకుండా కూర్చున్నాం. సెర్జీ సెర్గెయెవిచ్ నాస్త్యా వంక చూశాడు.

'వింటున్నాం. కానీండి!' అన్నాడు.

యుద్ధం ప్రారంభమైంది!

నాస్త్యా ఒక్కతే ఒక పక్షం. మిగతావాళ్ళం అంతా ఎదిరి పక్షం. ఇదివరకటి పంటలే వెయ్యాలని మేము; కూడదు, మార్చాలని ఆవిడ. ప్రస్తుతం వున్న పంటల పద్ధతిని ప్రవేశపెట్టడానికి, మొదట్లో ఇగ్నాత్ చాలా కష్టపడ్డాడు. అమలుచేసి చూసింతర్వాత, ప్రాంతీయ కేంద్రం ఆయనకి ధన్యవాదాలు చెబుతూ ఒక వుత్తరంగూడా వ్రాసింది. ఇప్పుడున్న పద్ధతి ఆయన పెట్టిన భిక్ష. ఆయనకన్న బిడ్డ. ఆయన గర్వం; ఆయన కీర్తి; ఆయన గొప్ప! ఈ క్లోవర్ గడ్డి సరిగ్గా కాకపోవడానికి కారణం సారం లేని నేల అనీ, ఎరువులు వెయ్యకపోవడం మూలాన్నే ననీ చెప్పాడు ఇగ్నాత్.

విచిత్రం యేమిటంటే, చివరి కా సమస్యని పరిష్కరించడానికి దోహద పడింది సిలాంతీ తాత.

అందరు చెప్పేదీ జాగ్రత్తగా విని, వున్నట్టుండి.

'నేను నా సమిష్టి క్షేత్రాన్ని గురించి చెప్పేదేమీలేదు కాని. ఆ పెద్ద జ్వెజ్దా సమిష్టి క్షేత్రం సంగతి చెబుతాను. అక్కడ పంటకీ, కోళ్ళో ఒక్కటి తప్ప అన్నీ వేశారు. మన స్టెప్పీలో గూడా, బహుశా, కోళ్ళో వేస్తే క్లోవర్ గడ్డి బాగా పెరగొచ్చును' అన్నాడు.

రూఛెంకోని పిలిచాం. గత పదేళ్ళలోనూ పంటల వుత్పత్తి ఎలా వుందో పరిశీలించాం. సాయంత్రాని కొక నిర్ణయానికి వచ్చేశాం.

మొత్తం క్షేత్రా లన్నిటిలోనూ, ప్రస్తుత పథకాన్ని మార్చడం ఏమంత మంచిదికాదని సలహా యిచ్చాడు సెర్జీ సెర్గెయెవిచ్. వెనక

బడిన ఆ మూడు సమిష్టి క్షేత్రాల్లోనూ, ఆ యా క్షేత్రాల ఆర్థిక పరిస్థితి నభివృద్ధి చేయడానికే యే మార్పులు చేస్తే మంచిదో ఆలోచించేందుకొక శాస్త్రవేత్తని పంపాలంటూ, ప్రాంతీయ కేంద్రానికి ఫోన్ చేసి చెప్పాడు అప్పటి కప్పుడే,

లీనా సంగతి గుర్తుకొచ్చి, మాక్కూడా ఒక లారీ యిమ్మని అడిగాన్నేను. కాని, లాభం లేకపోయింది. మొత్తంమీదాచర్చలో ఒకటి మట్టుకు జరిగింది. ఎరువులు యెత్తిపొయ్యడానికి, మూడురోజుల పాటు రైల్వే కార్మికుల ఎక్స్కవేటర్ బదులు తీసుకోవాలని అను కున్నాం. సెర్గీ సెర్గెయెవిచ్ తానుగూడా ఆ రైల్వే కార్మికులకి చెప్పి, ఎక్స్కవేట రిచ్చేట్టు చూస్తానని మాటిచ్చాడు.

నాస్త్యా ఆ సీసా చేత్తో పట్టుకుని నిలబడినప్పు డెందుకనోగాని మా మనసులన్నీ కరిగిపోయినట్లనిపించింది. కాని, యిప్పు డదికాదు ముఖ్యం; పని.

సెర్గీ సెర్గెయెవిచ్ పిలిచిన శాస్త్రవేత్త వచ్చాడు. ఆయనగూడా యిదివరటి పథకం ప్రకారమే పనిచెయ్యడం మంచిదని చెప్పాడు; కాక పోతే, ఉత్పత్తినింకా పెంచాలన్నాడు. రాత్రింబగళ్ళొకటే చర్చలు. ఎంత చర్చించినా ఎటూ తెగడం లేదు. పని సాగడం లేదు. చివరికి జిల్లా కమిటీకీ, ప్రాంతీయ కేంద్రానికీ ఫోన్ చేశాం. వెనకబడిన క్షేత్రాల్లో క్లోవర్‌గడ్డి మానేశి జొన్నా, ప్రొద్దుతిరుగుడు పూలూ నాటమని సలహా చెప్పింది ప్రాంతీయ కేంద్రం. ప్రాంతీయ కేంద్రానిదేం పోయింది? సలహాలూ యిస్తుంది; ఆదేశాలూ యిస్తుంది! నా కష్టా లెవరికి చెప్పుకోను? విత్తులు జల్లడాని కంతా సిద్ధమైపోయింతర్వాత, ఇప్పుడా కొత్త విత్తనా లెక్కణ్ణుంచి తేను? కొత్తవిత్తనాలు తేవాలి; సమచతురం మళ్ళపద్ధతిని నాటడానికంతా తల్లక్రిందులు చెయ్యాలి.

జొన్న విత్తనాలు సంపాదించడమంటే మాటలుకాదు. మొత్తం మా స్టెప్పీ అంతా గాలించినా, రెండు మూడు సమిష్టి క్షేత్రాల్లో తప్ప యింకెక్కడా దొరకవా విత్తనాలు. మా క్షేత్రాల్లో చూద్దామంటే, మొత్తం

అన్నీ కలిపినా ఒక పౌను వుండవు. అన్ని వందల హెక్టేర్ల భూమికి సరిపడా విత్తనాలు రెండు మూడు రోజుల్లో సంపాదించాలి; ఎట్లా?

ఆఫీసులో అర నిమిషంగూడా కూర్చున్న పాపాన పోలేదు నేను; ప్రొద్దుగూకులూ ఒకటే తిప్పట.

చివరికి పథకం అంతా మార్చేశాం. ఆ వెనకబడిన మూడు క్షేత్రాల్లోనూ జొన్నా, ప్రొద్దుతిరుగుడు పూలు వేయాలని నిర్ణయం ఐపోయింది.

ఇక తరవాత. మా నాస్త్యా మారిపోయింది.

చర్చలు సాగుతున్నంతసేపూ, లెక్కలేనట్టు, ఎదురుతిరిగి మాట్లాడింది. చివరి కావిడ కావాలనుకున్నది ఆమోదించబడింది. అప్పుడిహ బెదురు పట్టుకుంది.

అంతవరకూ. మాసమిష్టి క్షేత్రాల బాధ్యతల నందరం సమష్టిగా పంచుకుని పనిజేస్తూవచ్చాం. కాని, యిప్పుడు మమ్మల్నందర్నీ కాదని, తానను కున్న పథకాన్ని ఆమోదింప జేసుకుంది; ఇప్పుడన్నిటికన్నా వెనక బడివున్న మూడు క్షేత్రాల బాధ్యత పడిందావిడమీద. ఎమ్‌టియస్ అంతా, మాట్లాడకుండా తిరిగేది నాస్త్యా; ఆవిడ కనుల్లో భయం కనిపించేది. ఎవరివంక చూస్తున్నా, 'ఏదో వొక మాటని నాకు ధైర్యం చెప్పగూడదూ. నాకేమీ తోచడంలేదు; భయపడిపోతున్నాను' అని ప్రార్థిస్తున్నట్లుండేవి ఆవిడ కనులు.

అంతా చూస్తూనేవున్నాం మేము; చూచి, లోలోపల సంతోషించాం గూడాను. ఔను మరి, మమ్మల్నందరినీ కాదని, మా కెదురు తిరిగి ఏదో గొప్పకార్యాన్ని సాధించుదామనుకుంది గదా; సాధించింది. చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవ!

నాకింకా బాగా గుర్తు: ఒకనాడు మోటర్ సైకిల్‌మీద తిరిగొస్తున్నా యింటికి. అలసిపోయాను. ఆకలిగావుంది, రెండు రోజుల్నుంచీ చుట్టుప్రక్కల జిల్లాలన్నీ గాలించాను, ఆ జొన్న విత్తనాలకోసం. శ్రమ పడడమే తప్ప ఫలితం కన్పించడంలేదు. సాయంకాలమైంది. గాలి బాగా వీస్తోంది. సూర్యాస్తమయం సుందరాతి సుందరంగావుంది.

ఆ సూర్యాస్తమయకాంతి మంచుమీదపడి. మంచంతా గులాబీ రంగుగా వుంది. అది మంచేనా అన్నంతిదిగా వుంది అదిచూస్తూంటే. కనుచూపు మేర దూరంలో, ఒక్కటంటే ఒక్కటి పొదగాని, చెట్టుగానికన్పించడం లేదు. జొన్న కాడలు మట్టుకు కన్పిస్తున్నై అక్కడక్కడ పరస తొరసలుగా. అవిగూడా గాలికి వంగి, మంచును ముద్దాడు తున్నట్టున్నై. ఆ సూర్యాస్తమయమూ, ఆమంచూ తప్ప యిక ప్రపంచంలో పట్టణాలుగాని పల్లెలుగాని జంతువులుగాని మనుషులుగాని లేనేలేరా అన్నంత ఏకాంతంగా వుందా ప్రదేశం అంతా. నాకనలప్పుడు యీ భూమిమీద వున్నాననే అనిపించలేదు; మరే విచిత్ర గోళం మీదనో వున్నాననిపించింది. ఇలాంటి సాయం సమయాల్నే 'తోడేలు సాయంకాలాలు' అనే వాళ్ళం. ఎందుకనంటే. యిలాంటి సాయంకాలాల్లో తోడేళ్ళక్కూడా ఏమితోచదట; విచారపడి, ఆ విచారాన్నాపుకోలేక, గుహల్లోంచి బయటికొచ్చి. గాలికేసి వూరికే అరుస్తుంటాయట.

అలాంటి వేళ, తిరుగొస్తున్నా నేను మోటార్ సైకిల్ మీద, జిల్లా కేంద్రం నుంచి. స్టెప్పీ అంతా స్మశానంలా గుంది ; ఇంటికి తొందరగా వెళ్ళిపోవాలని హడావిడి పడుతున్నా. అప్పుడు, అగస్మాత్తుగా. దూరాన, ఎవరో మనిషా జొన్నకాడల మధ్య తిరుగుతున్నట్టు కన్పించింది. దగ్గర కెళ్ళి చూస్తే. నాస్త్యా. నన్నుచూచి సంతోషించినట్టుంది. గబగబా నడిచింది నా వేపుకి ; జొన్న పొత్తెలు పట్టుకుని, గాలిని కోసుకుంటూ వస్తున్నట్టు తలొంచి, ముందు కొంగి గబగబా వచ్చింది.

దగ్గర కొచ్చి. 'చూశారా మీరు, ఇదెంత మంచి జొన్నో. కాదూ ?, మంచు దొర్లి పడకుండా కంచెలా వుంటుంది గదాని నాటినట్టున్నారిది క్రిందటేడు. చూశారా, ఎంత బలంగావుందో. మంచి జొన్న. కాదూ ? అనడిగింది, వచ్చీ రావడంతోనే.

ఆ మాటలని. నా వంక చూస్తుంటే, 'నాకు భయం భయంగా వుంది. నే నన్నమాట నిజమేనని అండూ. పుణ్యముంటుంది. నా ఆశని దూరం చెయ్యబోకు' అంటూ ప్రార్థిస్తున్నట్లున్నై ఆవిడ కనులు.

'అంత మంచిదేమీ కా దీ జొన్న' అన్నాను, నిర్దాక్షిణ్యంగా.

'నిజమే, నిజమే, యిక్కడే పండుతుందని కాదు' అనన్నది వెంటనే; 'అది కాదు, మొత్తంమీద పశువుల గ్రాసానికి, వాముల్లో వాటిల్లో కట్టలు కట్టి పెట్టడానికి...బా వుంటుంది; మంచిదే; మీకు తెలుసా. చూడండి, యీ ఆకులు చూడండొకసారి.'

'ఐనా, యీ జొన్నని చూస్తూ గడపాల్సిన వేళ కాదిది. నా వెన కెక్కు; యింటి కెళ్లిపోదాం' అన్నా నేను.

అన్నానేగాని, పైకలా అంటూన్నప్పుడే నీమూలాన రాత్రింబగళ్లు నిద్రాహారాల్లేకుండా స్టెప్పీ కద్దాంపడి తిరుగుతూన్నది చాలదూ? ఇంకా చర్చ లెందుకులే!' అనుకున్నా. లో లోపల.

నావంక చూచింది నాస్త్యా; నా భావాల్ని చదివేసినట్టుంది.

'ఫర్వాలేదులెండి, నడిచొస్తాలే నేను' అంది.

'సరే, నీ యిష్టం'

అని నా మోటర్ సైకి లెక్కి బయల్దేరాను. మలుపు తిరిగేప్పు డొకసారి వెనక్కి తిరిగి చూశా. నెమ్మదిగా నడిచొస్తోంది, చేతుల్లో ఆ జొన్న పట్టుకుని. ఊరింకా చాలాదూరం వుంది. 'దారిలో తోడేళ్లు తినేస్తాయేమో' అనుకున్నా నేను. అలా వెనక్కి తిరిగిచూడ్డంలో నా సైకి లెళ్లి, ప్రక్కనే వున్న గుంటలో పడింది; నేనూ తల్లక్రిందు లయ్యే వాడినే యింకాస్తుంటే, 'ఆ తోడేళ్లు తినేస్తేనే మంచి దావిణ్ణీ. పీడా వదుల్తుంది! శాంతిఅంటే ఏమిటో అప్పటికైనా అర్థమౌతుంది మాకు!' అని తిట్టుకున్నా, ఆ కోపంలో.

ఎంత లేదన్నా, మొత్తంమీద శాంత విలబడి గాలి పీల్చుకోవడానికి సావకాశం చిక్కింది మాకు. మా పోట్లాటలూ, చర్చలూ, వాగ్వాదాలూ అన్నీ ఐపోయినై. నిజం చెప్పాలంటే, రెండు మూడు రోజులు ప్రశాంతంగానే వున్నాం.

సెర్గీ సెర్గెయెవిచ్ పుణ్యమా అంటూ రైల్వే కార్మికుల దగ్గర్నుంచి ఆ ఎక్స్కవేటర్ తెచ్చుకున్నాం. మా రైల్వే స్టేషన్ దగ్గర పడున్న ఎరువుని తోలుకోడానికని మూడురోజులపాటుయిచ్చారది. అక్కడ పడున్న ఎరువు మావొక్కరిదేకాదు; చుట్టుప్రక్కల జిల్లాలక్కూడా

భాగంవుంది అందులో. కాని, చాలా కాలంనుంచి ఎవరూ తోలుకెళ్ళ లేదేమో, రెండు వరుసలుగా పడుంది. ఇప్పుడొచ్చి, యిది మాదీ అనే వాళ్ళగూడాలేరు. కాబట్టి అదంతా మా పొలాల్లోకే తోలేద్దామనుకున్నాం నేనూ; ఫెద్యా కలిసి. జిల్లాలో వున్న లారీలన్నీ మాకిచ్చేశింది జిల్లా కేంద్రం ఆ మూడులోజులూనూ. కావలసినన్ని లారీలు. కింద మంచు గట్టిగా వుంది. రోడ్లు బావున్నై. ఎక్స్కవేటర్ ఆగకుండా పనిచేస్తోంది. కార్మికులు గూడా పోటీపడి పని చేస్తున్నారు. జోరుగా సాగుతోందిపని.

ఇంతలో, ఎవరో ఆడపిల్ల, డ్రైవర్లతో హాస్యాలాడుతూ కేరింతలు కొట్టడం చూశాన్నేను. ఆబిగుతు లాగూలుచూచి అనుకున్నాను నాస్త్యాయేనని. దుమ్ము మీద పడకుండా రుమాలొకటి చుట్టుకుంది. ఒక లారీ మీదినుంచింకొక దానిమీదికి మేకపిల్లలాగెంతుతోంది. అట్లా గెంతుతూనే, నాదగ్గర కొచ్చింది దారిచేసుకుని.

'ఓ, ఛాలికోవ్ ! భలేగావుంది కాదూపని !' అన్నది దగ్గరకొచ్చి. వెంటనే. 'కాని యీ పని చేయవలసిందిట్లాకాదు.' అని అంది.

'మళ్ళీ పాఠాలు చెప్పబోతోందిరా బాబూ' అనుకున్నా నేను. కాని తన గొడవ తాను చెబుతూనేవుంది నాస్త్యా :

'లారీల్ని రెండు వైపుల్నుంచీ నింపాలి. లేకుంటే, మధ్యలో, ఎక్స్కవేటర్ కాస్సేపూరికే వుండి పోతోంది'

ఆవిడ చెప్పింది నిజమే. ముందొక లారీ వస్తుంది. ఎక్స్కవేటర్ ఎరువు తవ్వి అందులో పోస్తుంది. ఆ లారీ వెనక్కి వెళ్ళి, ఇంకో లారీ ఆ ఎక్స్కవేటర్ బొక్కెన కిందికి వచ్చేదాకా, ఎక్స్కవేటర్ వూరికే వుండిపోతోంది. నాస్త్యా ఆ నాలుగు మాటలూ చెప్పి, పరుగెత్తు కెళ్ళిపోయింది ఎక్స్కవేటర్ డ్రైవర్ దగ్గరికి ; నేను జవాబు చెప్పేదాకా గూడా ఆగలేదు. వెళ్ళి అతని కేమిటో చెప్పింది ; అతను తలూపాడు. కన్నుమూసి తెరచే లోపుగా లారీ డ్రైవర్ల దగ్గర కెళ్ళి పోయింది. మరుక్షణంలో లారీ లన్నీ రెండు వరుసలుగా నిలబడినై. ఎక్స్కవేటర్ కటూ యిటూ. ఒకవేపు లారీ నిండిపోగానే, బొక్కెన రెండో వైపుకు తిరిగి, ఆవైపు లారీని నింపుతోంది. పని యిదివరకటి

కంటే జోరుగా సాగుతోంది. కాని, నాకు కష్టంవేసింది. అక్కడ ముగ్గురు మగవాళ్ళం వున్నాం: ఫెద్యా, ఇగ్నాత్, నేను. ఏం లాభం! ఒక ఆడదొచ్చి, ఐదు నిమిషాల్లో మేం అనుకోనన్నా అనుకోని పని చేసేసింది. కొద్దిగా కోపంకూడా వచ్చింది. నాస్త్యా వచ్చి నా ప్రక్కనే నిలబడింది. వళ్ళంతా దుమ్ము కొట్టుకునుంది, గాలి మూలాన, తలకట్టు కున్న రుమాలు కొద్దిగా వెనక్కి జారింది. అటూ ఇటూ ఆ రెండు జడలూ కన్పిస్తున్నై దుమ్ము కొట్టుకొని కొద్ది కొద్దిగా. ఎట్లాగోట్టా ఆ కోపం తీర్చుకోవాలనో, నాస్త్యాని కాస్సే పేడిపిద్దామనో యేమోకాని, లేకుంటే అవి రెండూ గాక నా కర్ధంకాని కారణంగూడా యింకేమైనా వుంటే వుందేమో తెలియదు కాని, రెం డేళ్ళతో ఆ జడల్లో ఒకటి పట్టుకుని.

'భలే ముఖ్య గ్రామీణార్థిక వేత్తవులే నువ్వు. చిన్నప్పు డేసుకునే జడ లింకా అట్లాగే వున్నై దుమ్ము కొట్టుకుని' అన్నా, ఎద్దేవగా.

ముందు కొద్దిగా సిగ్గుపడి నవ్వేసింది; అంతే తప్ప కోప్పట్టం మట్టుకు లేదు.

'నిజమే. మీరనేది నిజమే. చిన్నప్పుడెప్పుడో స్కూలుకు పంపే టప్పుడు అల్లిందీజడలు మాఅమ్మమ్మ. అప్పట్నుంచీయింతే.' అంటూ మళ్ళీ డ్రైవర్లవైపుకి పరుగెత్తింది 'వ్యాస్తా! వ్యాస్తా! అటుకాదటుకాదు యిటూ; ఎడమ చేతివైపుకి!' అంటూ.

వెళ్ళి, మళ్ళీ డ్రైవర్ల పనిని తనిఖీ చేస్తోంది. ఆపిణ్ణి ఎద్దేవచెయ్యా లనుకున్నాను; సిగ్గుపరచాలనుకున్నాను; నేనే సిగ్గుపడిపోయాను. ఆ జడలలా ఆవిడ వుంచుకుంటోంది అందానికనిగాదు; అలవాటు పడి పోయింది, అంతే. అసలు జడల్ని గురించి ఆలోచించనేలేదావిడ. వాటిని గురించి ఆలోచించ వలసిన అవసరమే కలగలేదావిడకి. కాని, నేనూ ఫర్గనోవ్....యిన్నేళ్ళొచ్చినై, ఆలోచించడానికి విషయాలు కరువైనట్టు ఆ జడల్ని గురించి ఆలోచించాం. అంతచిన్నపిల్ల....ఆపిల్ల....అందాన్ని గురించి ఆలోచించవలసిన ఆడపిల్ల....ఆ అమ్మాయికా జడల్ని గురించి

ఆలోచించవలసిన అగత్యమే కన్పించలేదు. సిగ్గుచేటుకాదూమరి. సిగ్గు పడకేం జేస్తాను మరీ!

కాపడానికి వన్నీ చాలా చిన్న సంగతులే: ఈ లారీల వరసలూ, జడలూ అవీనీ. ఐనా, ఎందుకనో అవి నా మనసులో నాటుకున్నై. ఈ రెండు సంఘటనలూ, సంభాషణలూ జరిగిం తర్వాత, ఇదివరకు కని సించని కొత్త దనం యేదో కన్పించిందావిళ్లో నాకు. ఎందుకనోగాని, ఆవిడంటే యిష్టం గూడా కలిగింది. ఆ డ్రైవర్లతో అలా హాస్యా లాడడం, లారీలచుట్టూ బొంగరలా తిరగడం...చూస్తూంటే సంతోషం వేసింది. ఆ క్షణంలో ఆవిడ పేరు నాస్త్యాస్యా అని గాని ఆవిడ మా ముఖ్య గ్రామీణార్థిక వేత్తనిగాని గుర్తులేకుండా పోయింది; హుషారైన అమాయిక పిల్ల అనిపించింది. 'అన్నీ అవే సర్దుకు పోతాయిలే' అను కున్నాను నేను. 'మన ఎమ్‌టియస్ యిక శాంతంగానే వుంటుందిలే. గొడవ లేమీ లేకుండా' అనుకున్నాను.

కాని ఆ ఆశ కేమీ ఆధారాల్లేవని మర్నాడే తెలిసిపోయింది. ఆ మర్నాడే, ఫర్జనోవ్ దగ్గరకెళ్లి, ఆ సమచతురం మళ్ళ పద్ధతిని మంచులో వుపయోగించి చూడాలని పట్టు పట్టింది నాస్త్యా.

'విత్తనాలు జల్లే యంత్రాల్ని ముందుగానే పరీక్ష చెయ్యాలి' అని అంది.

ఫర్జనోవ్ కిటికీదగ్గర నిలబడి, బయటికి చూస్తూ, పైప్ కాల్చు కుంటున్నాడు.

అతను నాస్త్యావంక తిరిగికూడా చూడలేదు, 'ఉహుఁ' అన్నాడు లెక్కలేనట్టు.

'ఒకవేళవి సరిగ్గా లేకపోతే___'

'ఉఁ?'

'వాటిని బాగుచెయ్యాలి గదా'

'నిజమే' అన్నాడు ప్రశాంతంగా.

దానితో కాస్త తగ్గినట్టు కన్పించింది.

'ఐతే గోషాతో చెప్పనా, వాటిని పొలాల్లోకి తోలుకెళ్ళమని?'

ఫర్జనోవ్ వెనక్కి తిరిగి, ఒకసారి పైకీ కిందికీ చూచాడావిణ్ణి. నాస్త్యా తలుపు దగ్గర నిలబడుంది. ఫర్జనోవ్ భుజాలంత ఎత్తుగూడాలేదు.

'నాస్త్యాస్యా వాసిల్యెవ్నా. నీకిక పనేమీలేదా ?' అనడిగాడు ఫర్జనోవ్: 'నీసొంత పనేమీలేదూ నీకు ? ఓహో, వుందీ ? ఐతే వెళ్ళి ఆ పని చూసుకోవడం మంచిది. యంత్రాలకి బాధ్యత వహించేది నేను. నా బాధ్యతల్ని గురించి నువ్వేమీ చెప్పనవసరంలేదు నాకు; నా బాధ్యతలు నాకు తెలుసు.' అనేసి, ఇకావిడ వంక చూడనుగూడా చూడకుండా, వచ్చి, టేబుల్ దగ్గర, నాప్రక్కనే కూర్చున్నాడు. నాభుజంమీద చెయ్యేసి 'చూశావా, ఛాలికోవ్ ! ఒలోచిఖినో క్షేత్రాలకెంత చక్కని యంత్రం వచ్చిందో ?, అన్నాడు.

తలుపు దగ్గరావిణ్ణలా నిలబెట్టి, అన్నాడీ మాటలు నాతో. కాస్సేపలాగే, అక్కడ నిలబడి, తర్వాత వెళ్ళిపోయింది.

వెంటనే ఫెద్యా, ఫర్జనోవ్, నేనూ జిల్లాకమిటీ ప్లీనమ్ సమావేశానికెళ్ళిపోయాం. ఆసమావేశంనుంచి తిరిగొచ్చేప్పటికి యింకొక రోజు ఆలస్యమైంది మేం వచ్చేప్పటికి, మంచులో విత్తనాలయంత్రం ఒకటి సిద్ధంగావుంది, ఎర్రజెండాలు పట్టుకుని ఆడపిల్లలటూ యిటూ హడావిడిగా పరుగెత్తుతున్నారు.

'ఏమిటిదంతా ?' అనడిగాం.

'గత రెండు రోజుల్నుంచీ సమచతురం మళ్ళపద్ధతి ప్రయోగాలు చేస్తున్నాం.' అని చెప్పారు.

'ఎవరు చెప్పారు ?'

'ముఖ్య గ్రామీణార్థిక వేత్త.'

అంటే ఏమిటన్నమాట ? మేం లేకపోవడం అవకాశంగా తీసుకుని, మా ఆదేశాలకి వ్యతిరేకంగా, తన స్వంత పూచీమీద, కార్ఖానాల్లో పనులు చేసుకుంటున్నవాళ్ళ నాపనుల్లోంచివతలికి పిలిచి, యీ పని పెత్తాయించిందన్నమాట ! ఇంతకంటే ఘోరం యింకేముంటుంది ? నాకు పిచ్చెత్తినంత పనైంది. ఇకిలా ఐతే, నేనీ ఎమ్‌టియెస్ నొదిలి ఒక్క

రోజుగూడా 'అటూ యిటూ కదలడానికి వీల్లేదన్నమాట; కుక్కలా యిక యిక్కడే కాపలాకాసుకుంటూ కూర్చోవాలన్నమాట!

ఒక హెచ్చరిక వ్రాసి పంపించాను; చదువుకుంది. తర్వా తెప్పుడో, తిరిగి వెళ్ళిపోతూ వచ్చింది మా దగ్గరికి:

'విత్తనాలు జల్లే యంత్రా లన్నిటికీ ఉంగరాల్లా వున్నై ఖాళీలు. విత్తనాలు ఆ ఖాళీల్లోంచి గూడా క్రిందికి పడిపోతున్నై. అంచేత మళ్ళ వారీగా జల్లడం సాధ్యం కావడంలేదు' అని చెప్పింది.

'మాకూ తెలుసు' అన్నాడు ఫర్జనోవ్, ఆవిడవంక కన్నెత్తిగూడా చూడకుండా. వెళ్ళిపోయింది.

ఇంతలో వసంతకాలం వచ్చేసింది. అందర్నీ దళాలుగా విభ జించి పొలాల్లోకి పంపించడం ప్రారంభించాం.

ఇక తరవాత యేం జరగాలంటే అది జరిగింది. అంతవరకూ జరిగిందంతా ఒక ఎత్తు; తర్వాతిదంతా ఒక యెత్తు!

రెండు స్వభావాలు. రెండు ప్రకృతులు. ఒకటి నాస్త్యా: రెండోది ఫర్జనోవ్; ఇద్దరిమధ్యా పచ్చగడ్డి వేసినాసరే, భగ్గున మండిపోతోంది. ఆ మంటలమధ్య పడి మా ఎమ్‌టియెస్ బాధ పడాల్సొచ్చింది.

ఫర్జనోవ్ వచ్చి, ఇవ్వాళ దళం సర్వసంసిద్ధంగావుంది, యిదిగో యివ్వాళ మధ్యాహ్నం పొలాల్లోకి పంపించవచ్చునని చెబుతాడు; ఇంకో అరగంట తర్వాత నాస్త్యా వస్తుంది, ఆ దళం యంత్రాలలో మోల్డు బోర్డులు చెడిపోయినై. సాయంత్రానికి కార్ఖానాకి పంపించి బాగుచేయించా లని చెబుతుంది.

'నాపని కష్టం రాబోక' అని గర్జిస్తాడు ఫర్జనోవ్.

'మీ యిష్టం వచ్చినట్టు కసాపిసాగా విత్తనాలు జల్లితే నే నెలా వూరుకుంటాను!' అంటుం దావిడ.

రోజూ యింతే!

చుట్టుప్రక్కలున్న ఎమ్‌టియెస్‌ల వాళ్ళందరియంత్రాలూ పొలాల్లో కెళ్ళిపోయి అప్పటి కప్పుడే చాలా రోజులైపోయింది. మా యంత్రా

లింతవరకు కార్ఖానా దాటి బయటికి రాలేదు. పొలాల్లో కెళ్ళి పని చెయ్యడానికి మా యంత్రాలన్నీ సిద్ధంగా వున్నయ్యని జిల్లా కమిటీకి మేం వ్రాస్తే 'లేదు. లేదు. ఒక్క యంత్రాలదళం బాగుచేతగూడా పూర్తి కాలేదని ఆవిడ వ్రాస్తుంది. ఇకెట్లా చచ్చేది! అదీగాక, యింకొకసంగతి. పోనీ, చుట్టుప్రక్కలవాళ్ళ యంత్రాలు మావాటికంటె బాగున్నవా అంటే అదీ లేదు. లోపాలు పట్టాలంటే అక్కడా వుంటాయి కావలసినన్ని లోపాలు. కాకపోతే అక్కడి గ్రామీణార్థిక వేత్తలు మా గ్రామీణార్థిక వేత్తలాంటి వాళ్ళు కాదు; మంచివాళ్లు. అది తలచుకున్నకొద్ది మాకు మరింత బాధగా వుండేది.

ఒకనాడు, ఫర్జనోవ్వూ నేనూ పొలాల్నుంచి తిరిగొస్తున్నాం. వెన్యా పరుగెత్తుకొచ్చాడు యెదురుగా.

'మీకోసమే వస్తున్నా. తొందరగా రండి! ట్రాక్టర్, ఆర్థికవేత్త మీదికి తోలుతున్నాడు మన స్తెంకా' అని చెప్పాడు.

పరుగెత్తుకెళ్ళాం కార్ఖానా దగ్గరికి. సరిగ్గా గేటు దగ్గరుంది ఒకట్రాక్టర్; ఆట్రాక్టర్ ముందు నిలబడుంది నాస్త్యా.

ట్రాక్టర్ ప్రక్కనే వ్రేళ్ళాడుతున్నాడు స్తెంకా;

'దారొదిలి పెట్టండి' అని అరుస్తున్నాడు.

'వీల్లేదు. వెనక్కి పోనీ.' అంటోంది నాస్త్యా, ప్రశాంతంగా.

'ఏమనుకున్నారో, యుద్ధంలో నామతిగూడాపోయింది. మీమీదగానే తోలేస్తా యీ ట్రాక్టర్!'

ఒక్కడుగు కూడా వెనక్కెయ్యలేదు నాస్త్యా;

'ఆపిచ్చిపనేం చెయ్యవుగాని వెనక్కి తిరుగు' అంది ఇంకా ప్రశాంతంగా.

ఫర్జనోవ్‌ని చూచాడు స్తెంకా!

'కామ్రేడ్ ఫర్జనోవ్! కామ్రేడు ఛీఫింజనీర్! ఇదిప్పటికి నాలుగోసారి నన్ను రిపేర్లకి పంపించడం! ఇంకా యెంతకాలం ఓపిక పట్టమంటారు నన్ను? మీరనుమతిస్తే.........'

ఫర్జనోవ్ కప్పటికే అంతా అర్థమైపోయింది.

'నాస్తాస్యా వాసిల్యెవ్నా, యీ దశాన్నిలా అరికట్టడానికి కారణా లేమిటో చెబుతారా ?' అనడిగాడు ఫర్జనోవ్ మర్యాదగా.

'మీరు వి త్తనాలు జల్లేయంత్రాన్ని పరీక్ష చేశారా, అర్కాదీ ఫర్జ నోవ్ ?' అనడిగింది నాస్త్యా, మరింత మర్యాదగా.

'ఆ పూచీ అంతానాది.'

'మీరు పరీక్ష చేశారా ?

'ఆ.'

'యంత్రాల మధ్యవున్న భాగాలు పనిజెయ్యడంలేదు; ఊరికే పైపైన శుభ్రం చేశారు.'

'నాకు తెలుసు.'

'మీకు తెలుసా !' అంటూ ఆశ్చర్యపోయింది నాస్త్యా: 'మీకు తెలిసేనా.........'

'ఆ భాగంమట్టుకు. పొలాల్లో కెళ్ళింతర్వాత అక్కడి కక్కడే బాగుచేస్తారు ?

'పొలాల్లోనా ? ఆ పొలా లిక్కడికి పదమూడు మైళ్ళ దూరం. అక్కడ కార్ఖానా ఏముంది ? ఇక్కడ బాగుచెయ్యలేని వాళ్ళక్కడేం బాగుచెయ్యగలుగుతారు ? అక్కడ కార్ఖానా లేదు. అవసరమైన పని ముట్లుండవు. మనుష్యులుండరు. ఈ దశాన్ని సాయంత్రందాకా యిక్కడే వుంచి బాగుచేయించి పంపడం మంచిది, ఛాలికోవ్. ఇక్కడే తొందరగా పూర్తౌతుందిపని, అన్ని సౌకర్యాలూ వున్నై యిక్కడ. మనంగూడా చూడొచ్చును.

నేను జవాబు చెప్పే లోపుగానే, ఫర్జనోవ్ ఒకడుగు ముందు కేశాడు.

'ఆ విషయాలన్నీ మానేజరుతో యిదివరకే మాట్లాడేశాం. దారి తప్పుకుని, ట్రాక్టర్‌ని వెళ్ళనీ, నాస్తాస్యా వాసిల్యెవ్నా' ! అన్నాడు,

'తప్పుకో దారిలోంచి' అంటూ గర్జించాడు ష్రైంకా.

ప్రక్కకు తప్పుకుం దావిడ. నమస్కారం చేసినట్లుగా కొద్దిగా ముందుకు వంగాడు ఫర్జనోవ్. దయగా, ప్రేమగా చూచినట్లు చూశాడు. ప్రతిమాటా తూచివేస్తున్నట్లు, కోపంగా.

'ఇదిగో, ఇకిది నా చివరి హెచ్చరిక...ఇకెప్పుడూ, నా ఆదేశాలకి అడ్డురావొద్దు...ఇదే చెప్పడం' అన్నాడు.

నిటారుగా నిలబడి, తలతో సౌంజ్ఞ చేశాడు స్తెంకాకి :

'రానీ, ట్రాక్టర్ !'

స్తెంకా తోలుకెళ్ళిపోయాడు ట్రాక్టర్. నాస్త్యా అక్కడే వుండి పోయింది. నేనూ, ఫర్జనోవూ ఆఫీసు కెళ్ళిపోయాం. వెన్యాగూడా మాతో పాటే వచ్చేశాడు.

ఆఫీసులో కడుగు పెట్టామో లేదో, వెన్యామీద విరుచుకుపడ్డాడు ఫర్జనోవ్.

'నువ్వు....నువ్వు....నువ్వు నన్నే మోసం చేస్తావన్నమాట ?' అంటూ కప్పెగిరి పోయేట్టు వేశాడు కేకలు.

'నేనేమీ మోసం చెయ్యలేదు, అర్కదీ ఫర్జనోవ్. పొరపాటు జరిగిపోయింది....నాదే తప్పు. అంతా ఆ స్తెంకా మీద వదిలి పెట్టేశాను........'

'ఆఁ, ఆఁ, అదే. చెబుతాగా. తప్పులు చెయ్యడం నేర్పుతాగా నీకు, ఆగు. నువ్వేమైపోతావో, ఎట్లా చేస్తావో, చస్తావో, బ్రదుకుతావో తెలియదు నాకు; ఏదేమైనాసరే. యివ్వాళ రాత్రి తెల్లవార్లూ పని చేసైనాసరే. రేప్రొద్దుటికల్లా ఆ యంత్రాలన్నీ బాగుచెయ్యాలి. బాగుచేసి, సిద్ధంగా వుండాలి; తెలిసిందా ?'

'అట్లాగే చేస్తా, అర్కదీ ఫర్జనోవ్, ఇవ్వాళ రాత్రల్లా చేస్తా పని. అన్నీ సిద్ధంచేసి వుంచుతా.'

'పో, యిక, నా కన్నబడబాకు !'

వెన్యా వెళ్ళిపోయాడు. ఫెద్యాని పిలిచి, జరిగినదంతా చెప్పాం మేం.

ఇంతలో, నాస్త్యా వచ్చి పడింది. తలుపుల దగ్గరే ఆగిపోయి.

'ఐతే, మీ రబద్ధం ఆడారు...ఇద్దరూ ఆడారన్నమాట. అబద్ధం. మీరు పెన్యా కప్పగించారా పనంతా. మీరు స్వయంగా పరీక్ష చెయ్య లేదు. స్త్రెంకాలాంటివాళ్ళు అబద్ధ మాడారంటే అదొక దారి ; కాని, మీరు...పార్టీ నాయకులు—మీరుగూడా అబద్ధమాట్టమా...నాకేమీ అర్థం కావడంలేదు...మీ రబద్ధం ఆడడమేమిటి ? ఎందు కాడినట్టూ ఆ అబద్ధాలు ?' అనడిగింది నెమ్మదిగానే.

ఆ గొంతులో మమ్మల్ని గేలిచేస్తున్న ధ్వనీలేదు ; మమ్మల్ని బాధ పెట్టాలని అన్నట్టూలేదు. తన బాధమట్టుకు వ్యక్తమైంది ఆమాటల్లో. తన కేదో అర్థం కానట్టూ, అర్థంకాక బాధపడి పోతున్నట్టూ వుంది.

నాకేమీ పాలుపోలేదు: సిగ్గేశింది. స్నేహితుల్లాగా కూర్చుని మాట్లాడు కోవడం మంచిది; వూరికే కోపంగా కేకలేసుకుని ప్రయోజనం లేదు అనుకున్నాను.

ఇంతలో ఫద్జనోప్ లేచాడు.

'నీమూలాన యిప్పటికే అందరికంటే వెనకబడిపోయాం. ఇప్పు డొచ్చి, మాకుపన్యాసాలిస్తున్నావు. ఉపన్యాసాలు ! చాలిక ! నీమూలాన యీ ఎమ్‌టియెస్ గౌరవం గంగపాలు........' అంటూ ఎగిరెగిరిపడ్డాడు కోపంగా.

'ఇతా గౌరవం ఒక్కటే మీక్కావలసింది !' అంటూ అడ్డొచ్చింది నాస్త్యా.

'బాబాసు. నీకు మా గౌరవం యేమీ అక్కరలేదు' అంటూ అందుకున్నాడు ఫెద్యా; 'సరే గాని, యీ ఎమ్‌టియెస్ గౌరవమన్నా కాపాడాలా, వద్దానువ్వు ? నీకిసంటే ఈషణ్మాత్రంగూడా లక్ష్యంలేదు. కాని, ఫద్జనోప్‌కీ, మాకూ, యిదే సర్వస్వమూనూ. ఈ ఎమ్‌టియెస్ గౌరవమన్నా, పేరు ప్రతిష్ఠలన్నా వదిచస్తాంమేం. మే మిక్కడికొచ్చిన కొత్తలో యిదావినో అన్నిటికంటే వెనకబడి వుండేది, కాని యిప్పుడు...

'జానాను. ఇప్పుడు' అంటూ అడ్డుతగిలింది నాస్త్యా; 'జానాను. ఇప్పుడు మీరూ మిగతావాళ్ళూ పోటీలుపడి పనిచేస్తున్నారు. ఆ సంగతి విని విని విసుగెత్తిపోయింది నాకు. ఇతాపోటీలు తప్పితే మీరేమి పట్టించుకోరా?'

'ఏమీ చెయ్యాని వాళ్ళకి. ఏదన్నా యిష్టం వుండదు.'

నాస్త్యా వెళ్లిపోయింది.

ఇంకొన్ని రోజులకి, యిదివరకెప్పుడూ ఎరగని దురదృష్టం పట్టుకొచ్చింది మాకు.

రెండు ట్రాక్టర్లు రిపేరుకని తిరిగొచ్చేసినై కార్ఖానికి, ఒకటేమో, కరిగేమంచు నాపేందుకని పొలం దున్నుతూండగా విరిగిపోయింది; రెండోదింకా పొలంలోకి ప్రవేశించకముందే పాడైపోయింది. ఎందుకని చెడిపోయాయో చూదామని పరుగెత్తాం అందరమూనూ. ఆ ట్రాక్టర్లు రెండూ గోషాకి బదులొచ్చిన వ్యక్తి అధీనంలో వున్న ట్రాక్టర్లు. గోషా ఆ సమచతురం మళ్ళ వ్యవసాయపద్ధతి నేర్చుకునేందుకు వెళ్ళాడుగదూ; అందుకని యీ కొత్త వ్యక్తి అధీనంలో వుంచాం వీటిని.

అంతా బాగుచేసి, సరిగానే వున్నై, పనికి సిద్ధంగా వున్నై అని పంపిన రెండు ట్రాక్టర్లు సరిగ్గా విత్తనాలు జల్లేముందు పాడై కూర్చున్నై. మా ఎమ్టియస్ కంతకంటే చెడ్డపేరే ముంటుంది యింకా? ఈ విషయం మా ప్రాంత మంతటికి తెలిసింది. మా ప్రాంతీయ పత్రికలో యీ సంగతిని గురించి ఒక వ్యాసం గూడా వ్రాశారు. ఝురావినో ఎమ్టియస్ వెనకబడి పోతోందనీ, యంత్రాల బాగుసేతకి చాలాసమయం వెచ్చించారనీ, ఐనా యంత్రాలు సర్వ సంసిద్ధం చెయ్యలేకపోయారనీ గూడా వుంది ఆ వ్యాసంలో.

ఆ పత్రిక తీసుకొచ్చి, నాస్త్యా ముందు విసరి పడేశాడు ఘర్షనోవ్.

'చూడు, జాగ్రత్తగా చూడు! ఇదంతా నీ చలవె!' అన్నాడు. కోపంగా.

ఇప్పటికైనా. చేసిన తప్పులు తెలుసుకుంటుందని ఆశించాం. అదేమీలేదు ! మొట్టమొదట కొద్దిగా జంకింది: కాని బిడియంమట్టుకు పడలేదు.

'అందులో నాచలవేముంది. అదంతా మీరే చేతులారా చేసుకున్నారు మీ ఎమ్‌టియస్‌లో మంచి మెకానిక్‌లు యిద్దరుముగ్గురుకంటే ఎక్కువ లేరెందుచేత ? మీ దగ్గర పనిచేసే వాళ్ళెవరో, ఎవరిలాంటి వారో ఎప్పుడైనా ఒక్కక్షణమైనా ఆలోచించారా మీరు ?'

ఫర్జనోవ్ ఆవిడకి సమాధానంగూడా చెప్పలేదు ఆవిడ వెళ్ళిపోయింతర్వాత,

'ఇదిగో, అబ్బాయ్ ! మీ యిష్టమొచ్చినట్టు చేసుకోండి; నేను వొద్దనను. నేను పట్టణంలో నాకున్న మంచి వుద్యోగమూ అదీ అంతా వదిలేసి యిక్కడికొచ్చింది నా గుండెలు పగలగొట్టుకోడానికి మట్టుకు కాదు. అయమ్మాయో. నేనో....నిర్ణయించుకోండి !' అన్నాడు నావైపుకు తిరిగి.

ఎట్లాగోట్లా ఆవిడ్నక్కణ్ణించి పంపించెయ్యాలని నిర్ణయించేసుకున్నాం. దానికి తగిన వాతావరణం అంతా జిల్లా కమిటీలో తయారు చేస్తున్నాను నేను.

మా ప్రాంతంలో పర్యటన చేస్తూ చేస్తూ, సెక్రెటరీ మెచిన్ మా జిల్లా కార్యాలయానికిగూడా వచ్చాడు.

మమ్మల్ని జిల్లా కమిటీ ఆఫీసుకు రమ్మని కబురు చేశారు. వెళ్ళాం. సెక్రెటరీ మెచిన్, రూఛెంకో, యిద్దరూ వున్నారు మేం వెళ్ళేప్పటికి.

వెళ్ళింతర్వాత, కూర్చున్నారు. మా నలుగురికీ గోడప్రక్కన కుర్చీలున్నై. నాస్త్యా మాత్రం మా యెదురుగావున్న గోడప్రక్కన దూరంగా ఒక మూల కుర్చీమీద కూర్చుంది. రూఛెంకో కూర్చోలేదు; రెండు కిటికీలకీ మధ్య అటూయిటూ తిరుగుతున్నాడు. కాసేపు మా వంకా, కాసేపు నాస్త్యావంకా చూస్తూ. సరిగ్గా, స్పష్టంగా వినిపించని

విషయం యేదో వింటున్నట్టు తల ఒకవైపుకు వంచి తిరుగుతున్నాడు. కిటికీ దగ్గరకెళ్ళి, నిలబడి నాస్త్యావంక చూస్తాడు; మళ్ళీ తిరి గివతలి కిటికీ దగ్గరకొచ్చి, మళ్ళీ యింకోవైపునుంచి చూస్తాడు ఆవిణ్ణి. ఏదో పరిశీలన చేస్తూన్నట్టు.

సెర్గీసెర్గెయెవిచ్ కదలకుండా కూర్చునున్నాడు కనులు వంచుకుని. మధ్య మధ్య కనులులేపి, మమ్మల్ని చూచి మళ్ళీ వంచేసుకుంటున్నాడు.

నిజంగానే, అదొక అసాధారణమైన పరిస్థితి ! ఒక ఎమ్‌టిఎస్ కార్యకర్తలు నలుగురు. ప్రముఖులు, ఒక చిన్నమ్మాయిమీద కత్తి గట్టారు. ఆ అమ్మాయిగూడా సామాన్యమైనది కాదు; కాలేజీనుంచి మంచి మంచి సర్టిఫికెట్లు సంపాయించి వచ్చింది. మీరే వూహించండి మరి, అదెంత అసాధారణ పరిస్థితో.

'ఖోరవటితే, యింకా రూఫెంకోయే పొంపడతాడు. సెర్గీసెర్గెయెవిచ్ అట్లాకాదు, ఆయన మాట్లాడుతుంటేనే, కాయ పగలగొట్టి పప్పు బయటికి తీస్తున్నాడనిపిస్తుంది. ఉఫ్ మంటూ పొల్లూ ఊకా వూదిపారేశి, తాలూతప్పా ఏరేశి అసలు సంగతి చెబుతూన్నట్టుంటుంది. అందుచేత, ఆయనమీదే ఆశగాపుండినాకు' అని చెప్పాడు ఫెద్యా నా చెవిలో.

సరే, ముందు మమ్మల్నే మాట్లాడమన్నారు. ఎమ్‌టిఎస్‌కి మానేజర్ని కాబట్టి నేనే ప్రారంభించాను ముందు. విషయాలన్నీ విపులీకరించి చెప్పాను. ఈ కొత్త గ్రామీణార్థికవేత్తతో కలిసి పనిచెయ్యడం కష్టంగా వుందంటూ మా చీఫ్ ఎంజినీరూ, ఇగ్నాత్ ఇగ్నతోవిచ్చీ వ్రాసి యిచ్చిన స్టేటుమెంట్లని వుదహరించాను. గత కొద్దిరోజుల్లోనే, ఆవిడ అప్పటికప్పుడే, క్రమశిక్షణకి లోబడకుండా ఎదురు తిరిగిన సంఘటనలు రెండుచెప్పాను.

మిగతావాళ్లుగూడా, ఎవరి సంగతులువారు, ఎవరి వుద్దేశాలువాళ్లు చెప్పారు. అందరిలోకీ ఫర్జనోవ్ మాట్లాడాడు ఎక్కువసేపు. లేచి, నోట్లోనుంచి పైప్‌తీసి, మాట్లాడ్డం మొదలెట్టాడు :

'సెర్జీ సెర్గెయెవిచ్! మీరిదివరకే యెరుగుదురు నన్ను గురించీ, నా పనిని గురించీనీ. ఇప్పుడు ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. ఈ వొక్కోడే కాదుగదా మీకు నేను సన్నిహితంగా వుంది. ఇంతకంటే పెద్ద పెద్ద బాధ్యత లెన్నిటినో నిర్వహించా నిదివరకు; అది మీకూ తెలుసు. నాకింద అనేకమంది, అనేక తరహాలవాళ్ళు పని జేశారు. వాళ్ళందరితోనూ పని చెయ్యగలిగానుకాని, యీ నాస్త్యాలో మట్టుకు పని జెయ్యడం నావల్ల గావడంలేదు! ఈ అమ్మాయికి అనుభవమూ లేదు, విజ్ఞానమూలేదు. తనకు తెలియదు; ఒకరు చెబితే వినదు. ఎలా ప్రవర్తించాలో తెలియదు; క్రమశిక్షణకా కట్టుబడదు. సరే, ఆవిడగారి పనినిగురించి వేరే చెప్పనవసరంలేదు. అంతా మనముందే వుంది; కన్పిస్తూనేవుంది; యంత్రాల్ని బాగుచెయ్యడంలో మా ఎమ్టియస్ ఎప్పుడూ ప్రథమంగా వుండేది. అలాంటి దిప్పుడు అందరికంటే వెనక బడిపోయింది. ఇదివరకెప్పుడూ పని అందరికంటే ముందు ప్రారంభించే వాళ్ళం; యీ సంవత్సరం మిగతా సమిష్టి క్షేత్రాల వాళ్ళందరూ పనులు ప్రారంభించి చేసేసుకుంటూంటే, మా యంత్రా లింకా వార్షానా గేటు కూడా దాటలేదు. ఈ నాస్త్యా పుణ్యమా అంటూ! రేపో, ఎల్లుండో విత్త నాలు జల్లబోతున్నాం. ఇంతవరకెప్పుడూ, అన్ని రంగాలలోనూ ప్రథమ స్థానం ఆక్రమించినవాళ్ళం; ఈ నాస్త్యా మా ఎమ్టియస్లోనే గనక వుండేట్లయితే, ఇక మేం తలెత్తుకునే పనిగూడా వుండదు; అందరికంటే వెనకబడిపోవటం మట్టుకు ఖాయం, ఇప్పుడే చెబుతున్నాను.'

కార్యదర్శులిద్దరూ మేం చెప్పిందంతా శ్రద్ధగా విన్నారు. కాని ఒక్కమాటగూడా అనలేదు. రూచెంకో కిటికీ కానుకుని నిలబడ్డాడు. సెర్జీసెర్గెయెవిచ్ లేచి, అటూయిటూ తిరుగుతున్నాడు. మలుపులు తిరిగే టప్పుడు ఏనుగెలావుంటుందీ అలావున్నాడాయన. ఆయన ముఖం చూచినా, ఏమనుకుంటుందీ తెలియడంలేదు. ఏమీ మాట్లాడకుండా, వూరికే అటూయిటూ తిరుగుతున్నాడు. ఆఫీసంతా నిశ్శబ్దంగావుంది. ఒక్కసారాగి మా అందరివంకాచూశాడు; ముహంలో యేదో కదలిక; కన్నుల్లో యేదో మెరుపు; పగలపడి నవ్వేద్దామను కుంటున్నాయా

అన్నట్టు కదిలినై పెదవులు. ప్రక్కకి తిరిగి రూఛెంకో వంక చూశాడు. రూఛెంకో కర్థమైనట్లుంది. ఆయన కున్నంత నిగ్రహం లేదేమో ఈయ నకి: ఈయన పెదవులు విడివడినై; ముక్కుపుటాలదేపనిగా అదరినై; ఇక నవ్వేస్తాడనిపించింది. అంతటితో ఆగి. వెంటనే ముక్కు చీదు కున్నాడు రూఛెంకో. సెర్జీసెర్గెయెవిచ్ కిటికీ వైపుకి తిప్పుకున్నాడు ముహం అంత నవ్వులాట కిక్కడేం జరిగిందబ్బా! అనుకున్నాన్నేను. మొత్తం దృశ్యం అంతా. దూరానున్నట్టుంచి చూశాను. ఒక గోడ ప్రక్కన నలుగురు ఆజానుబాహులు కూర్చుని. ఎదుటి గోడమూలవైపుకు చూస్తున్నారు అదేపనిగా. ఆ మూలనొక చిన్నమ్మాయి కూర్చునుంది తలవంచుకుని; వేళ్లు మడిచి కాళ్లు కుర్చీక్రింద లోపలికి ముడుచుకుని; తలమీద చిట్టిజడలు కన్పిస్తున్నై. ఆ ముఖంలో ఏమాత్రమైనా కోపం గాని. చిరాకుగాని కనిపించిందనా! ఏమీలేదు! ఆ ముహంలో వున్నంత విచారాన్ని ఇదివరకెప్పుడూ. ఎక్కడా చూడలేదు నేను.

అంత విచారంగావున్న ఆ చిన్నమ్మాయితో వేగలేక. నలుగు రాజానుబాహులు ఎమ్‌టియెస్‌నుంచి పారిపోవడానికి సిద్ధంగా వున్నారంటే నవ్వురాదూ మరి!

సంబంధం లేనట్టు, దూరంగా వుండి చూస్తే అంతేమరి: నవ్వొ స్తుంది. కాని. మరి మాకు సంబంధవుంది; ఎలా నవ్వగలం?

ఆ నవ్వు ఆగేవరకూ, సెర్జీసెర్గెయెవిచ్ అలాగే నిలబడున్నాడు కిటికీ దగ్గర; తర్వాత నాస్త్యా దగ్గరకెళ్లాడు.

'విన్నారుగా. అదీ పరిస్థితి.' అన్నాడు.

తల యింకాస్త క్రిందకొంచుకుంది నాస్త్యా. మాట్లాడలేదు

'నువ్వు మంచి శక్తిమంతురాలిగావున్నావు నలుగురు మగవాళ్లకి మంచి ఆరోగ్యవంతులైనవాళ్ళకి ప్రశాంతంగా వుండేవాళ్ళకి యింత కోపం తెప్పించగలిగావంటే. మంచి శక్తిమంతురాలివే అయ్యుండాలి నువ్వు. పరిస్థితులు విషమించినై. ఈ విత్తనాలు జల్లడం పూర్తికాగానే నిన్ను ఎమ్‌టియెస్ నుంచి బదిలీ చెయ్యక తప్పేట్టులేదు. సరేగాని,

పరిస్థితు లింత యిదిగా యెందుకు విషమించాయో, చెప్పొకసారి'
అనడిగాడు సెర్గీ సెర్గెయెవిచ్.

'నేను....నేను...నేనేమీ చెయ్యలేను—' అనిమాత్రం అన
గలిగింది నాస్త్యా, నట్లు గొడుతూ.

ఆవిడ ముందలాగే. ఆలోచిస్తూ నిలబడ్డాడు సెర్గీ సెర్గెయెవిచ్:
మళ్ళీ అనధికారమైన చిరునవ్వు తొణికిసలాడినట్టుంది ఆయన ముఖంలో.

'ఆ ఏమీచెయ్యక పోవడం అంటే యేమిటో వూహించుకోగలను
నేను.' అన్నాడాయన. తర్వాత, ఏమీ కోపంలేకుండానే, మంచిగా
మందలిస్తూన్నట్లు. 'అంతమందిలో నన్నావేళట్లా అన్నావే, అంత నేరా
రోపణ చేశావే నామీద, ఎంతలేదన్నా ప్రాంతీయ కార్యదర్శిని గదానేను.
మూడేళ్ళనుంచి వరసగా సమిష్టిక్షేత్రం రైతుల్ని మోసగించుతూ వచ్చా
నంటూ నన్నే అన్నావే. ఆవేళగూడా, ఏమీచెయ్యడం లేదనే అను
కున్నావా?' అన్నాడు.

నాస్త్యా మాట్లాడలేదు; మెదలకుండా కూర్చుంది. జవాబిస్తుందేమో
నని కాస్సేపు చూశాడాయన. లేదు. తర్వాత కాస్తగట్టిగా అన్నాడు.

'నేనునిన్ను చూచిందొక్కసారి; మాట్లాడిందీ ఒక్క పర్యాయమే
కాని ఈ కామ్రేడ్స్ నీతోకలిసి నెలలతరబడి పనిచెయ్యాలి. ఎమ్‌టియెస్‌లో
పరిస్థితేమిటో యిక్కడ కూర్చునే వూహించుకోగలను నేను: కాని
యిప్పుడందులో కెళ్ళడం లేదునేను. నువ్వు విధేయంగా వుండడంలేదని,
క్రమశిక్షణనిగూడా ఖాతరు చెయ్యకుండా ప్రవర్తిస్తున్నావనీ ఆరోపణ
చేస్తున్నారు ఈ కామ్రేడ్స్. మానేజరు ఆదేశాల్నిగూడా నువ్వు పాటిం
చడం లేదని చెబుతున్నారు. బహుశా, యీ కామ్రేడ్స్ పొరబడుతున్నా
రేమో, నువ్వలా చెయ్యడం లేదేమో?'

తల లేవకుండానే జవాబిచ్చింది నాస్త్యా:

'నేను...అలాగే చేస్తున్నాను.'

'సోవియెట్ పరిశ్రమల్లో ఒక మనిషి మానేజ్‌మెంటంటే ఏమిటో
తెలుసా?'

ఆవిడ జవాబు చెప్పలేదు.

జవాబు చెబుతుందేమోనని కాస్సేపాగాడు సెర్గీ సెర్గెయెవిచ్; ఇక ఆగడం అనవసరమని తేలిం తర్వాత,

'నేను పని చేసేప్పుడు, ఒక సూత్రం ప్రకారం చేస్తుంటాను. అదేదో చెబుతాను విను' అన్నాడు; 'నీకు తెలియకపోతే....మేం నేర్పుతాం! నువ్వు నేర్చుకోలేకపోతే ... సాయం జేస్తాం! నువ్వు నేర్చుకోవద్దనుకుంటే...నేర్చుకునేటట్టు చేస్తాం! అదీ సూత్రం. తెలిసిందికదూ? మరిప్పుడు చెప్పు, నీకు ఒక మనిషి మానేజ్‌మెంటంటే ఏమిటో తెలుసా, తెలియదా? క్రమశిక్షణనిగురించి తెలుసా, తెలియదా? నువ్వా క్రమశిక్షణకి లోబడి పని చెయ్యలేక పోవడానికి కారణాలేమైనా వున్నాయా? లేక, అసలు నీకా క్రమశిక్షణకి లోబడి పని జెయ్యడం అంటేనే యిష్టంలేదా? ఏమిటో చెప్పు.'

అప్పటికీ, నాస్త్యా వెంటనే జవాబు చెప్పలేదు; చివరి కెలాగో పెదవులు విప్పి.

'యంత్రాలు చాలా వున్నై...ఐనా, వాటికి తగినట్టు వుత్పత్తి జరగడంలేదు! ఉత్పత్తి పెరగడంలేదు. అందుకని నే నన్నాను...... నే ననుకున్నాను...వాళ్ళు నే చెప్పేది వినదలచుకోలేదు...' అని అంది.

అంతే. ఇక మాట్లాడలేకపోయింది; మాట్లాడలేదు. కలవరపడి పోయినట్టుంది; గందరగోళ పడిపోయినట్టుంది. నా కాశ్చర్యంవేసింది: ఏమి టీవిడ యిలా వూరుకుంది? తనని తను సమర్థించుకోదేం? కనీసం, తా ననుకున్నదేమిటో, తన వుద్దేశమేమిటో ప్రాంతీయ కమిటీ కార్యదర్శికైనా చెప్పి, మేం చేసిన నేరారోపణలు సరైనవి కాదనైనా అన దెందుకని? ట్రాక్టర్ డ్రైవర్లకి పాఠాలు చెప్పేప్పుడూ ఎరువు తీసుకెళ్లే లారీల పనిని సమన్వయం చేసేప్పుడూ, స్టెప్పీలో జొన్న కంకులు చేత బట్టుకుని తిరిగేప్పుడూ ..ఇలాగేవుందా యీవిడ? తన వుద్దేశం మంచిదని చెప్పేందు కావిడకుగూడా తగిన కారణా లెన్నో కొన్ని వున్నైగదా! అవైనా చెప్పదేం? విమర్శించదగిన పనులు మేమూ ఎన్నో కొన్ని చేసివుంటాంగదా! వాటి సంగతైనా ఎత్తదేం?

ఎందుకని యిలా మాటాడకుండా వూరుకుంది? సమచతురం మళ్ళ వ్యవసాయ పద్ధతిని సమర్థించేందుకు కత్తుల బోనులోకి దూకేందుకు గూడా సిద్ధమైందే! వెనకబడిన సమిష్టి క్షేత్రాల్ని, వెనకేసుకొచ్చి, ప్రాంతీయ కమిటీ కార్యదర్శని లక్ష్యంగూడా లేకుండా ఎన్నెన్ని మాట లన్నది? ఎన్నెన్ని అవాకులు చెవాకు లాడింది? ఇది వరకావిడ ఒక్కతే మాట్లాడితే పదిమంది పెట్టు!........ఇప్పు డావిడ సమర్థించుకో వలశిందిగూడా ఆ సమచతురం మళ్ళ పద్ధతినీగాదు; ఆవెనక బడిన సమిష్టి క్షేత్రాల్నికాదు. ఇప్పుడు సమర్థించుకోవలశింది తననితాను. మరీ పోట్లాటలో ఆరితేరిన ఘటం యిప్పుడు పెదవైనా కదపకుండా అలా బెల్లం కొట్టినరాయిలా కూర్చుంటుందే, నిస్సహాయంగా? ఇదేం మనిషి! ఇతరులకోసమేమో ఆడపులిలా పోట్లాడుతుందీ, తన సంగతి వచ్చేటప్పటికి మేకపిల్లయి పోతుందీ? ఏమిటీ విచిత్రం!

దీపాలతో కళకళలాడుతున్న గ్రామంవొకటి వెనక్కి దూసుకు పోయింది మా రైలు కిటికీ ప్రక్కనుంచి. ఆ వూరు పేరేదో తెలియదు మాకు. ఆ రాత్రిలాంటి గ్రామాలూ, పట్టణాలు యెన్నోదాటి ప్రయాణం చేశాం.

నాతోటి ప్రయాణీకుడు, ఛాలికోవ్, చేతిలో పైప్‌ని పూరికే అటూ యిటూ తిప్పుతూ కూర్చున్నాడు. కాస్సేపాగి, మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

ఇంకా నాకళ్ళకి కట్టినట్టు కన్పిస్తూనేవుంది నాస్త్యా అక్కడంత నిస్సహాయంగా, ఏమీ పాలుపోక కూర్చుని వుండడం. నిజమే నాస్త్యా తననితాను సమర్థించుకోలేదు. స్కూలు పిల్లలాగా, కూర్చుని, ఏదో

పాఠం విన్నట్టు విన్నది మేం చెప్పినవన్నీ: చివరికలాగే, స్కూలు పిల్ల లాగా, లేచివెళ్ళిపోయింది.

ఆవిడ వెళ్ళిపోయిం తర్వాత. మా వుత్సాహం రెండింతలైంది. నిజం చెప్పాలంటే. అంతరం ఒక పెద్దభారం తొలగిపోయినట్టు ఆనందించాం. ఒలోఛిఖినో గ్రామీణార్థికవేత్త. వీనాని మాకుపంపి. నాస్త్యా నక్కడికి పంపడానికి వీలుంటే పంపివచ్చన్నట్టు ఫెద్యా అన్నాడు గూడాను సూచనప్రాయంగా. న్యాయానకంతకు పూర్వమే. లీనా నెలా గోలా మా ఎమ్టియెస్‌కి తెచ్చుకోవాలనే ప్రయత్నం ప్రారంభించాం మేము.

కాని, సెర్గీ సెర్గెయెవిచ్ గదిలో అటూ యిటూ తిరుగుతూనే వున్నాడు యింకా. మే మడిగే ప్రశ్నలకి పరిధ్యానంగానూ, ముక్తసరి గానూ. ఒకటి రెండు మాటల్తో సమాధానం చెప్పి వూరుకుంటున్నాడు. తా మనుకున్న పని జరగకపోతేనో, తాము చేసినపని తమకే నచ్చక పోతేనో చిరాకు పడతారే, అలా చిరాకు పడుతున్నాడాయన. కాస్సేపు కుర్చీమీద కూర్చుంటాడు. మళ్ళీ లేస్తాడు. లేచి అటూ యిటూ తిరుగు తాడు. కిటికీదగ్గర కెళ్తాడు ; కిటికీ కమ్మిలమీద తాళంవేస్తూ నిలబడతాడు. కాస్సేపవీ యివీ మాట్లాడిం తర్వాత.

'నిజమే...తొందరపాటు...సహించగూడని ప్రవర్తన' అన్నా డాయన. మే మంతరం వులిక్కిపడి కూర్చున్నాం. ఆశ్చర్యపోయాం. మళ్ళీ నాస్త్యాని గురించా? 'కాని...ఆవిడ యిదంతా ఒక యుద్ధ రంగమని భావిస్తోంది. యుద్ధంలోఏదిమంచి ప్రవర్తన? ఏదికాదు? అనేప్రశ్నలకితావు లేదు ; దేనికోసం పోరాడుతున్నాం? అనేదే ప్రధాన ప్రశ్న' అంటూ రూఛెంకో వైపుకు తిరిగాడు సెర్గీ సెర్గెయెవిచ్ ; 'సందేహం కలిగి నప్పుడు, ఒక్కసారి ఏవైపున ఎవరు నిలబడ్డారనేది చూస్తే చాలు. ఒక్కోసారి. అది తెలుసుకుంటేచాలు. ఒక నిర్ణయానికి రాగలుగుతాం '

ఎమ్టియస్‌లో ఎవరెవరు ఆవిడపక్షన వున్నారో చూద్దామని. నాలో నేనే ఆలోచించుకున్నాను. గోషా ఆవిడ పక్షమే. కాని. స్త్రెంకా

వెంకాలావిడకి వ్యతిరేకపక్షం....అరెరె, వాళ్ళూ మేమూ ఒకపక్షమే నన్నమాట. విచిత్రంగావుందే!

ఈ లోపుగానే, సెర్గీ సెర్గెయెవిచ్ మళ్ళీ మాట్లాడడం మొదలెట్టాడు:

'మీ ఎమ్‌టియస్‌లో సమిష్టి క్షేత్రాల రైతులకీ, కార్మికులకీగూడా నాస్త్యా అంటే వ్యతిరేక తేమీలేదు; పైపెచ్చు బాగా యిష్టంగూడాను ఆవిడంటే. ఆవిడకి వాళ్ళతోగాని, వాళ్ళ కావిడతోగాని పేచీ ఏమీలేవు. ఆవిడ పోట్లాడుతున్నది మీతోమట్టుకే. ఆవిడికి మీలో ఎవరన్నా అయిష్టమేనా? లేక మీలోగూడా మళ్ళీ 'ప్రత్యేక విరోధి' అంటూ ఎవరైనా వున్నారా ఆవిడకి?'

ఆయనలాంటి ప్రశ్న వేస్తాడని వూహించలేదు మేం. ప్రశ్నవిని నివ్వెరపోయాం; వెంటనే సమాధానం చెప్పలేకపోయాం. ఫర్జనోవ్ తేరుకున్నాడు మాఅందరికంటే ముందు.

"నేనే ననుకుంటా ఆ 'ప్రత్యేక విరోధి' ని" అని అన్నాడు నవ్వుతూ.

ఫర్జనోవ్ వంక అలాగే కాస్సేపు సాలోచనగాచూశాడు ప్రాంతీయ కమిటీ కార్యదర్శి. ఎలుగుబంటి కళ్ళలాంటి ఆ చిన్ని చిన్ని కళ్ళతో గుచ్చిగుచ్చి చూస్తూ,

'ఐతే. మరిమీకు తెలుసుగదా ఆవిడ కోరికలు సమంజసమైనవే నని. ఒక దళంలో విత్తనాలు జల్లే యంత్రాలు సరిగ్గా బాగుచెయ్యలేదనీ. రోలర్స్‌లేవనీ, పోతబల్లలు చెడిపోయినయ్యనీ మీకు తెలుసుగదా?' అనడిగాడు సూటిగా.

అనుకున్నదెదురు తిరుగుతోందని గ్రహించాడు ఫర్జనోవ్; లేచి బల్లదగ్గరకెళ్ళాడు.

'కామ్రేడ్ సొకొలోవ్! రేపు మీతోపాటు నన్నుగూడా తీసుకెళ్ళండి. ఏ ఎమ్‌టియెస్‌లోనైనా సరే, ఏదో ఒక దళంలో ఏదోఒకటి చెడిపోయే వుంటుందనీ, ఎంతో కొంత లోపం వుండకుండా వుండదనీ రుజూచేసి మరి చూపిస్తాను. ఐనా అక్కడి

గ్రామీణార్థికవేత్తలు ఆ లోపాలనెత్తిచూపుతూ పైకమిటీలకి ఫిర్యాదులూ చెయ్యడం; ఆ దశాల నాపి పనికి అద్భుతగలదు. మా యిరుగుపొరుగు ఎమ్‌టియెస్ లకంటే మా ఎమ్‌టియెస్ చాలా మెరుగని రుజూచేసి మరీ చూపిస్తాను మీకు ! మా ఎమ్‌టియెస్ అన్నిటికంటే వెనకబడి వుందని అనుకోవడానికీ, మీరలా అనుకునేట్టు చేయడానికీ కారణం మా నాస్త్యా. మా గ్రామీణార్థికవేత్త !'

ఫర్జనోవ్ చెప్పేదంతా జాగ్రత్తగా విన్నాడు సొకొలోవ్ : రెండడుగు లటూ యిటూ వేసి, మళ్ళీ ఫర్జనోవ్ వైపుకు తిరిగి.

'సరే.... అదలా వుండనివ్వండి. మీ క్కావలసిందేమిటి ? సమిష్టి క్షేత్రా లెంత పండుతున్నాయనేగదా మీకు ముఖ్యం ? లేకపోతే మీ ఎమ్‌టియస్ ఎన్నో స్థానం సంపాదించుకున్నదనేదా ముఖ్యం ?' అనడిగాడు.

తర్వాత, ఫర్జనోవ్‌నీ, ఇగ్నాత్ ఇగ్నతోవిచ్‌నీ వెళ్ళమని చెప్పి ; ఫెద్యానీ నన్నూ వుండమని చెప్పాడు,

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయింతర్వాత, 'మీ ఎమ్‌టియెస్‌లో చాలా సహజమైన సాధారణమైన సూచనలూ, కోరికలూగూడా అసాధారణమైన పరిస్థితులకి కారణమౌతున్నాయని అర్థం గావడంలేదా మీకు ?' అనడిగాడు సొకొలోవ్, ఫెద్యాని. 'వెళ్ళండి. వెళ్ళి జాగ్రత్తగా ఆలోచించుకోండి. మీ చుట్టూ జరిగే సంగతుల్ని జాగ్రత్తగా పరిశీలించండి' అని అన్నాడు

అనుకున్నదంతా తల్లక్రిందులైందే అన్న నిరాశతో వెనక్కి తిరిగాం. ఫెద్యా మరీ దిగాలు పడిపోయాడు. సొకొలోవ్ తనని తప్పక సమర్థిస్తాడని అనుకున్నాడు ఫెద్యా ; ఎదురు తననే విమర్శించాడాయన.

ఇక ఫర్జనోవ్ సంగతి చెప్పేపనే లేదు. నాస్త్యా మీదాయ నెత్తిన ధ్వజం తునాతునకలైపోయింది. ఇట్లా గోటితో త్రుంచేసి నట్టొదిలించుకో వొచ్చుననుకున్నాడు నాస్త్యా పీడ. ఎమ్‌టియస్‌లో ఆవిడకున్న స్థానం అత ననూహించినదానికంటే బలవత్తరంగా వుందని తెలిసొచ్చింది !

ఒకనాటి సాయంత్రం, నా కింకా బాగా గుర్తుంది.

మా పనులన్నీ పూర్తైంతర్వాత, ఫర్జనోవ్ ఆఫీసులో కూర్చున్నాం మేమందరం. ఆయన ఆఫీసు నీటుగా శుభ్రంగా వుండేది. ఆ తెరలూ, సోఫా అవీనీ; అందుకని పనులు పూర్తికాగానే, తరచు, అక్కడికెళ్ళి కూర్చునే వాళ్ళం. ఎవరమూ ఏమంత చెప్పుకోతగినంత వుత్సాహంగా లేంగాని, నెమ్మదిగా ప్రశాంతంగా అందరికీ అవసరమైన విషయాన్ని గురించి మాట్లాడుకుంటూ కూర్చున్నాం; మా అదనపు పరికరాల్ని గురించి, కావలశినన్ని అదనపు పరికరాలు లేవుమాకు.

'ఛాఛ, నరకం అనుకోండి యిది' అన్నాడు ఫర్జనోవ్; 'ఊపూరు మూల వూళ్ళల్లో చివరికొక సామాన్యపు బేరింగ్ కూడా అపురూపమే నాయె. పట్టణంలో చక్కటి వుద్యోగం వొదిలి వచ్చా యిక్కడికి, చిన్న వుద్యోగమైనా ఫర్వాలేదులే, కావలశిన విశ్రాంతి తీసుకోవొచ్చుగదా అని. ఐనా, ఈ చిన్న వుద్యోగం కంటే, ఆ పెద్దవుద్యోగమే హాయనిపిస్తూంటే: ముక్కుమీది మొటిమ పిండాలన్నా అదొక పెద్దసమస్యైపొయ్యే యిక్కడ.'

'దేన్నిగురించీ మీరనేది ?' అనడిగా నేను,

'ఏమిటా ? అవిణ్ణి గురించే. మనగ్రామీణార్థికవేత్తగారిని గురించి. పెద్దపెద్ద కేంద్రాల్లో, ఎవరైనా డైరెక్టరాదేశాల్ని కాదని పనికడ్డుతగిలితే యింకేమైనావుందా ? కన్నుమూసి తెరిచేలోపల కనబడకుండా పోవాల్సిందే అక్కణ్ణుంచి ; కాని, ఇక్కడ..... ....'

'మరి మీరే వెళ్లారుగదా జిల్లా కమిటీ ఆఫీసుకి, స్వయంగా ?' అన్నాడు ఫెద్యా.

'వెళ్లాను; అసలు దెబ్బనాకే తగిలె అక్కడగూడ ; నాహోదాలో నేనంతకంటే పట్టుపట్టలేకపోయాను. నేనొచ్చేసింతర్వాత, ఆ అమీతుమీ యేమిటో మీరు తేల్చుకొస్తారుగదా అని ఆశపడ్డాను. కాని, మీరూ... ...మీరుగూడా, మీకున్న మూలధనమల్లా మీ వయసే......' అంటూ ఫెద్యా భుజంమీద చేయివేశి, తడుతూ, 'ఓ ఫెద్యా. ఫెద్యా......' అన్నాడు ఫర్జనోవ్.

ఇంతవరకెప్పుడూ, ఫర్జనోవ్ నాయకత్వాన్నే నడుస్తూ వచ్చాడు ఫెద్యా. కా నీసారి. భుజంమీదినుంచి ఫర్జనోవ్ చెయ్యితీసి.

'నే నొట్టి "ఓ ఫెద్యా" నే ఐతే, మీకంటె ముందే ఆవిడ పీడ వొదిలించుకునేవాణ్ణి. మిమ్మల్నొక్కళ్ళనేగాదు ఆవిడ విసిగిస్తూంది; నన్నూ యిబ్బంది పెడ్తూనేవుంది. ఐనా, "ఓ ఫెద్యా" నిమట్టుకే కాను నేను; కమ్యూనిస్టుని. యిక్కడ పార్టీకి పెద్దని. అంచేత ముందు వెనక లాలోచించాలి నేను; మంచీ చెడ్డా బేరీజు వేసుకోవాలి___'

కుర్చీలో మరింత సావకాశంగా కూర్చుని కాలుమీద కా లేసు కున్నాడు ఫర్జనోవ్ :

'ఔనౌను! కాదు మరీ! సరే. ఆ ముందు వెనక లేమిటో, ఆ మంచి చెడ్డల బేరీజు ఏమిటో చెప్పు కాస్త: చూద్దాం. చెప్పండి మరి; మేమూ వింటాం" అన్నాడు.

'ఆ. చెబుతాను వినండి. ఒక బోయిలర్ మూత వేసెయ్యండి. క్రింద మంటబెట్టి వేడి చెయ్యండి. కళా పెళా కాగుతుంది. బోయిలర్లో నీరు ఉడికిపోతుంది. ఆవిరి వొత్తిడి యెక్కువైపోయి తపామని బ్రద్దలౌతుంది. ఆ వొత్తిడెంత యెక్కువైతే అంత పెద్ద శబ్దమౌతుంది బ్రద్దలయ్యేప్పుడు; అంత ఎక్కువ కష్టమూ, నష్టమూనూ. అలాంటి పరిస్థితుల్లో ఎవరుమాత్రం యేం జెయ్యగలరు? వెనక్కి తగ్గుతారు; దూరంగా వెళ్ళిపోతారు. మీ రిందాకన్నట్టు, నేనుగూడా 'ఓ ఫెద్యా' నైతే. అందరిలాగానే చేసేవాణ్ణి నేనూనూ. కాని, యింకొక మార్గాంతరంగూడా వుంది. నీరలా కాగి ఉడికిపోతూన్న తీరునుబట్టీ ఆవిరిచేసే శబ్దాన్నిబట్టీ. బోయిలర్లో ఒక గొప్ప శక్తి బంధీకృతమై వుందనీ, అంత చిన్న చోటులో ఆ గొప్ప శక్తి నట్లా అణచిపెట్టడం సాధ్యంకాదనీ తెలుసు కోవాలి; గ్రహించాలి ఆ శక్తికి తగిన చోటు నిచ్చి, సరైన మార్గంలోకి మళ్ళించి. వాల్వులూ టర్బైన్లూ ఏర్పాటుచేస్తే. పర్వతాలని గూడా కదప గలుగుతుం దది!'

ఫర్జనోవ్ నవ్వాడు. కాని అతని కన్నుల్లో ఆ నవ్వు కన్పించలేదు; కోపమే కనిపించింది కొద్దిగా.

'ఓహోహో. మన ఫెద్యాగూడా ప్రారంభించాడు అలంకారాలూ. వుదాహరణలూ యివ్వడం !' అనన్నాడు.

ఫెవ్యాకు చుర్రుమన్నది కాని. పైకి కనబడనివ్వలేదు.

"తప్పేముంది. అవసరమైనప్పుడు అలంకారాలతోనూ మాట్లాడాని; ఉదాహరణలూయివ్వాలి." అని చెప్పాడు జవాబు; "మీ ట్రాక్టర్లు చెడిపోయి. వున్న అవకాశాలన్నీ వ్యర్థమైపోతూంటే మీకు మాత్రం కలగదూ చికాకు ? లేక, బహుశా మన యిరుగుపొరుగువాళ్ళతో పోల్చుకుని సంతృప్తిపడడమేనా ముఖ్యం ! వాళ్లూ మనకంటే ఏమీమెరుగుకాదు కాబట్టి. మనం విచారించవలసిన అవసరం వుండదనా ! ఏమిటి మీ వుద్దేశం. నన్నడిగితే చెబుతాను నా వుద్దేశం. నా పనంతా ప్రజల్తో. ఉన్న శక్తులన్నిటినీ సాధ్యమైనంత సద్వినియోగం చెయ్యడమూ, సాధ్యమైనన్ని సత్ఫలితాల్ని పొందడమూ నాకర్తవ్యం.'

మళ్లీ నవ్వాడు ఫర్టనోవ్,

'శక్తులా ! అంటే మన గ్రామీణార్థికవేత్త అనా మీ వుద్దేశం ? అది మరీకాస్త అతిలే; గోరంతలు కొండంతలు చెయ్యడం.'

ఇక సంభాషణలో నేను గూడా ప్రవేశించడం మంచిదనుకున్నాను నేను.

'ఇక చాల్లే సరిపెట్టండి' అన్నా నేను ;

'ఏమిటీ. యివ్వాళ మీ యిద్దరూ యిట్లాలంకించుకున్నారు ? నాస్తాస్యా పెట్టే కష్టాలు చాలవూ మనకి ? మనలో మనం గూడా పోట్లాడుకుంటే యిక అడగక్కర్లేదు. ఎమిటియస్ ఏమైపోతుంది !'

అప్పట్లో, ఆ సంభాషణ మార్చడాని కింకొకదారి కన్పించలేదు.

దాదాపు అరోజుల్లోనే నిర్మాణ వ్యవహారాల కని మాకు కొంత డబ్బు కేటాయించారు. తొందర్లో, ఆ డబ్బుతో, కార్ఖానాలు కట్టించేస్తే, ఆకురాలుకాలం వచ్చేప్పటికి మేమే మెఖానిక్స్‌లో పాఠాలు ప్రారంభించొచ్చునని అనుకున్నా నేను. కొత్త కార్ఖానాలందు నుపయోగిస్తాయని గూడా నిర్ణయం చేసేసుకున్నాను. ఒక్క దెబ్బకి రెండు పిట్టలు. కార్ఖా

నాలుగో కొత్త గదులూ తయారైపోతాయి; నేర్పరులైన పనివాళ్ళూ తయారై పోతారు.

అనుకున్నంత మాత్రాన ఐపోవుగదా పనులు. వేసిన పథకాలు అంగీకారం పొందాలి; భవన నిర్మాణానికి కావలసిన వస్తువులన్నీ సంపాదించాలి; నిర్మాణ దళం ఒకటి ఏర్పరచాలి! ఈ గొడవలోపడి మా గ్రామీణార్థికవేత్త సంగతే మరచిపోయాను నేను. నాకామాత్రం తీరుబాటు గూడాలేదు.

ఈ లోపలావిడా చేతులు ముడుచుక్కూర్చోలేదు. మాకింకొక కొత్త యిబ్బంది తెచ్చిపెట్టింది, తలవని తలంపుగా.

అక్రిందిపేడు మాది అనావృష్టి ప్రాంతం. అందుకని సమిష్టి క్షేత్రంలో పండిన గింజలు విత్తనాలకి తగినట్టులేవు. మా ధాన్యం తీసుకుని మాకు విత్తనాలిస్తామని చెప్పి వాగ్దానం చేశింది ప్రాతీయ కేంద్రం. ఆ విత్తనాలు రావడం ఆలస్యమైంది. అందుకని ఆవిడ రాగానే జిల్లాలో వాళ్ళంతా ఎగబడ్డారు మార్పిడి చేసుకోడానికి. నాస్త్యా పుణ్యమా అంటూ మేముగూడా ఎగబడి తీసుకోవడానికి వీల్లేకుండా పోయింది? మా విత్తనాలు మార్చడానికి ససేమిరా ఒప్పుకోనంది. ప్రాంతీయకేంద్రంనుంచి వచ్చిన విత్తనాలు దూరప్రాంతాలవి; అవియింకా స్త మెత్తబాదరకం, అతివృష్టికి అనావృష్టికీ ఆగలేవు.

'ఈ ప్రాంతాల్లో పండే గోధుమ చాలా మంచి గోధుమ!' అని చెప్పుకొచ్చింది నాస్త్యా 'ఏదైనా కాస్తో కూస్తో లోపం వుంటే అందుకు తగిన చర్యలు తీసుకుని, వాటినే విత్తనాలుగా వుపయోగించుకోవాలి' అంటూ పట్టుబట్టింది.

మిగతా వాళ్లంతా అప్పుడే విత్తనాలు జల్లడం గూడా ప్రారంభించేశారే, యికిప్పుడా చర్యలన్నీ తీసుకోవడమంటే ఎట్లా సాధ్యం? ఇంకో నాలుగైదు రోజుల్లో వాతావరణం మసుపెచ్చనౌతుందని వార్త వచ్చింది వాతావరణ పరీక్షా కేంద్రంనుంచి. కనీసం ఆనాటికైనా విత్తనాలు సంసిద్ధం గావాలి. ఈవిడగారు చెప్పే చర్యలన్నీ తీసుకునే

దెప్పుడు, విత్తనాలు సంసిద్ధం జేసేదెప్పుడు! విత్తనాలన్నిటినీ విభజించాలి, గాలితో వెచ్చజెయ్యాలి.

మాటలు కోటలు దాటితే ప్రయోజనం ఏముంది? కాలు గడప దాటాలి! అప్పుడుగదా. గాలితో వెచ్చజెయ్యడాని కావలసిన కానవాసే వుందనుకోండి; నే న్చెబితే నమ్ముతారో లేదోగాని ఆ కానవాసు మా జిల్లా మొత్తం మీదెక్కడాలేదు! అదీగాక నా గొడవలతో నేను సతమతమై పోతూంటిని. నా కార్ఖానాలు కట్టడానికి కావలసిన యిటుకలూ, ఇనుమూ, కలపసామానూ...!

'యంత్రాల వాగుచేతలోనే వెనకబడిపోయాం' అన్నాడు ఫర్దనోవ్ 'మా యంత్రాల సకాల్ని పంపడంలో గూడా అందరికన్నా వెనకబడిపోయాం. ఇకిప్పుడు విత్తనాలు జల్లడంలోగూడా వెనకబడి పోతాం. దీని కంతటికీ కారణం...ఆవిడ!'

ఎక్కడుండవలసిన దాన్నక్కడే వుంచేవాళ్లమే కాని నా వెనక ఫెద్యా ఒకటు పడ్డాడు; ఎప్పటికప్పుడు, 'మామూలు సూచనల్ని మామూలు పరిస్థితుల్లోనే ఆలోచించుదాం' అంటూ.

'అబ్బాయ్, నేనా అమ్మాయితో తాపీగా మాట్లాడలేను' అని చెప్పేశాను; 'మన విత్తనాల కార్యక్రమానికి గూడా ఆవిడ మొండి కాలడ్డం పెట్టబోతోందనే నా వుద్దేశం' అని అన్నాను.

'అలా కాదు. నువ్వు నెమ్మదిగా మాట్లాడి, వొప్పించాలి'

కాని ఇంకెక్కడి నెమ్మది!

'మరి మిగతా సమిష్టిక్షేత్రాల వాళ్లందరూ మారుమాటాడకుండా మార్పిడిచేసుకుంటున్నారే విత్తనాలు; ఎందుకని?' అనడిగాన్నేను నాస్త్యాని.

'అదే నాకూ అర్థంగావడంలేదు' అంది 'నాస్త్యా; 'రెండుమూడు శాతాలు తగ్గింది గదా అని యిక్కడి చక్కని విత్తనాలొదులుకుని, ఎక్కడినుంచో మారాన్నుంచి వచ్చిన మెత్తటి సరుకు విత్తనాలెందుకు పుచ్చుకుంటున్నారో అర్థంకావడంలేదు నాకూనూ' అంది.

'ఓ నాస్త్యా, ఆగేశింతర్వాత తేయాకు తెమ్మంటావెందుకు ? ముందే ఆలోచించుకోలేకపొయ్యావా ? సరిగ్గా గడువిక మూడురోజు లుందనగానా, నువ్వీ సూచనలన్నీ చేసేది ?'

'ఆ పొరపాటుకి బాధ్యత నేనే వహిస్తాను. నా పొరపాటుమూలాన జరిగే దుష్ఫలితాల్ని నేనే భరిస్తాను; అంతేగాని ఆ దుష్ఫలితాలని సమిష్టి క్షేత్రాలనుభవించడానికి వీల్లేదు. అదీగాక అక్కణ్ణుంచి వచ్చే విత్తనా లింత మెత్తగా వుంటాయని నేను మాత్రం ఏమైనా కలగన్నానా ?'

'మన విత్తనాలనింత స్వల్ప వ్యవధిలో తయారు చేయడం అసంభవం. అందుకు బాధ్యత నే వహించలేను' అని చెప్పేశాను.

'నేను వహిస్తానన్నానుగా ఆ బాధ్యత.' అన్నది నాస్త్యా.

'ఇది నా ఆజ్ఞ—'

'నే నా ఆజ్ఞని శిరసావహించలేను ; క్షమించాలి'

మళ్ళీ పొర లా ముందుకొచ్చిం దావిడ గడ్డం : పెదవులు కనబడకుండా మాయమైపోయినై.

'ప్రాంతీయ కమిటీ కార్యదర్శి నీకు చెప్పించంతా బూడిదలో పోసిన పన్నీరై పోయిందన్నమాట' అనన్నాడు ఫర్డనోవ్. నన్ను సమర్థిస్తూ ; 'ఇకైతే చాలా తీవ్రమైన చర్యలు తీసుకోక తప్పదన్న మాట మేం.'

'ఇకంతే. గత్యంతరంలేదు' అన్నాను నేను.

ఆవిడ వెళ్లిపోయింతర్వాత, ప్రాంతీయ కమిటీ కార్యదర్శి మాలో ఏమన్నదీ తెలియదావిడకి. ఆవిడకి క్రమశిక్షణని గురించి చెప్పావే ఆయన, అదొక్కటే యెరుగును ఆవిడ.

తెల్లబోయి, తలవంచుకుని, వెళ్లిపోయింది, ఆవిడ కర్థమయ్యేట్టు మాట్లాడామనీ, ఫర్వాలేదిక లొంగిపోతుందనీ భావించాం మేము కాని ఆ భావన పొరపాటని తరవాతగాని తెలియలేదు మాకు :

ఆవిడకి సంబంధించిన మూడు సమిష్టి క్షేత్రాలూ విత్తనాల మార్పిడికి నిరాకరించినాయనీ, తను దగ్గరున్న విత్తనాలనే బాగుచేసి ఉపయోగించ దలచుకున్నాయనీ, ఆ మర్నాడే తెలిసింది మాకు.

అంటే ఏమిటీ? ఆ మూడు సమిష్టి క్షేత్రాలల్లోనూ తనకున్న పలుకుబడి నుపయోగించుకుని, నా ఆదేశాల్ని తిరస్కరించేట్టు చేసిం దన్నమాట మళ్ళీనీ! అంతేకాదు; ఇంకొకటిగూడా వుంది; వెనకబడిన ఆ మూడు క్షేత్రాల్లోనూ అనుకున్ననాటికి విత్తనాలు జల్లడం ప్రారంభం గూడా కాదన్నమాట! అలా చెయ్యండిలా చెయ్యండని చెబితే చాలు. వున్న మూడురోజుల్లోనూ వాళ్లే అన్నీ చేసేస్తారని అనుకుని వుంటుంది. కాని ఆ సమిష్టి క్షేత్రాల సంగతి నాకు తెలుసు. నాకు వాళ్లతో అనుభవం గత సంవత్సరంనుంచే కాదుగా! ఆవిడిచ్చే సూచనల నర్థం చేసుకో డానికే చాలవు ఆ మూడురోజులూను. తర్వాత పని విభజన చేసుకుని, పని ప్రారంభించడాని కింకొక మూడురోజులు పడుతుంది. తర్వాత సమిష్టి క్షేత్రాల్లో ఏర్పడే లోపాలన్నిటినీ తొలగించుకోడాని కింకొక మూడురోజులు. ఇక జిల్లా కమిటీ ఆఫీసుకీ, ఎమ్టీయస్‌కీ పరుగెత్తడం ప్రారంభిస్తారు మా కవి కావాలి. యివి కావాలి అంటూ. అప్పటికి విత్తనాలు జల్లే కార్యక్రమం ముమ్మరంగా సాగుతుంది! ఇకప్పుడు విత్తనాలు మార్చుకోడానికి బయల్దేర్తారు. అక్కడున్న మంచి మంచి సరుకంతా మిగతావాళ్లందరూ యిదివరకే పట్టుకుపోయుంటారు. అందరూ పెద్దనుకుని వదలిపెట్టేళ్ళిపోయిన నాసిరకం విత్తనాలు మట్టుకు మిగిలుంటై. అంతే వీళ్ళు సాధించేదీ, సాధించగలిగే దీని! మా గ్రామీణార్థిక వేత్త మా పనులన్నీ పాడుచేసి వదలిపెడుతోంది.

జరగబోయేదంతా కళ్ళకుకట్టినట్టట్లా కనిపించింది. వెంటనే లేచి, ఆఫీసు మూసేసి, కారు తీసుకుని, మెడవిరిగే స్పీడుతో బయల్దే రెళ్లా సమిష్టిక్షేత్రాలకి.

అక్టోబర్ సమిష్టిక్షేత్రాని కివతల రోడ్డుమధ్యొక లారీనిలబడుంది. ఎంజన్ దగ్గరేదో టింగ్ టింగ్ మనిపిస్తున్నాడు డ్రైవర్; నాస్త్రా ప్రక్కనే ఒంటికాలుమీద కుందికుట్టు కుందుతున్నట్టుంది; చీలమండ బెణికన్నా వుండాలి; కాలికేదైనా దెబ్బన్నాతగిలుండాలి. కారాపి, క్రిందికి దిగాను నేను.

నా మొహంచూడగానే కనిపెట్టేసింది నాస్త్యా. ఈసారి నా ఆదేశాలని తిరస్కరించినందుకిక తనని నేను క్షమించనమంటూ వుండనే వుండదని.

నొప్పిపెట్టే కాలలాగే నేలమీదాన్ని, లారీ కమ్మి పట్టుకుని నావైపే చూస్తూ నిలబడింది నే దగ్గరకెళ్ళేవరకూ.

నేనూ దగ్గరకెళ్ళాను. అక్కడే, ఆ లారీ ప్రక్కనే స్లైప్పిలో వున్నదంతా వెళ్ళగక్కుతున్నాం.

'చూడు, నాస్త్యాస్యా, మానేజ రాదేశాల్ని తిరస్కరించా వనడానికి మూడో నిదర్శనం' అని అన్నానేన్నేను: 'అతిముఖ్యమైన బాధ్యతాయుతమైన కార్యక్రమంలో నా ఆజ్ఞల్ని నువ్విప్పటికి రెండుసార్లు తిరస్కరించావు; ఇది మూడోది. మేమందరం అనేకసార్లు మాట్లాడాం నీతో; అనేకసార్లు చెప్పిచూశాం. ఏంలాభం; ప్రయోజనం లేకపోయింది! ఒకసారి హెచ్చరించాను; ఐనా లక్ష్యంచెయ్యలేదు. రెండోసారి చీవాట్లు పెట్టాను; ఐనా ప్రయోజనం లేకపోయింది. ప్రాంతీయ కమిటీ కార్యదర్శిగూడా చెప్పిచూశాడునీకు. అప్పటికీ అర్థంచేసుకోలేక పోయావు. ఇంకా నేనేంచెయ్యగల్ను? ఇకొక్కటేమార్గం వుంది! అదికూడా చేసేదాకా వదిలేట్టులేవు నువ్వు.'

తలవంచుకుని, నొప్పిపెట్టే కాలు సంగతి గూడా మరచిపోయి. ఆ కాలుతోనే నేలని రాస్తూ, నేలవంకచూస్తూ ఉరుకుంది నాస్త్యా:

'మీ ఎమ్‌టియెస్‌లో మీతో కలిసి పనిజెయ్యడం అసంభవమని నాకూ తెలుసు. మీ పనులన్నీ పొరపాటుగా చేస్తున్నారు మీరు. అలా చెయ్యడం పొరపాటని మిమ్మల్నొప్పించలేకనూ పోతున్నాను; సరే లెమ్మని కనులు మూసుకుని కూర్చోనూ లేకపోతున్నాను. వెళ్ళిపోతాను. నన్ను తొలగించెయ్యండి. కాని, నే నెళ్ళేలోపుగానే యీ పిత్తనా లన్నిటినీ సంసిద్ధంజేసి, సమిష్టి క్షేత్రాల చేతుల్లో పెట్టి వెళ్ళిపోతాను' అని అంది.

నేనేమీ జవాబు చెప్పలేదు; చెప్పడానికి గాని, అనడానికి గాని ఋంకేమైనా వుంటేగా. కారెక్కి తిన్నగా సమిష్టిక్షేత్రం వైపుకు బయల్దేరాను.

అక్టోబర్ సమష్టిక్షేత్రం దగ్గరకెళ్ళేంతర్వాత; అక్కడి దృశ్యాన్ని చూచి ఆశ్చర్యపోయాన్నేను. జనం అంతా గుమికూడున్నారు. విత్తనాల నేరేవాళ్లు అదేపనిగా చేస్తున్నారు పని. స్త్రీలంతా గాదెల దగ్గర కూర్చుని, తలుపు చాపలన్నీ కలిపి కుడుతెన్నారు; టార్పాలిన్‌కి బదులా చాపలు పరుస్తారట విత్తనాల క్రింద. సమిష్టిక్షేత్రం అధ్యక్షుడూ, సిలాంతీ తాతా పనిజేస్తున్నారొక గాదె దగ్గర.

నా కాశ్చర్యం వేశింది. నా కళ్ళన్నేను నమ్మలేకపోయాను. చెప్పిన సమయానికి సమావేశం కావడం అంటూ ఎరుగరు ఆ సమిష్టి క్షేత్రాల వాళ్లు నాకు తెలిసినంతవరకు. అలాంటి దిప్పుడు. పన్నైం తర్వాత. చీకటిపడే ముందిక్కడ, యిట్లా సమావేశమై పనిజేస్తున్నారంటే ఆశ్చర్యంగాక మరేమిటి! జనం వంక చూపుతూ,

'అందరూ వచ్చారా?' అనడిగాను అధ్యక్షుణ్ణి!

'ఆ' అన్నాడు.

'ఏమిటి కథ?'

'ఏముందీ, విశ్వాసం; నమ్మకం' అని చెప్పాడతను; 'మా పథకం అంటే నమ్మకమూ విశ్వాసమూ కుదిరింది వాళ్ళకి. నాస్త్యా. నేనూ చెప్పిన మాటలంటే గురి కుదిరింది.'

నెమ్మదిగా, అధ్యక్షుడి తల్లి దగ్గరకెళ్ళా. ఆ సమిష్టిక్షేత్రంలోకల్లా పేచీలుపెట్టి గల్లంతుచేసే మనిషెవరంటే ముందావిణ్ణే చెప్పాలి.

'నువ్వూ వచ్చావా, యిక్కడికి?' అనడిగా.

'రాక!' అని అందావిడ; 'నాస్తాస్యా స్వయంగా మాయింటికొచ్చి పిలిచిందినన్ను. నేనంటే అంతగౌరవంపెట్టి, అట్టావచ్చి పిలిచినప్పుడు నేనుమట్టుకా అమ్మాయి మాటని నిలపొద్దా?' అనడిగింది నన్ను!

నిజంగానే ఆశ్చర్యం వేశిందినాకు!

తదీ మొదలూ ఆలోచించుకుంటూ నేనక్కడ నిలబడ్డానోలేదో, యింతలో నాకు దారిలో కనిపించిన లారీ వచ్చేసింది. లారీలోంచి నాస్త్యా బయటికొచ్చింది ఏంటుకుంటూ, ఆవిడ వెనకే ఇద్దరు లెఫ్టనెంటులు మూకాలు ఆకాశంమీదినుంచి వూడిపడ్డట్టు; దూకీమూకడంతోనే లారీ లోంచొక టార్పాలిన్ బయటికిలాగడం ప్రారంభించారు. ప్రక్కనేవున్న సైనికుల కాంపుకెళ్ళిందట నాస్త్యా; వెళ్ళి వాళ్ళనడిగి, మూడురోజులకని వాళ్ళ గుడారంగుడ్డ ఎరువు పట్టుకొచ్చిందట; తర్వాత తెలిసిందినాకు. ఆ టార్పాలిన్ గుడారం విత్తనాలమీదికప్పి గాలిలో వెచ్చజేయడానికట.

ఆశ్చర్యంగా చూశాను నాస్త్యావంక. హుషారుగా నవ్వుతూ పేలుతూ పనిజేస్తోంది ఆ యిద్దరు లెఫ్టనెంట్లతోనూ యితర యువజనులతోనూ కలిసి. ఇంతకుపూర్వం. కుంటికాలు నేలనిరాస్తూ తలవంచుకు నిలబడినమ్మాయి యీ అమ్మాయేనంటే ఎవరూ నమ్మరు. ఆ లెఫ్టనెంట్లలో ఒకతను గుమ్మటంలా, అందంగా వుండే అతను. గుడారం పరుస్తూ, నాస్త్యా వంక జూచి.

'కాలెలా వుంది? ఇంకా నొప్పెడుతోందా?' అనడుగుతున్నాడు.

వాళ్ళలా గుడారం పరుస్తూనే వున్నారు; చెవుల కమ్మలు పెట్టుకున్న యువతులు ముగ్గురొచ్చా రక్కడికి, ఆ లెఫ్టనెంట్లని చూచేందుకు వాళ్లే ఓలా కుటుంబం యువతులు.

'మీకు గుడారం వూరికే యిస్తున్నా మనుకునేరు; ధరావత్తేదైనా పెట్టాలి మీరు!' అనన్నాడు ఆ గుమ్మటంలాంటి లెఫ్టినెంట్ నవ్వుతూ.

'ఏం ధరావతు కావాలి మీకు?' అనడిగాడు అధ్యక్షుడు.

'ఓ, అలాంటిలాంటి ధరావతులైతే మా కక్కర్లేదు. అందులో ఒకమ్మాయిని తీసుకుపోతాం - మేం'

'అందులో ఏ అమ్మాయి కావాలంటారో, దాన్నిబట్టి వుంటుంది' అని నవ్వాడు అధ్యక్షుడు.

'మేం సైనికులం కాబట్టి. మాంచిపలుకుండి పోట్లాడగల అమ్మాయంటేనే యిష్టపడ్తాం మేం' అంటూ నాస్త్యా వంక చూశాడతను, సిగ్గు పడకుండా.

సమిష్టి క్షేత్రాల రైతులందరూ చిరునవ్వులు నవ్వారు. కల్లా కపటం లేకుండా. ఆ లెఫ్టనెంటలా ఆర్థికవేత్తని ఆరాధించటం చూచి ఆనందించారు అందరూనూ.

నాస్త్యాగూడా ఏమీ బిడియపడలేదు. తనూ నవ్వి. ఓల్గాలవంక చూపింది చేయి:

'వాళ్ళూ మంచి పలుకుండి పోట్లాడగల అమ్మాయిలంటే! పనిలో వాళ్ళకి పోటీచెయ్యగలవాళ్ళులేరు! మా సమిష్టిక్షేత్రాల్లో పనులెంత బాగా చెయ్యగలవాళ్ళున్నారో, వాళ్ళని చూస్తేచాలు మీకే తెలుస్తుంది. రండమ్మా. రండి! ఈ గోధుమసంచులు బయటికి తేవాలి, రండి!'

అంటూ గబగబా గాదులదగ్గరకెళ్ళింది నాస్త్యా; మొట్టమొదటి విత్తనాల బస్తా తనే ఎత్తుకుంది భుజాలమీదికి. ఇక ఓల్గాలుమాత్రం యేం జేస్తారు ఆవిడ వెనకే వెళ్ళవలసొచ్చింది; వెళ్ళారు. ఆ వెను కనే లెఫ్టినెంట్లూ. వాళ్ళ వెనక మిగతా వాళ్ళందరూనూ. బస్తాలన్నీ పట్టుకొచ్చి. టార్పాలిన్ మీద గుమ్మరించడం మొదలెట్టారు. అంతా నిమి షాలమీద జరిగిపోతోంది పని!

ఇకొపని అక్కడ కాపి, దిమ్మరించిన విత్తనాలు తిరిగి బస్తాల కెత్తి పట్టుకెళ్ళి జిల్లా కేంద్రం దగ్గర మారకం చేసుకుని పట్టుకు రమ్మందామని నోటి దాకా వచ్చింది; కాని అనలేకపోయాను.

లెఫ్టనెంటింకా చూస్తూనే వున్నాడు నాస్త్యా వంక. పనిజేస్తూనే హాస్యమాడుతున్నాడు ;

'ఈ విత్తనాలకి రాత్రిపూట కాపలా కాయాలిగదా. సైనికులం కాబట్టి ఆ పనిచెయ్యడానికి మేం సిద్ధంగానే వున్నాం. కాకపోతే మీ యువతుల్లో ఒకరు సాయంగా వుండాలి మాకు. ఎవరొస్తారు సాయం యీ రాత్రికి?' అనడిగాడు.

'ఎవళ్ళమో ఒకళ్ళం వస్తాం. మా అందరికీ తెలుసు కాపలా కాయడం. కాపలా కాస్తాం, ఆటలాడతాం. పాటలు పాడతాం. సాయంత్రం యిక్కడికొస్తే సరి. మీకే తెలుస్తుంది!' అంది నాస్త్యా. అతన్ని ఉత్సాహపరుస్తూ.

వంచిన నడుమెత్తకుండా పనిజేస్తున్నారు అందరూ. ఊరికే వాళ్ళని చూస్తూ నిలబడిపోయాను. యింకేం జెయ్యాలో తెలియక.

అట్లా కాస్సేపు నిలబడి, కారెక్కి యింటికి బయల్దేరాను.

ఆ వున్న మూడురోజుల గడువులోనూ వాళ్లు విత్తనాలు తప్పక తయారుచేసేస్తారు. సందేహం లేదు అని అనుకున్నాను దారిలో. సామాన్యంగా యిక్కడ జరిగే పద్ధతుల్ని బట్టి లెక్కలేసుకున్నాను ముందు. మీకూ తెలుసుగా ఆ పద్ధతులేమిటో. మేం వస్తాం. వచ్చి, అలాచెయ్యం యిలా చెయ్యండని చెప్పి వెళ్ళిపోతాం. నేను గాని, ఫర్డినోవ్‌గాని మా భుజాలమీద సంచులేసుకుని మోసేవాళ్ళమనుకుంటున్నారా? కల్ల! మా సూత్రాల ప్రకారం అలా చెయ్యగూడదు! అంతే.

కాని....నాస్త్యా? తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళనే మొండి ఘటం ముసలమ్మని మార్చేశింది; లెఫ్టనెంట్ నడిగి టార్పాలిన్ గుడారం బసులు తెచ్చింది; తానే, స్వయంగా విత్తనాలసంచీ భుజాలమీద కెత్తుకుంది! ఆవిళ్ళో గొప్పదనంకాని, బలంగాని యింకేమీలేదు. కాని ఆవిడ చేపట్టిన పద్ధతి, శిక్షణపొంది నేర్పు సంపాదించుకొని, డిగ్రీ పుచ్చుకొని వచ్చినవ్యక్తి! ఐనా కమ్యూనిస్టు యువజనసంఘ సామాన్య సభ్యురాలిలా పనిజేశింది. ఎమ్‌టియస్ మొత్తానికి ముఖ్యమైన గ్రామీణార్థికవేత్త: ఐనా విత్తనాలసంచీ భుజానమీద వేసుకుంది! అధికారంలోవున్న వ్యక్తి అలా చెయ్యగూడదు; అదీగాక పనిచేశేపద్ధతీ అదికాదు. ఐనప్పటికీ. ఆ 'సరిగాని పద్ధతి' మూలాన్నే. పదిరోజుల్లోగూడా పూర్తికాని పనిని. ఆ సమిష్టిక్షేత్రం ఒక్కరోజులో చేసెయ్యగలిగింది! ఇకావిడ గౌరవం సంగతా? ఆ సంగతావిడ పట్టించుకున్నట్టేలేదు. విత్తనాలు మూడు రోజుల్లో సంసిద్ధంకావాలి; అదొక్కటే ఆవిడపట్టు. కొన్నికొన్ని పరిస్థితుల్లో ఆవిడవలంబించిన పద్ధతులే సరైనవేమో బహుశ! ప్రతి సమిష్టి క్షేత్రానికీ పదిమందేశి అధ్యాపకులున్నారు. కాని. ఆవిడొక్కదానిపల్లా సమిష్టిక్షేత్రానికి కావలసిన విత్తనాలు అనుకున్న నాటికి తయారౌతాయి సందేహంలేదు. అలాంటావిడ్ని పట్టుకుని, నిన్ను పనిలోంచి తీశేస్తానని అన్నానేన్నేను! ఏమన్నా అర్థంవుంది?

ఎమ్. టి. యెస్. కొచ్చేశాను. మతిలో మతిలేదు నాకు, నాస్వాంత అక్కడే సమిష్టిక్షేత్రంలో వుండిపోయింది. నా కిక్కడ మనశ్శాంతి లేదు.

అదీగాక, ఆ వసంతంలో, వాతావరణంగూడా ఏమంత బావుండ లేదు; కాస్సేపెండ, కాస్సేపు గాలి, కాస్సేపు మంచు.... విత్తనాలెప్పుడో జల్లవలసింది; కాని జల్లలేదు. పగలల్లా ఎండగా వుండేది. రాత్రికి మంచుపడేది. రోజుకి రెండుసార్లు పరుగెత్తేవాణ్ణి పొలాల్లోకి, థర్మామీటర్ చేతబట్టుకుని. లాభం లేదు. గోధుమ విత్తనాలు జల్లేందుకు వీలు లేకపోయింది. పొద్దు తిరుగుడు విత్తనాలు ఫర్వాలేదు. మంచు తాకిడి కాగగలవు కాబట్టి అవిమట్టుకు చల్లాం. సమచతురం మళ్ళపద్ధతి బాగా పనికొచ్చింది; పని గూడా తేలిగ్గా పూర్తైపోయింది; ఆ పద్ధతివల్ల పని యెంత బాగా సాగిందీ అంటే, పత్రికా విలేఖరులు గూడా వచ్చారు గోషాతో మాట్లాడి విషయాలు సేకరించుకునేందుకు.

నా ఆఫీసులో కూర్చుని, ఒకనాటి సాయంకాలం, కాగితాలమీద సంతకాలుచేస్తున్నా నేను. ఉన్నట్టుండి, రేడియోలో నా పేరు వినిపించింది: 'ఎమ్ టి యెస్ మానేజర్ ఛాలికోవ్....' అని చెబుతోంది రేడియో. భలేగా వుందే! అనుకున్నా నేను. లేకపోతే యింకొక ఛాలికోవ్ ఎవడన్నా వున్నారా ఏదైనా ఎమ్ టి యెస్ కి మానేజరుగా? తర్వాత, గోషా పేరు గూడా వినిపించింది రేడియోలో. దేన్నిగురించో తెలుసా యింతకూ? సమచతురం మళ్ళ పద్ధతిని గురించి. ఇజ్వెస్తియా*లో పడిన ప్రత్యేక వ్యాసం అది. ఆ వ్యాసాన్నే రేడియోలో చదివి వినిపిస్తున్నారు. మా గోషా సోవియట్ యూనియన్ మొత్తానికే రికార్డుస్థాపించాడన్న మాట! మా ఎమ్ టి యస్ ని గురించి చెప్పి, వెనకబడిన ఎమ్ టి యస్ ల కన్నిటికీ మమ్మల్నాదర్శంగా చూపాడు విలేఖరావ్యాసంలో.

నేనొక్కణ్ణే ఒంటరిగా, ఆ రేడియో లౌడ్ స్పీకర్ క్రింద, నా పేరుపెట్టి, రేడియోప్రశంసిస్తూంటే వింటూ నిలబడ్డాను. సోవియట్

* సోవియట్ ప్రభుత్వ దినపత్రిక.

దేశమంతా వింటోందన్నమాట నాపేరూ, ఆ ప్రశంసా ం క్షణంలో ! ఆ ప్రసారంలో, మా ఎమ్ టి. యెస్ నీ గోషానీ, ఫర్జనోవ్నీ, నన్నూ ప్రశంసిస్తున్నారు. నిజం చెప్పాలంటే, అందుకు తగినకారణం కూడా వుంది. మిగతా ఎమ్. టి. యస్. లేవీ యింతవరకు విత్తనాల యంత్రాలన్నా సరిజేసుకోలేదు; అప్పుడే మేము విత్తనాలు జల్లడం ప్రారంభించేశాం. రోజురోజుకూ మా కోటాను మించిపోతున్నాం.

ఫర్జనోవ్ పరుగెత్తుకొచ్చాడు. తలంతా చెరిగిపోయింది. చేతిలో ఆరిపోయిన పైపుంది.

'విన్నావా ?' అంటూ వచ్చాడు; రేడియోలో మనని ప్రశంసిస్తున్నారు; దేశమంతా పాకిపోయిందా ప్రశంస ! ఈ సమచతురం మళ్ళ వద్ద ఇంత పేరు తెచ్చిపెడుతుందని యెవరనుకున్నారు గనుక ! కాకతాళీయంగా, మంచి పనే చేశాం మనం !"

మా వాళ్ళంతా సంతోషించి, ఉత్సాహంగావచ్చారు. మాకు అభివందనా లందజేయడానికి. ఒక క్షణంపాటు నివ్వెరపోయా న్నేను. వసంతకాలమంతా విమర్శ; ఇప్పు డిదీ !

ఆఫీసులో కెళ్ళి కూర్చున్నాను తాపీగా ఆలోచించుకుందామని. ఇంతలో జిల్లా కమిటీనుంచి రూఛేంకో ఫోన్ చేశాడు :

'విన్నారుగా ? బావుంది ! అభివందనాలు !'

'ఏదో, మా శాయశక్తులా చేస్తూనే వుంటాం; కామ్రేడ్ !' అన్నాను నేను.

కూర్చుని, 'ఇదేం జీవితమబ్బా !' అనుకున్నాను. జ్వరంకంటే ఘోరంగావుందే. సడీ చప్పుడూ లేకుండా యింత మార్పా ? నిన్న నేమో అంతా మామూలుగా వుంది; ఇవ్వాళప్పటికప్పుడే 104 డిగ్రీల జ్వరం వొచ్చేశింది ! నిన్నగాక మొన్న జిల్లా కమిటీ విమర్శించింది, ప్రాంతీయ పత్రికలో చీవాట్లుగూడా తగిలినై. ఇవ్వాళ అఖిల సోవియెట్ యూనియన్ రేడియో, దేశమంతటికీ, మమ్మల్నాదర్శంగా యెత్తిచూపుతోంది ! ఆశ్చర్యంగాదూ మది !

లీనాగూడా ఫోన్‌చేసి, అభివందనాలు తెలియజేశింది. అప్పుడే వరాండాలో విందుకి సన్నాహాలు చేస్తున్నారు, ఆ విందులో పాల్గొనాలని నన్నూ ఆహ్వానించారు.

కాని నేను నా ఆఫీసులోనే కూర్చునివున్నా ఆలోచించుకుంటూ. అందరూ సంతోషంగా ఆనందంగా వున్నారు. కాని, నాస్త్యా....గ్రామం పొలిమేరల బయట యెక్కడో, యీ వార్త సంగతేమీ తెలియక, కుంటి కాలితో కుంటుకుంటూ నడుస్తూంటుంది, రాజీనామాయివ్వడానికి సిద్ధమై.

ఆవిడ పేరైనా పేర్కొలేదు రేడియో. ఈ మధ్యనే చివాట్లు తిన్నట్టు అధికార పత్రాల్లో నమోదుకూడా అయివుంది కాబట్టి, ఆవిడ పేరు బయటపెట్టకుండా తగిన జాగ్రత్తలు తీసుకున్నాడు విలేఖరి. 'చాఛ! ఎంత ఛండాలపు పరిస్థితి!' అనుకున్నా నేను ఇంతలో ఫర్జనోవ్ వచ్చాడు విందుకు రమ్మనమని పిలవడానికి. వస్తాలే పదమని చెప్పి, ఎవరి కంటా బడకుండా నా దారిన నేను బయల్దేరా. నాస్త్యా వుండే వీధి వైపు తిరిగాను యింటిదగ్గరుండకపోతుందా అన్న ఆశకొద్దీ

అప్పటికే ప్రొద్దుకుంకుతోంది; స్టెప్పీ అంతా చల్లబడిపోయింది. పొలాలమీదనుంచి చల్లటిగాలి వీస్తోంది. నాస్త్యా యింటి గేటు ముందొక నీటిగుంటవుంది. ఆ గుంటలో నీరింకా గడ్డకట్టలేదు. ఇంటి కిటికీలోంచి వెలుతురు కనిపిస్తోంది. అంటే నాస్త్యా యింట్లోనే వున్నదన్నమాట. ఆ గుంటలో దిగి గేటుదాటి వెళ్ళడం ఎందుకు. కిటికీలోంచే పిలుద్దాం బయటికి రమ్మని అనుకుని కిటికీ దగ్గర కెళ్ళాను. లోప లేం చూశాననుకున్నారు? లోపల చలిపొయ్యిలో మంట లేస్తోంది. విచిత్రమైన దుస్తులేసుకుని ఒక చిన్నబల్లమీద కూర్చునుంది నాస్త్యా; కిటికీలోంచి చేయిచాస్తే చాలు అందేట్టుంది, ఒక కాలు లాగూ పైకి మడిచి, ఆ కాలు ముందున్న కొయ్య తొట్టిలో ముంచుతోంది; అదేదో స్వంత చికిత్సై వుండాలి. వెన్నపూశిన రొట్టెముక్కొకటి చేతిలోవుంది; ముందొక కుక్క కూర్చునుంది, చేతిలో ముక్క ఒక సారి కొరుక్కుని, మరికొంత ఆ కుక్కనోటి కందించుతూ కూర్చుంది నాస్త్యా. ఎందుకనోగాని చెంపలెంట కన్నీరు కారుతోంది. ఆ కన్నీరు

గూడా ఎలాంటి కన్నీరను కన్నారు? పెద్ద పెద్ద బరువైన బిందువులు. కనులనిండా నీరు కమ్మి. ఆ కనులార్పినప్పుడు, పెద్దపెద్ద బిందువులై బరువుగా చెంపలమీదినుంచి కిందికి జారుతున్నై. ముహంమట్టుకు నిశ్చలంగానే వుందిగాని, ఆవిడ వెక్కెక్కి ఏడుస్తూన్నప్పుడు పెదవులు వణకిపోతున్నై. కన్నీరు తుడుచుకొని, ఒక రొట్టెముక్క కొరుక్కొని, యింకో ముక్క కుక్కకి అందించి, మళ్ళీ వెక్కెక్కి ఏడుస్తోంది. ఆవిడ విచారం చూస్తే, ఓదార్చితే తగ్గే దుఃఖంలా కనిపించలేదు. మృదువుగా, సన్నగా వున్న ఆవిడ చేతులు; అలసిపోయినట్టున్న ఆ భుజాలు... చూస్తోంటే నాకేం జ్ఞప్తికొచ్చిందో తెలుసా మీకు? మీరు మాస్కోలో వుండేవాళ్ళు కాబట్టి, అనేక చిత్రాతిచిత్రాలు చూస్తుంటారు కాబట్టి, నే న్చెప్పేది వింటే నవ్వొచ్చినా రావచ్చు మీకు. కాని, నేను ఈ ప్రాంతం వొదిలి రావడాని కిది రెండోసారి. ఇంతకుపూర్వం, నేను విద్యార్థిగా వున్నప్పుడు, ఒక్కసారి, ఇటు మాస్కో లెనిన్‌గ్రాడ్ నగరాలు చూచేందు కొచ్చాను. వొచ్చిం దొక్కసారే ఐనా, నాతోటి వాళ్ళందరితోనూ ఆ ప్రయాణాన్ని గురించి కనీసం వొక వెయ్యి సార్లన్నా చెప్పివుంటాను. అప్పుడు మేం తిరిగింది నాలుగువారాలపాటే ఐనా, తర్వాత చాలాకాలంవరకూ, ఏ రోజున ఏది చూచిందీ ఏమిచేసిందీ అంతా బాగా గుర్తుంది నాకు. ఆ పర్యటనలోనే, పట్నాల దగ్గరొక శిలా ప్రతిమని చూచాను. దానిపేరు 'నమ్రత'. మీరూ చూశారా? చూచినా గుర్తుండదు మీకు; అలాంటివనేకం చూచుంటారు. నాకు మాత్రం యిప్పటికీ బాగా గుర్తు. అది ఒక బాలిక ప్రతిమ: తలవంచుకుని, చేతులు ముడుచుకుని, వళ్ళో పెట్టుకుని వుంటుందా బాలిక. ఆ ప్రతిమ ముహంవంక గూడా చూడలేదు నేను మొదట; నేను చూచిందల్లా ఆవిడ భుజాల్లో కలిసిపోతున్న మెడమాత్రమే! ఐనా, ఆ క్షణంలోనే అంతా అర్థమైపోయి నట్లనిపించిందినాకు! ఆ బాలిక చాల మంచిది. సరళ, అణకువగలపిల్ల. తన కాశ్రయం యిమ్మనీ సహాయం చెయ్యమనీ పిలుస్తోందనిపించింది. కావడానికదొక శిలాప్రతిమ; కాని రాతికి ప్రాణం పోసినట్టుంది ఆ ప్రతిమని చూస్తూంటే. రాతితో చేసిన భుజాలూ, రాతితోచేసిన మెడా యిన్నిన్ని భావాల్ని వ్యక్తం చెయ్యడంచూచి

విస్తుపోయాను నేను! నా జీవితంలో మరచిపోలేను నేనా ప్రతిమని, 'నమ్రత'. మా నాస్త్యాకా పేరు తగిపోతుందని కలలోగూడా వూహించలేదు ఎవరూ.

అప్పుడు ఛాలికోవ్ ముహంమీద జారిన ఆ చిరునవ్వుని చూడవలశిందే కాని, వర్ణించి చెప్పలేం. అదొక ప్రత్యేకమైన చిరునవ్వుని యిదివరకే చెప్పానుగదూ: ఇప్పుడా చిరునవ్వుతో చిరకాల పరిచయమైపోయింది నాకు. అలా ఆ చిరునవ్వును చిందించి మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు :

నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నాస్త్యావంక అలాగే చూస్తూ నిలబడిపోయాను. ఆ తొట్టెముందట్లా తల వంచుకుని, కన్నీరొడుతూ.... అంతకుపూర్వం యెప్పుడూ ఆవిణ్ణలా చూడలేదు. ఈవిడేనా నే నెరిగిన నాస్త్యా? వెంటనే వెళ్ళి ఆవిడతో మాట్లాడేయ్యా లనిపించింది. పరుగెత్తుకెళ్ళాను. చీలమండల లోతున్న గుంటనీటిలో బడి, గేటు దాటి. వెళ్ళి తలుపు తట్టాను.

వచ్చి, తలుపు తెరచింది, కన్నీటి చారికలు లేవు; ఇందాకటి విచార భావమూ అదృశ్యమైపోయింది. లెక్కలేనట్టుగా, ఏమీ పట్టనట్టుగా చూచింది నావంక.

మంచి చెడ్డా ఏమీ మాట్లాడకుండానే, 'ఎందుకొచ్చా రిక్కడికి, అలెగ్జీ ఛాలికోవ్?" అనడిగి వూరుకుంది, ముక్తసరిగా.

ఒక నిమిషం క్రిందట వున్నట్టు విచారంగా, కన్నీరు కారుస్తూ వుంటే, ఏం చేశేవాణ్ణో తెలియదు కాని, ఆ చూపూ, ఆ మాటలూ వినే

ప్పటికి నాకేమీ పాలుపోలేదు. ఏమనాలో, ఎలా అనాలోగూడా అర్థం కాలేదు !

అందుకని నేనుగూడా, నిరార్ద్రంగా, అధికారపూర్వకమైన గొంతుపెట్టి,

'నాస్త్రాస్యావాసిల్యెవ్నా ! నీకొక కబురు చెబుదామని వచ్చాను' అని అన్నా: 'మన ఎమ్‌టియెస్‌ని ప్రశంసిస్తూ ఇజ్వెస్తియాలో పడిన వ్యాసాన్ని అఖిల సోవియెట్ రేడియో ప్రసారంచేసింది. అందులో ప్రత్యేకించి గోషానీ, సమచతురం మళ్ల పద్ధతినీ ప్రశంసించారు...'

ఆ కబురువిని ఆనందపడి పోతుందనుకున్నా నేను. కాని, ఆ వార్తవిని ఆవిడేమీ అబ్బురపడినట్టు కన్పించలేదు; కాకపోతే ముహంలో మరింత ప్రశాంతత కనిపించింది. ఐనా ఆవిడ గొంతులో మార్పేమీ కన్పించలేదు; మొదటిలాగా వుదాసీనంగానే వుంది :

'మనం ఆ సమచతురం మళ్ల పద్ధతిని అనుభవజ్ఞుల సూచనల ప్రకారమే చేశాం. ఐనా, గోషా మట్టుకు నిజంగానే, అద్భుతంగా చేశాడు పని ! ఆయనపేరు రేడియోలో పేర్కొనడం సముచితం గూడాను; అలా పేర్కొవడం నాకూ సంతోషంగానే వుంది' అని అంది.

ఆ నాలుగు మాటలూ అని, యిక నా వంక గూడా చూడకుండా తన పని తాను చేసుకోవడం ప్రారంభించింది. అంతటితో తిరిగొచ్చెయ్య వలసిందే నేను; కాని అక్కడే బల్లమీద కూర్చుండిపోయాను, అంటుకు పోయినట్టు. అలాగే, అదేపనిగా, ఆవిడవంకే చూస్తూ కూర్చుండి పోయాను. ఇంతవర కెప్పుడూ చూడనట్టూ, చూడడానికిదే ప్రథమం అన్నట్టూ చూస్తూ వుండిపోయాను ; నాస్త్యా ముహం చాలా చిన్నది; కరకుగా వుంటుంది, చెంపలూ, గడ్డమూ గూడా గడసరిగా వున్నై. నిర్మలంగా వుండే ఆ నీలి కనులు; చిన్నపిల్లలా ఆ నోరూ, ముక్కూ; ఆ ముహంలో గూడా యేదో గడసరితనం, ఏదో సౌమ్య స్వభావం, ఏదో హుషారు, ఏదో ఆలోచన....ఇంకెన్నో భావాల, గుణాల ప్రతి బింబం ఆ ముహం ! ఎలా వర్ణించి చెప్పేది ! కట్టుకున్న దుస్తులు గూడా ఎంతో అందంగా వున్నై. ఆ దుస్తుల్లో ఆవిణ్ణి చూస్తూంటే

కాజక్ కన్యనీ, ఉజ్బెక్ కన్యనీ తాతార్ కన్యనీ చూస్తూన్నట్లనిపించింది. ఆవిడ అవయవాల కదలిక, నర్తకి నర్తనలా వుంది.

తొట్టె తీసుకుని బయటి కెళ్ళింది. అప్పుడావిణ్ణిచూస్తే. ఏదో వొకటి మాట్లాడాలనిపించింది. కాని ఏం మాట్లాడాలో తోచలేదు. చివరికి తెలివితక్కువగా.

'మీరేసుకున్న ఆ దుస్తులు చాలా బాగున్నై; మీకు సరిపోయి నట్టున్నై; అని అనన్నా.

ప్రక్కనే కుర్చీమీదున్న గుడ్డొకటితీసి, నా ముహం మీదికి విసిరి, 'ఇది మీకింకా బాగా సరిపోతుంది అంది.

'ఏమిటిది ?'

'ఏమిటా, నా గౌను ! మీరే తీసుకోండది. మీ దగ్గరే వుంచు కోండి. మీ రేసుకున్న పంట్లాంలకంటే. యిదే బాగా సరిపోతుంది మీకు. మగవాడిలాగా పని జెయ్యడమే చేతకాదు మీకు.'

లాగి చెప్పుమీద కొట్టినట్లయింది నాకు, ఇకలేచి వెళ్ళిపోదామని పించింది. కాని, లేవనూలేదు: వెళ్ళిపోనూలేదు.

ఇంతలో గోషా, కోస్త్యా వచ్చారు లోపలికి, తలుపు తెరచుకుని గోషా నూటికి నూరు పాళ్ళ సైబీరియన్ లాగుంటాడు; ఆ వెడల్పాటి ముహమూ, కొట్టొచ్చినట్టుండే ఆ నుదురూనూ; ముదురు రంగు, లేత బూడిద రంగు కనులు. వచ్చి ఏమని సంభాషణ ప్రారంభించాలో. ఎక్కడ కూర్చోవాలో, ఏమీ తోచినట్టు లేదతనికి. కోస్త్యా మట్టుకెలాగో ధైర్యం కూడదీసుకుని.

"మన గోషా పేరిప్పుడు దేశం నాలుగుమూలలా పాకిపోయింది ! నువ్వు విన్నావా ? ఇటొకసారి చూడు !' అన్నాడు.

గోషాదగ్గర కెళ్ళి, కౌగలించుకుంది నాస్త్యా; ఆవిడ నుదు రతని చెంపని తాకుతోంది.

'ఏం గోషా ! సంతోషంగా లేదూ ?' అనడిగింది.

గోషా చిరునవ్వు నవ్వాడు.

'అంతా గొడవ గొడవగావుంది నాకు. ఏమిటిదంతా నన్ను గురించి తిగొడవేమిటో అర్థం కావటంలేదు' అన్నాడు నెమ్మదిగా. అసలావాళ్టి గౌరవం అంతా తనదే నన్నట్టుబిర్రబిగిసిపోతున్నాడు కోస్ట్యా :

'గోషాని గురించిమాస్కో రేడియోలో వినీవినడంతోనే పరుగెత్తాను గోషా ఎక్కడుంటాడో చూచి యీ వార్త చెబుదామని. చూస్తే ట్రాక్టర్ ఆగిపోయుంది; అలాంటప్పుడు ఇకీయనగారు అగ్గిమీద గుగ్గిలంలా గుంటాడు మీకూతెలుసుగా. ఐనాసరేనని, దగ్గరికెళ్ళి, నువ్వు చాలా గొప్పవాడివయ్యా ! నీ పేరు మాస్కో రేడియోలో మారుమోగిపోతోంది అని చెప్పా. ఒకేపున యీ పాడు ట్రాక్టరాగిపోయినే నేదుస్తూంటే మధ్య నీమెక పక్కా లెందుకులే అన్నాడు. అని గబగబా ట్రాక్టర్ కిందకి దూరాడు. నేనేంజేస్తానిక ? ఏమిటయ్యా ఆ పని ? దేశమంతా నీ పేరు రేడియోలో మారు మోగుతోందని చెప్పడంలా నేను ? రావయ్యా యివతలికి అంటూ కాళ్ళు పట్టుకు లాగబోయాను బయటికి. ఆఁ ఆఁ వస్తున్నా ఆగు యీ రెంచ్‌తో నీ తల పగలగొడితేగాని నీ ఆటలు మానవు అంటూ రెంచ్ చూపించాడు నాకు !' అని చెప్పుకొచ్చాపు కోస్ట్యా.

అందరూ పగలబడి నవ్వారు,

'మరి నాకేం తెలుసు ?' అని గొణిగాడు గోషా; 'వీళ్ళందరూ కలిసి నన్నెద్దేవ చేస్తున్నా రనుకున్నా.'

'కాని గోషా ! నీకు తెలుసో తెలియదోగాని, నేను మొదట్నుంచీ అనుకుంటూనే వున్నా' అంది నాస్త్యా.

'ఏమని ?'

'నీ సంగతే. నీ పేరు పత్రికల్లో పడుతుందనీ, రేడియోలో....'

'నా కసలు సంగతి తెలియగానే బయల్దేరి వొచ్చేశా మీ యింటికి.'

ఇంతలో, ఒక కుర్రాడు పరుగెత్తుకొచ్చాడు లోపలికి. ఇదివర కెప్పుడూ చూచెరుగను అతన్ని. సమిష్టిక్షేత్రంలో ఎవరో రైతు బిడ్డయి వుంటాడు బహుశా. వచ్చీ రావడంతోనే ఎవరివంకా చూడకుండా,

ఎవరినీ యేమీ పలకరించకుండా సరాసరి, మూలనున్న ఫుట్ బాల్‌ల దగ్గరి కెళ్లాడు; 'ఇడిగో ఫుట్బాల్లిక్కడున్నై!' అంటూ.

'యూరా! ఇంట్లోకి రాగానే, ముందక్కడున్నవాళ్ళని పలకరించొద్దూ, తప్పుగదూ;' అన్నది నాస్త్యా.

'అదికాదు నాస్తాస్యా. మాటీముకి నేనిప్పుడు సెంటర్ ఫార్వర్డ్‌ని' అన్నాడా కుర్రాడు.

'ఓహో! సెంటర్ ఫార్వర్డ్‌వే! ఐతే, పలకరించక పోయినా ఫర్వాలేదనుకుంటా; కాదూ, అంటూ నవ్వింది.

'కాపాకుపట్టుకు పదిగజాల దూరంలోనే తలవంచి నమస్కరిస్తాడు' అన్నాడు గోషా; 'ఒకసారి మామ్మగూడా అడిగింది ఎందుకురా అలా గూనివాడికిమల్లే వొంగి పోతావూ అని :'

యూరా అడ్డొచ్చాడు :

'నేను కాపాని చూచి నమస్కారం చేశేది అడపిల్లని గాదు; ఆ నమస్కారం కళకి, మాస్కో ఆర్ట్ థియేటర్‌లో నటి కాకపోతే అడగంది మా కాపా!'

'ఐతే, విజ్ఞానశాస్త్రం పేరిట మన నాస్తాస్యాకిమాత్రంనమస్కారం చేయొద్దూ నువ్వు!' అని విసిరాడు గోషా.

క్రీగంట నాస్త్యావంక చూచాడు యూరా :

'నాకు విజ్ఞానశాస్త్రంకంటే, కళంటేనే యెక్కువ యిష్టం అనుకోండి. ఐనా నాస్తాస్యాకి 3॥ గజాల దూరంలో వుండిగూడా నమస్కారం చేస్తా. ఎందుకనంటే, విజ్ఞానశాస్త్రానికి పది గజాలు; యువజన సంఘంలో అందరికంటే మంచి సభ్యురాలై నందుకు యింకొక పది గజాలు; మరి మూడో పది గజాలూ....ఆ పది గజాలూ మా మంచి నాస్తాస్యా వాసిల్యెవ్నా ఐనందుకు!'

అందరూ నవ్వుతూ పేలుతూ కూర్చున్నారు. నాస్త్యా వెళ్లి టీ తీసుకొొచ్చి టేబుల్‌మీద పెట్టింది; సాసర్లూ కప్పులూ తీసుకొొచ్చింది, అందరూ కూర్చుని సమచతురం మళ్ల పద్ధతిని గురించీ, ఒక నాటకం

గురించీ. యువజన సంఘం నిర్మించదలచుకున్న స్టేడియమ్‌ని గురించీ మాట్లాడుకోడం ప్రారంభించారు. నన్నుగూడా సంభాషణలోకి దింపాలని చూచారు కోస్త్యాఁ. గోషానూ; కాని నామనసక్కడలేదు; ఆ నాటకానికీ స్టేడియమ్‌కీ చాలాదూరంగావుంది. అదీకాక, అప్పుడు మాట్లాడే ధోరణిలో గూడా నేనులేను. ఊరికే వింటూ కూర్చున్నా.

'బహుశా రేపో అక్టోబర్ సమిష్టి క్షేత్రాని కొచ్చి ఆ విత్తనాల పని పూర్తిచెయ్యలేననుకుంటూ' అంది నాస్త్యా విచారంగా; 'రోడ్డంతా బురదబురదగా వుంది. ఎట్లా లేచినా కనీసం ఒక మైలైనా నడవాలి సుంటుంది; నా కాలు మరీ నొప్పిగా వుంది.'

'స్ట్రెచర్ మీద పండుకోబెట్టి తీసికెళ్తాం' అన్నాడు కోస్త్యా.

ఇంతలో గోషా లేచి, ఆవిడ కూర్చున్నపళాన్నే కుర్చీ యెత్తి.

'మళ్ళీ స్ట్రెచర్ గూడా యెందుకు ? ఇలాగే భుజాలమీద పెట్టుకు తీసుకెళ్తాం' అన్నాడు.

నిజంగా అంత పనీ చేసేట్టేవున్నారు వాళ్ళని చూస్తే.

'నిజమే. ఇట్లాగే మోసుకెళ్తాం. మీరు లేకుండా పనెట్లా జరుగుతుందీ అక్కడ ?' అన్నాడు కోస్త్యా.

ఇంతలో ఆవిడ ముహంలో ఏదో విచారం కనిపించింది :

'నిజమే మరి. నేనూ మిమ్మల్నొదిలి వుండలేను. మీరు లేకుండా ఎలా వుండడమో వూహించుకోలేకపోతున్నాను గూడా.'

'అదేమిటి ? ఆ సంగ తెందుకూ యిప్పుడు ? అట్లా వూహించుకోవలసిన అవసరం ఏమొచ్చింది ?' అన్నాడు గోషా ఆశ్చర్యపోతూ.

అతనికేమీ జవాబుచెప్పలేదు నాస్త్యా; నావంక కొరకొరా చూచింది; అంతే మళ్ళీ మాటల్లోనూ నవ్వుల్లోనూ మునిగిపోయారు వాళ్లు.

అక్కణ్నుంచి ఎప్పుడో లేచెళ్ళిపోవలసింది నేను. కాని ఎందుకనో అలాగే కూర్చుండిపోయాను.

వాళ్ళ మాటలూ. నవ్వులూ చూచి, మేం హుషారుగావున్న రోజుల్తో పోల్చిచూచుకున్నాను లోపల్లోపల. నేనూ, ఫర్జనోవ్, లీనా కలిసి అనేక సార్లు కూర్చున్నాం విశ్రాంతి సమయాల్లో నవ్వుతూ పేలుతూ. కాని దానికీ దీనికీ పోలికేలేదు. ప్రేమని గురించీ. యువతీ యువకుల సంబంధాల్నిగురించీ. ఒకళ్ళ కొకళ్ళం హావభావాలు ప్రదర్శిస్తూ కూర్చునేవాళ్ళం. ఇక్కడదేమీలేదు. నిర్మలమైన యువతీ యువకుల హృదయాలు, కల్లా కపటం ఎరగని మనసులు హుషారుగా కేరింతలు కొడుతున్నట్లున్నై. నేనుగూడా, కాస్సేపీ మానేజర్ పదవిమాటా అధికారం సంగతీ మరచిపోయి, వెళ్ళి ఫుట్బాలాడాలనిపించింది. నాటకంలో వేషం వెయ్యాలనిపించింది. స్టేడియమ్ నిర్మాణంలో చేయూత యివ్వాలనిపించింది. కాని, నాస్త్యా....అంతవరకు ఎంత హుషారుగా వున్నా సరే. మా యిద్దరి కళ్ళూ కలుసుకుంటే చాలు. నవ్వడం ఆపేసి, ముఖం తిప్పేసుకుంటోంది; తానంత నిర్మలంగా మనస్సు విప్పి హుషారుగా వుండగలదని నేను చూడటం యిష్టం లేనట్టు. చివరి కెలాగో, పట్టబలవంతాన లేచి. వెళ్తొస్తానని చెప్పా. నే వెళ్ళిపోగానే తలుపేసుకునేందుకు గాను, నా వెనకనే వచ్చింది నాస్త్యా హాల్లోకి.

ఆవిడ చేతులు నా చేతుల్లోకి తీసుకుని, నా ముందు సందేహించవలసిన పని లేదనీ; తొట్టెముందు కూర్చుని ఏడ్చిన దృశ్యాన్నిగాని, గోషా కోస్త్యాలతో హుషారుగా నవ్వుతూ పేలుతూ మాట్లాడిన దృశ్యాన్నిగాని నా కనుమరుగు చేయవలసిన అవసరం లేదనీ, నువ్వలా బాలికలా వుండటమే నాకూ యిష్టమనీ... చెప్పాలనిపించింది. కాని అప్పటికప్పుడే. గదతీసి తలుపు బార్లా తెరిచింది నాస్త్యా: 'వెళ్తున్నారా లేదా?' అని అడుగు తున్నట్టు.

నేను వెళ్ళిపోయాను.

బయల్దేరామన్న మాటేగాని, ఎక్కడికెళ్దామన్న సంగతి గూడా ఆలోచించలేను. ఈ యువతి సంగతేమిటి? ఎవరీవిడ? ఎలాంటి మనిషి? మా ఎమ్టిఎస్ కెందుకుపంపారిలాంటి వ్యక్తిని? దేనినీ

లక్ష్యం చెయ్యకుండా, ఎవరినీ లెక్కపెట్టకుండా అడుగడుక్కీ కొత్త
కొత్త యిబ్బందులు తెచ్చిపెట్టే తకరారు మనిషా? అన్నీ నాకే తెలుసు;
నేనే అందరికంటే తెలివిగలదాన్ననుకునే గర్వపోతా? లేక, అక్క
డా ఎదుపులసగ్గర అందరితో కలిసి మెలిసి పనిచేస్తున్నప్పు డనిపించి
నట్టుగా మంచి, స్నేహపాత్రమైన మనిషేనా! లేక ఎంతభారాన్నైనా
ఆ లేత భుజాలమీదెత్తుకొని మోయగలిగిన అపూర్వ వ్యక్తా? ఎవరీవిడ?,

అప్పు డనిపించింది నాకు, వున్నట్టుండి. బహుశా యీవిడే
నేమో ఆ అపూర్వ రష్యన్ మహిళ అని. అలాంటి మహిళల్ని గురించి
పుస్తకాల్లో చదివాను; ఇతర్లు చెప్పగా విన్నాను. నిస్వార్థమైన ధైర్యం;
పని చెయ్యడంలో చొరవ, సాహసం; పైకి ప్రశాంతంగా సర్వ
సామాన్యంగా వుండేరూపం; నిశ్చయంగా అనుకున్న లక్ష్యాన్ని చేర
గల ధీశక్తి; అభ్యంతరాలూ, అడ్డుగోడలూ అపజయాలూ ఎరుగని
రష్యన్ ప్రకృతి!.... బహుశా యీవిడేనేమో ఆ రష్యన్ మహిళ; నేను
గుర్తించలేకపోయానేమో, ఏమో? ఒక్కోసారి యింతే! కల్లా కపటం
లేని వ్యక్తులతో కలిసిమెలిసి పని చేస్తూనే వుంటాం వాళ్ళ రహస్యాలూ
దాయనుగూడా దాయరు. మనలో ఒకళ్ళలాగానే వుంటారు. ఐనా
మనం వాళ్ళ సంగతి పట్టించుకోం; వాళ్ళని అర్థం చేసుకోలేం. అంతే
కాదు; మన జీవితంలోకల్లా తెలుసుకోవలసిన వ్యక్తి, అర్థం చేసుకో
వలసిన వ్యక్తి, మన కవసరమైన వ్యక్తి మన ప్రక్కనే వున్నట్లు
వూహించనుగూడా వూహించుకొనలేకపోతాం. చూశారా మరి; ఆవిడ
మా ఎమ్టియెస్. వదలివెళ్ళిపోయినంతపనీ అయ్యిందిగదా! నేనావిడ్ని
గుర్తించకముందే. నా ప్రక్కగా నడచెళ్ళిపోయేదన్నమాట. ఆవిడ
వెళ్ళిపోయింతర్వాత. మళ్ళీ తిరిగిక్కడికి రావడాని కేమాత్రమూ అవ
కాశం లేకుండా పోయింతర్వాత, నా తప్పు నేను తెలుసుకునేవాణ్ణన్న
మాట! అప్పుడుగాని నా తప్పు నేను గుర్తించేవాణ్ణి కాదన్నమాట!
నాకు భయమేసింది: ఇప్పటికే ఆలస్యమైపోయిందేమోనని ఆవిడెళ్ళి
పోతుందేమోనని. వెళ్ళిపోతే యింకేముంది? ఒలికిన పాలనుగురించి
ఎంతేడిస్తేమాత్ర మేం ప్రయోజనం? చేతులు కాలింతర్వాత ఆకులు
పట్టుకునేది? ఎట్లాగోట్లా ఆవిడ వెళ్ళిపోకుండా ఆపగలిగితే. చేసిన

పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోగలిగితే ఎంతబావుణ్ను. ఇవే ఆలోచనలు. ఒక పరుసా, క్రమమూ లేకుండా చింపరవందరగా, వుప్పెనలా వచ్చి పడ్డయ్ నా బుర్రలోకి. ఒక క్షణంలో విచారం; మరుక్షణంలో ఆనందం. వెళ్ళిపోతుందేమోనని విచారం, భయం, ఆందోళన; ఇంతకు పూర్వం ఆయుట్లో చూచిన ప్రతిచిన్న వివరాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని ఆనందం, సంతోషం, స్వర్గం.

లీనాని తలచుకున్నప్పు డిలాంటి ఆలోచనలుగాని, మధురస్మృతులు గాని కలిగేవేకాదు మరి.

ఫర్జనోప్ ఆఫీసుకెళ్ళాను నేను. ఆవి డిక్కడే వుంది. ఆముహం వంక తేరపార జూస్తూ ఆ ముహాన్ని చూచి మిగతావాళ్ళందరూ ఏమను కుంటారోనని ఆలోచించుకుని ఆశ్చర్యపోయాను. చక్కని అందమైన చిన్ని మొహం; ఆ వయసులో వున్న యువతుల్లో చాలామంది కుంటా యలాంటి ముహాలు. ప్రక్కకి తిరిగి ఫర్జనోప్ వంక చూచాను; అంతా కృత్రిమంగా కిన్పించాడు.

సమచతురం మళ్ళపద్ధతితో విజయం సాధించింతర్వాత, ప్రజలకి మేమంటే వున్న అభిప్రాయాలు మారినై. మేమంటే ఒక విధమైన గౌరవమూ, గురీ ఏర్పడినై. మేం సంపాదించిన మంచిపేరు మా వొక్కరిదే కాదుగదా; మొత్తం జిల్లాకిగూడా దక్కుతుందా మంచిపేరు. అసలీ విజయం సాధించడానికి కారకులెవరు ? ఎలా సాధించారు ? అన్న వివరాలలోకి వెళ్ళలేదు ప్రజలు, వాళ్ళకి కావలశిందల్లా ఒక్కటే: ఝురావినో ఎమ్టిఎస్ మంచిపనిజేశింది మంచిపేరు సంపాదించింది!

అందరూ పుత్సాహంగా వున్నారు. మా గ్రామీణార్థికవేత్త అంటే మా ప్రవర్తనలోగూడా మార్పువచ్చింది.

అలా మారడంలోగూడ నేనే మొదటివాణ్ణి. ఆవిడచేసే ప్రతీపని నాకు గొప్పగా కన్పించేది; ప్రతీపని నాలో కుతూహలం రేకెత్తించేది. ఒక్కోపారి ఆవిడ పూరికే ఏదోవొక దళ సభ్యుల్తో మాట్లాడుతున్నాసరే, ఏం చెబుతూందో విందామనిపించి, దగ్గరకెళ్ళేవాణ్ణి.

ఫెద్యా ప్రవర్తన నా ప్రవర్తనకంటే గూడ ప్రస్ఫుటంగా కన్పించేది. ఏమాత్రం అవకాశం కలిగినాసరే. ఆవిడ కూర్చునేందుకు కుర్చీ ముందుకు జరిపేవాడు; సాధారణ సమస్యల్ని సాధారణ పరిస్థితుల లోనే పరిష్కరించాలన్న సూత్రం పాటించడం అనుభవంవున్న నాయక వర్గానికిగూడా ఒక్కొక్కసారి సాధ్యంకాకపోవొచ్చునంటూ, చేసినతప్పులకా అన్నట్టు, సమాధానం యిచ్చుకునేవాడు.

'పార్టీపనంత కష్టపుపని యింకోటిలేదు. యంత్రంలో ఎక్కడే పొరపాటుందో కనుక్కోవడం ఎంజినీరుకే సాధ్యంకాదుఅప్పుడప్పుడూ. అలాంటప్పుడూ, పార్టీ పనంటే ప్రజలకి సంబంధించిందిగదా, యింకా కష్టం!' అనేవాడు.

ఇగ్నాత్ ఇగ్నతొవిచ్ వేరు; ఆవిడంటే దయగాచూడడం ప్రారంభించాడు కాని, బెట్టుమట్టు కొంచెమైనా తగ్గలేదు; కాస్త దూరంగా వున్నట్టుంటి. 'విచిత్రమైన మనిషిలాగుందే యీవిడ!' అన్నట్టుండేవాడు.

మా రేడియో ప్రశంసల కతీతంగా వున్నది యిద్దరే. వాళ్ళలా వుంటారని అనుకోలేదు నేను అందులో మొదట నాస్త్యాని గురించి చెబుతా. జరిగినదాన్ని గురించీ, పొందిన ప్రశంసల్ని గురించీ అప్పుడే మరచిపోయినట్టుందావిడ; కొత్తపనులమీద దృష్టిని కేంద్రీకరించు తోంది అప్పుడే. అదీగాక విజయగర్వంకూడా సోకలేదావిడకి. ఐనా మా అందరి ముఖాలూ వాచేట్టు చేసింది; ఆ సంగతి మేం అందరం గుర్తించాం. ఆ సంగతి గుర్తించనది ఆవి దొక్కతే! ఈ విషయంలో గెలిచాం గదాని మిగతా విషయాల్లో యీ సదవకాశాన్ని వినియోగించుకో లేదు. కాని మేమెంత దగ్గర కెళ్ళినా, మా ప్రవర్తనలో ఎంత మార్పొచ్చినా పట్టినట్టేలేదావిడకి. మేమంటే, వుదాసీనంగానే వుంది. ఎప్పటికీ మల్లే. మమ్మల్నందరినీ యిదివరకే కొలిచి తూచి ఒక నిర్ణయాని కొచ్చేసినట్టుంది; ఆ నిర్ణయం మార్చుకోవలసిన అవసరం ఏమీ కన్పించినట్టు లేదావిడకి.

రెండో వ్యక్తి ఫర్జనోవ్. ఆయన్ని చూచి మరీ ఆశ్చర్యపోయా న్నేను. వచ్చిన ప్రశంసలూ, పేరుప్రతిష్ఠలూ అన్నీ నిజంగా తనవే

నన్నట్టు ప్రవర్తించడం ప్రారంభించాడు! సమచతురం మళ్ళ పద్ధతిని ప్రవేశపెట్టిందిగూడా నిజంగానే తానైనట్టూ, అందుచేత ఆ ప్రశంసల్లో తనపేరు పేర్కొబడటం చాలా సహజమే ఐనట్టూ ప్రవర్తించడం మొదలెట్టాడు పోనీ అసలుసంగతులు తెలియని కొత్తవాళ్ళదగ్గరా, అపరిచితులముందూ అలా ప్రవర్తిస్తే అదొక దారనుకోవచ్చును; మా ముందే. అన్నీ యెరిగిన మాముందుగూడా, అలాగే ప్రవర్తిస్తే! తెర వెనుక జరిగిన తతంగం అంతా తెలుసుగదా మాకు? అక్కడిదాకా యెందుకు? ఒకవైపున రేడియో ప్రసారం జరుగుతోంటే వింటూ, ఏమీతోచక, ఏమన్నాడో తెలుసా: 'ఈ యేడీ సమచతురంమళ్ళ పద్ధతి యింత ఫాషనౌతుందనిగాని, పన్నింత పైకి లేపేస్తుందనిగాని ఎవరు కలగన్నారు!' అన్నాడు, ఆ మాటలన్నవాడు, మర్నాడుదయం బెరుకన్నా లేకుండా. ఏ వెరపూ లేకుండా నాతోనూ, ఫెద్యాతోనూ ఏమన్నాడో తెలుసా!

'ఇప్పుడర్థమౌతోందటయ్యా మీకు, యిక్కడింత ముమ్మరంగా యంత్రాల బాగుసేత సాగుతూన్నా లెక్కచెయ్యకుండా మనకున్న మంచి మంచి పనివాళ్ళ నందర్నీ ఆ సమచతురం మళ్ళ వ్యవసాయపద్ధతినేర్చుకు రావడానికి నేనెందుకు పంపిందీనీ?' అన్నాడు.

'మీరా పంపింది?' అనడిగాడు ఫెద్యా ఆశ్చర్యంగా; 'మీరు పంపినట్టు తెలియదేనాకు!' అన్నాడు.

ఐనా, ఆయన వెనకాడలేదు. సూటిగా ఫెద్యావంక చూస్తూ, హుషారుగా, అతి సహజంగా, ఏమన్నాడో తెలుసా!

'మరివాళ్ళందరూ ఎక్కడి వాళ్ళనుకున్నారు? నా కార్ఖానా మనుషులేగదా! నేనేగదా వాళ్ళనొదిలింది. మొట్టమొదటంటే అనుమానించానుగాని, తర్వాత ఎన్ని యిబ్బందులుపడాలిశొచ్చింది వాళ్ళందర్నీ యీ సమచతురం మళ్ళపద్ధతి నేర్చుకోడానికని పంపడం మూలాన! మీకు జ్ఞాపకంలేదూ? అన్నాడు.

ఫెద్యాకూ, నాకూ ఆయనంటే వున్న గౌరవాన్నిబట్టి ఆయన చెప్పేది నిజంగానే నిజమనిపించింది! నిజానికా కార్ఖానా మనుషుల

కనుమతి నిచ్చిందెవరు ? ఫట్టనోవ్. అందువల్ల కలిగిన యిబ్బందులన్నీ సహించిం దెవరు? ఆయనే! అదీ ముఖ్యవిషయం. అంతేగాని, ప్రధమంలో, ఆ పద్ధతి కాయన ఎంత వ్యతిరేకించాడూ అన్న సంగతి మాకు పట్టనేలేదు.

ఐనా, మా స్నేహం యిదివరకటి స్నేహం కాదు; కొంత పరివర్తనొచ్చింది. ఇదివరకంటే, ఆయన చేశేది ప్రతిదీ గొప్పేననిపించేది. నోట్లోనుంచి పైప్ తీయకుండానే ఒకటి రెండు మాటల్తో ముక్తసరిగా సమాధానాలు చెప్పడం. ఏదోవొక అర్థం వ్యక్తం చేస్తున్నట్టుండే ఆ చూపులూ, ఎదురుగావున్న మనుషులే కాకుండా గోడలు గూడా దారివ్వాల్సిందేనన్నట్టుండే ఆ నడకతీరూ ...

ఇప్పుడు, ఒక్కోసారి, ఆయన్ని చూస్తే నవ్వకుండా వుండలేకపోతున్నాను. నాగలిమొన బండబారితే చాలు, ఏదో పెద్ద ప్రపంచ సమస్యైనట్టు గంభీరంగా మాట్లాడుతూంటే నవ్వు రాదూమరి?

ఆయన పద్ధతికీ, పనులకీ బోలెడు తేడా కనిపించింది. మనిషిని చూస్తే ఏదో అసాధారణ కార్యక్రమం కొనసాగించే ప్రముఖ వ్యక్తిలా వుంటాడు; చేసే పనులేమో అతి సామాన్యమైనవి. ఐనా ఆ విషయాన్ని గురించి మరింత ఆలోచించేందుకు తగిన సావకాశం చిక్కలేదప్పుడు. మర్నాడు వాతావరణం మారింది; పగళ్ళు కాస్త నునువెచ్చగా వున్నై.

విత్తనాలు జల్లడం ప్రారంభమైంది.

పని చకచకా ప్రారంభమైంది. యంత్రాలుగూడా బాగా పని చేస్తున్నై; మావాళ్ళందరూ తీసుకున్న కోటాలన్నీ మించి మరీ చేస్తున్నారు పని. దానికింకొక కారణంగూడా వుందనుకోండి. ప్రతియంత్రాన్నీ కనీసం పదిసార్లన్నా తనిఖీ చేశాం. ప్రతి విషయాన్నిగురించీ రాత్రింబగళ్లు కూర్చుని, చర్చించి, నిర్ణయించాం.

పనిచకచకా ప్రారంభమైనమాట నిజమేగాని, అంతమాత్రాన అంతా నల్లేరుమీద బండిలాగా సాగిపోయిందని అనుకోవడం పొరపాటు.

నాస్త్యా గుణం మారలేదు; ఆవిడ మార్చుకోలేదసలా పాతగుణం. గుర్రంమీదో, కారుమీదో, మోటర్ సైకిల్ మీదో ఎప్పుడూ, ఎక్కడో ఒక చోట ప్రత్యక్ష మౌతూనే వుంది. ఎప్పుడూ, ఎక్కడో ఒకచోట, ఏదోవొక లోపం పట్టుకుంటూనే వుంది. ఒకచోట విత్తనాలు పలచనై అనేది; యింకోచోట వొత్తుగావున్నై అనేది: యిక్కడ దున్నడం సరిగా లేద నేది; అక్కడ విత్తనాలు సకాలానికి అందలేదనేది. చివరికి యంత్రాల డ్రైవర్లకీ, క్షేత్రాల అధ్యక్షులికీగూడా ఊపిరాడనివ్వలేదు. గడచిన శీతకాలంలో, ఆవిడ వాళ్ళతో అంతస్నేహం కలుపుకోక పోయుంటే తెలిసేదావిడకి; చచ్చినా పూరుకునేవాళ్లుగాదువాళ్లు; ఎదురు తిరిగేవారు తప్పకుండా. ఆ స్నేహం మూలాన, శీతకాలంలో ఆవిడచెప్పిన పాఠాల మూలాన, యిచ్చిన సలహాలమూలాన బ్రదికిపోయిందావిడ. ఆవిణ్ణందరూ గురువుగానూ, హితైభిలాషిగానూ, స్నేహితురాలిగానూ పరిగణించు కోవడం ప్రారంభించా రప్పట్నుంచీనీ.

ఆ విత్తనాలు జల్లేరోజుల్లో, ఒక్క రోజంటే ఒక్కరోజుగూడా ప్రశాంతంగా గడిస్తే ఒట్టు. ఆవిడ చెప్పే మాటలు సబబైనవేనని ఒప్పు కున్నా. కనీసం రోజుకొక పదిసార్లైనా నాకు నచ్చని పేచీలొచ్చిపడేవి; అలాంటప్పుడు లాగి నాలుగు జమురుకోవాలని గూడా అనిపించేదినాకు. అలాంటి పేచీలు పది వున్నా, కనీసం రోజుకొక్క సారైనా ఆవిణ్ణి కౌగలించుకోవా లనిపించేది. అహఁ. కౌగలింతంటే అదికాదు. పురుషుడు స్త్రీని కౌగలించుకొన్నట్టుకాదు. ఒక స్నేహితు ణ్ణింకో స్నేహితుడు కౌగలించుకున్నట్టు. ఆవిడ ఓపిక, శక్తి సామర్థ్యాలు, ఇంగిత జ్ఞానం చూచినప్పుడల్లా అంత సంతోషం కలిగేది. ఆరోజుల్లో, ఫెడ్యా, ఇగ్నాత్, నేనూ కూచ్చుని మెచ్చుకుంటూ వుండేవాళ్ళం ఆవిణ్ణి. ఐనా, ఏంలాభం! మమ్మల్నిగాని మా మెచ్చుకోలునుగాని గమనించేదే కాదావిడ. ఇదివరకటిలాగానే.

నా వ్యథ ప్రారంభమైంది అప్పట్నుంచి. నేను ఎమ్టియెస్ కొస్తే చాలు, ఆవిణ్ణి గురించిన ఆలోచనలు ముట్టడించేవి. చెపితే నమ్మరు గాని, ఆవిడా పరిసరాల్లో వున్నదీ అంటే అమితానందంగా వుండేది.

కనుమరుగై తేబాలు కలవరపడిపోయే వాణ్ణి; పిచ్చెత్తి నట్టటూయిటూ తిరిగేవాణ్ణిని. ఏ పొలంలో పనిచేస్తోంది ? తిరిగెప్పు డొస్తుంది ? అలాగే కళ్ళల్లో వత్తులు పెట్టుకు కూర్చునే వాణ్ణి ఎప్పుడొస్తుందా అని. చూచి చూచి కనులు కాయలుకాచేప్పటి కొచ్చేదావిడ. మళ్ళీ మొదలు : పెదవు లదృశ్యమయ్యేవి. గడ్డం పారలా ముందుకొచ్చేది. చూడగానే ఆడపులిలా లంఘించేది నామీదకి.

ఒకనాడేం జరిగిందంటే – డిటి – 54 ట్రాక్టరొకటి చెడిపోయింది. మంచి సమిష్టి క్షేత్రంలో పని చేస్తోందా ట్రాక్టర్. ఆ ట్రాక్టరులో ఒక పనిముట్టు విరిగిపోయింది. ఆ పనిముట్టు విడిగాలేదు మాదగ్గర. అంటే ఏమిటన్న మాట ? ఒకరోజు వృధా ఐపోతుంది. ట్రాక్టరా రోజుకి పని చెయ్యదు. గోషాదగ్గరుందా పనిముట్టొకటి; ఎప్పుడేం అవసరం వస్తుందో నని స్వయంగా తయారుచేసి లట్టిపెట్టు కున్నాడట అతను. విత్తనాలు జల్లే కార్యక్రమం ముమ్మరంగా సాగేరోజులు. గంటపోయినా పోయి నట్టే. గోషాదగ్గర కెళ్ళి ఆ పనిముట్టడిగి పట్టుకురండని ఆర్డరేశాను నేను. ఇవ్వనన్నాడట. నా ఆశ్చర్యం వేసింది.

'ఎందుకని ?' అనడిగాను.

'మన గ్రామీణార్థికవేత్తతో ఆలోచించింతర్వాతనే అన్నాడు ఇవ్వ నని' అని చెప్పారు.

సరే. ఇక నా ప్రేమదేవతని పిలిపించాను. వచ్చింది. నాగాచిక్కి పోయింది. ఎండమూలాన్నేమో రంగు ఎరుపెక్కిందు. ముక్కుమీద పొట్టురేగుతోంది. బిగుతు లాగూలు వేసుకోవడం మానేసింది.

నేను కోప్పడనూలేదు; ఎందుకలా చేశావో సమాధానం చెప్పమనీ అడగలేదు. ప్రశాంతంగా,

'నాస్తాస్యా వాసిల్యెవ్నా ! మళ్ళీ ఓవాటు పెట్టినట్టు నమోదు చెయ్య మన్నావా ?' అనడిగాను.

'మీయిష్టం' అని అంది తలవంచుకొని.

నేనూ నా తలూపుకుని, నిట్టూర్చాను.

'ఇక వెళ్ళొచ్చు' అన్నాను.

చీవాట్లూ పెట్టలేదు; చీవాట్లు నమోదూ చెయ్యలేదు.

రెండుమూడు రోజులైన తర్వాత మళ్ళీ వచ్చింది నాస్త్యా పనిమీద. కాస్సేపా పనినిగురించి మాట్లాడుకున్నాం యిద్దరం. తర్వాత, వెళ్ల బోయేముందు ఆగి.

'అలెగ్జీ ఖారికోవ్. ఆ పనిముట్లను గురించి.... అప్పుడు మీ ఆజ్ఞని తిరస్కరించినందుకు విచారిస్తున్నాను. ఇదివరకొకసారి, నాకు చీవాట్లు పెట్టి అవి నమోదుచేశారు కాబట్టి కాదిప్పుడు నేను నా విచారాన్ని తెలియ చేస్తున్నది. క్షమాపణ చెప్పడం అవసరం అని అనుకుంటున్నాను కాబట్టి చెప్పుకుంటున్న యీ క్షమాపణ. ఇక ముందెప్పుడూ అలా ప్రవర్తించ నని హామీ యిస్తున్నాను; మీ కార్యక్రమాని కభ్యంతరం కలిగేట్టి కెప్పుడూ ప్రవర్తించను. క్షమించండి" అంది.

అంతే. అలా అని, వెనక్కితిరిగి వెళ్ళిపోయింది. ఇక ఫర్వా లేదన్నమాట, మన ఎమ్టియెస్ యిక ప్రశాంతంగా వుంటుం దన్న మాట అని అనుకున్నా నేను. కాని, మా కా అదృష్టం యెక్కడిది! మర్నాడుదయమే మొదలు మళ్ళీ. మర్నాడు ప్రొద్దున్నే వచ్చేసింది నాస్త్యా మా ఆఫీసుకి. ఒకదళంలో ఇంధనాన్ని గురించి పేచీవొచ్చింది. ఆ పేచీ యెందుకు రావాలి అంటూ కేకలేసింది ఆఫీసు కొచ్చి.

ఆ క్రిందటినాడు నాదగ్గరకొచ్చి, క్షమాపణ చెప్పుకున్నప్పుడు, నా మనసు కరిగింది. తప్పొప్పుకుని క్షమాపణ చెప్పుకోగల వుదారబుద్ధి వున్నదావిడ కొక్కతె కేనా? నేనుమాత్రం ఎందు కుండగూడదూ అట్లా?

అదీగాక. అన్నిటికంటె ముఖ్యమైన విషయం యింకొకటుంది. ఆవిడ గౌరవాన్ని సంపాదించా లనుకున్నా అదొక్కటే మార్గం. ఆవిడ కపటంలేని మనిషి; నికార్సయిన మనిషి. అలా నిష్కపటంగా, నికార్సుగా ప్రవర్తించే వాళ్ళతోనే ఆవిడ స్నేహంగా వుంటుంది. ఆవిడ స్వభావం అదీ అని అంతకుముందే గుర్తించాను నేను.

ఒకసారి, హోస్టుమీ ఎదురుపడిం దావిడ. ఇద్దరం కలిసి, ఎమ్టీయస్‌కి నడిచొచ్చాం. ఎమ్టీయస్ సంగతులూ, అవీ యివీ మాట్లాడు కున్నాం కూడా. చివరికెలాగైతేం, ధైర్యం కూడదీసుకున్నాను :

'నాస్త్యాస్యా వాసిల్యెవ్నా! నువ్వేమీ అనుకోనంటే ఒకసంగతి చెప్పదలుచుకున్నాను. మొదట్లో మేం నిన్ను సరిగ్గా అర్థంచేసుకోలేదు; పొరపాటుగా అర్థంచేసుకున్నాం. అన్యాయంగా ప్రవర్తించాం. అప్పుడు నమోదుచేసిన ఆ చీవాట్లనుగూడా తొలిగించేస్తాం రికార్డులోంచి. మా ధన్య వాదాలర్పిస్తూ ఒకపత్రంగూడా యిస్తాం నీకు. కానీ కాగితంమీద రికార్డులోంచి తొలగించినంత మాత్రాన మనసులోంచి పోవుగదా; మనసు లోంచిగూడా తొలగించుకునేందు కేదైనామార్గం వుంటే చెప్పు' అని అన్నాను.

విస్తుపోతూ విన్నది నామాటలు, నామాటలు విని సంతోషించిం దనీ, యిక మాస్నేహం చిలవలు పలవలేస్తుందనీ అనుకున్నా నేను. కాని అలాంటిదేమీ జరుగలేదు. తత్తరపడిపోయిం దావిడ.

'సరే, అలెక్సీ ఛాలికోవ్, మీరలా అన్నందుకు ధన్యవాదాలు' అని అంది.

ఇద్దరం కరస్పర్శ చేసుకున్నాం; వెంటనే మలుపుతిరిగి వెళ్ళి పోయింది నాస్త్యా, ఇంటివరకూ ఆవిడతోపాటు వెళ్ళే సాహసం లేక పోయింది నాకు. అసలా సంభాషణ ప్రారంభించకపోతేనే బావుండే దేమో అనిగూడా అనుకున్నాను నేను. ఆ సంభాషణవల్ల బావుకున్న దేమీ కన్పించలేదు.

రోజులు గడుస్తున్నై. నాకేమీ బావులేదు. ఆవిళ్ళో మార్పేమీలేదు. నేనంటే, యిదివరకటి లాగానే వుదాసీనంగా వుంటోంది. పీలుచొరికి నపుడల్లా విరుచుకుపడుతూనే వుంది నామీద. ఎమ్టీయస్‌లో ఎక్క డేమి జరిగినా సరే, నామీదనే దాడి.

ఆ సంభాషణ జరిగింతర్వాత, ఐదు రోజులికి, ఆకస్మాత్తుగా, ఆఫీసు కొచ్చి, మా రహదారీ సౌకర్యాల్ని చట్టవిరుద్ధంగా వుపయోగిస్తున్నా

రంటూ ఎగిరిపడింది నామీద, విమర్శించింది, నానామాటలూ అంది, చివరికెళ్లిపోతూ, వెళ్లిపోతూ, చివరి దెబ్బన్నట్టు, నవ్వుతూ అన్నదిగదా:

'క్షమాపణ చెప్పారు కాబట్టి. యిక మెదలకుండా వూరుకుంటా ననుకున్నారేమో మీరు! కాంప్రేడ్ మానేజర్, అట్లా ఎన్నటికీ జరుగదు. మిమ్మల్ని శాంతంగా బ్రదకనిస్తా నన్నమాట కల్ల!' అంటూ నవ్వింది. సస్నేహంగా చూచింది నావంక, ఆ నవ్వులో ఆటకాయతనం కన్పించింది నాకు. ఆ నవ్వు నునువెచ్చగా వున్నట్టనిపించింది, ఆవేళ సూర్యుడు గూడా చక్కగా ప్రకాశించాడు!

తర్వాత గూడా. అనేకసార్లు వాదించుకున్నాం మేం. కాని, ఆ వాదాలు యిదివరకటిలాంటి వాగ్వివాదాలు కాదు. అవి మా పనికి సంబంధించిన చర్చలు. ఒక ఎమ్టియస్ మానేజర్తో, ఆ ఎమ్టియస్ గ్రామీణార్థికవేత్త చేసే చర్చలు ఆ యిద్దరూ అలా చర్చించుకోక తప్పదు. అలా చర్చలు జరగలేదూ అంటే ఆ యిద్దరికీ పనంటే లక్ష్యం లేనట్టు. నాస్త్యా పుణ్యమా అంటూ నా కా దృక్పథం ఏర్పడింది.

అప్పటికి మేం విత్తనాలు జల్లడం పూర్తైపోయింది; మా ఆకు మళ్లు మొలకలెత్తినై. మా యిరుగుపొరుగువాళ్ళ మళ్ళింకా నల్లగానే వున్నై; మా మళ్ళు పచ్చబడినై.

మాకూ, మాచుట్టుప్రక్కల వాళ్ళకూ వున్న భేదం రోజురోజుకూ ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. మా ఆకు అప్పుడే రెండంగుళాలు పెరిగింది; వాళ్ళ దప్పుడప్పుడే నేలమీదకి పొడుచుకొస్తోంది......

మాపనిలో ప్రతి అంచెకూ ప్రతిఫలం కనిపిస్తోంది. మేంవేసిన ఎరువులు, మేం చల్లిన విత్తనాలు, మేంచూచిన అదును, మేం జల్లిన విధానం! మా తెలివితేటలకీ, మా శ్రమకీ ప్రతిబింబం ఆ నేల! ఎదురులేని నిదర్శనం!

వర్షమూ అంతే. మేం విత్తనాలు జల్లడం పూర్తైందోలేదో వారం రోజులు మంచి ముసురు పట్టింది. మాకప్పుడెంత వానపడితే అంత మంచిది. కాని మా చుట్టుప్రక్కల వాళ్ళింకా విత్తనాలు జల్లడం పూర్తి

కాలేదు; వాళ్ళ కాపర్వం మంచిదిగాదు. వాళ్ల మధ్యలో పని ఆపవల
సొచ్చింది. ట్రాక్టర్లూరికే వుండిపోవలసొచ్చింది. బోలెడు కాలం వృథా.

వర్షం కురిసింతర్వాత. తెరపిచ్చింది. ఆ తెరపూ మేలే అయ్యింది మాకు. మా నారు బాగా వేళ్ళూనుకుని. చక్కగా పెరిగి పెద్దదైంది. మా చుట్టుప్రక్కల వాళ్ళకది లాభంలేదు; ఇంకావాళ్ల విత్తనాలు జల్లుతూనే వున్నారు.

మేంతెచ్చిన విత్తనాలూ అంతే. మా విత్తనాలు మాప్రాంతపు విత్తనాలే; అతివృష్టి. అనావృష్టులకి తట్టుకోగలిగిన విత్తనాలు. మాచుట్టుప్రక్కలవాళ్ల తెచ్చిన విత్తనాలు దూరప్రాంతాలవి. అదీ సంగతి!

పనిసరిగ్గా జరిగింది. వాతావరణం సరిపోయినట్టుంది.

మా ప్రయత్న ఫలితాలు మా కష్టానికి ఫలితం మా కళ్ళముందు కన్పించింది.

రోజువారీ పని హడావిడిలో, ఎమ్టియస్‌లో ఏం జరుగుతోందీ వెంటనే గ్రహించలేకపోయాం. రోజూ పోట్లాడుకోవడమూ, వాదించుకోవడమూ, అటూ యిటూ తిరగడమూ తప్ప యింకేమైనా జరుగుతోందా అసలు అనిపించింది, మొదట్లో.

పర్వతారోహణ చేసే వ్యక్తిలాగైంది మా పరిస్థితి. ముందున్న రాళ్ళూ, పొదలూ పట్టుకుని పైకెగబాకాలని చూస్తాడతను. క్రిందరాళ్ల వంకా, తన కాధారంగా కన్పించే రాళ్ళవంకా మట్టుకే చూస్తాడు తప్ప, తానెంత పైకెక్కిందీ గమనించడు. ఈ పర్వతాలెక్కడం మహాకష్టమే అనుకుంటాడు. చివరికి చదునైనప్రదేశం వచ్చింతర్వాత, చుట్టూ కలయ జూస్తాడు. అప్పటికిగాని తెలియదతనికి తానెంత వున్నతపర్వతశ్రేణి పైకి ఎక్కిందీనీ!

మేమూ అంతే. మేమెంత పురోగమించిందీ మేమే గ్రహించలేదు. మా యిరుగు పొరుగువాళ్ళ సంగతి చెప్పే పనేలేదు.

నాకు బాగా గుర్తు: పత్రికల్లో గోషానిగురించి వ్యాసం పడింది. ఆ వ్యాసం చూచి లీనా ఏమన్నదో తెలుసా!

'అంతా ఏదో కాకతాళీయంగా జరిగిపోయింది. ఆ సమచతురం మళ్ళపద్ధతి వ్యవసాయానికి గోషాని అధికారిగా వేశారు; ఆ విలేఖరి గూడా అదృష్టవశాత్తూ ఆయన్నే కలుసుకున్నాడు !' అని అంది.

పొలాలు పచ్చబడింతర్వాత, లుకాచ్ వచ్చి 'మీ రఘురావినో ఎమ్‌టియెస్ అదృష్టమా అంటూ వర్షంగూడా అదునుకు కురిసింది ! సరిగ్గా విత్తనాలు జల్లడం పూర్తయ్యేప్పటికి కాకతాళీయంగా వానగూడా పడింది !' అనడం మొదలెట్టాడు.

మా పంట యింతౌతుందని తెలియగానే మళ్ళీ వచ్చాడు లుకాచ్:

'దిగుమతైన విత్తనాలు వొద్దని మీ స్వంత విత్తనాలే జల్లుకోవడం, అదృష్టవశాత్తూ మీకు మంచిదే అయ్యింది' అన్నాడు.

ఫెద్యా నవ్వాడు అతని మాటలు విని :

'ఇక్కడిన్ని ఎమ్‌టియెస్ లుండగా యీ ఒక్క ఎమ్‌టిఎస్‌కే పట్టినై యిన్ని అదృష్టాలూనూ. మనకు కనిపించని సూత్రాలేవో యీ అదృష్టాల్నీ, అనేక కాకతాళీయ సంఘటనల్నీ సమకూరుస్తాయ నంటారు కొందరు వేదాంతులు. ఇవన్నీ ఏవో అదృష్టాలనీ కాకతాళీయంగా జరిగిన సంఘటనలనీ అనుకుని అసలు కారణం ఏమిటో కనుక్కోకుండా వదిలిపెట్టేస్తున్నావ్ నువ్వు. నీకంటే యింకాస్త యెక్కువ ఇంగితమూ, ఇంకాస్త తక్కువ అసూయా వున్నవాళ్ళు యిన్ని అదృష్టాలు యీ ఒక్క ఎమ్‌టియెస్‌కే ఎందుకు పట్టాయో చెప్పగలుగుతున్నారులే' అన్నాడు.

ఫెద్యా చెప్పింది నిజమే ; తెలివిగలవాళ్ళు మా ఎమ్‌టియెస్‌లో యేం జరుగుతోందీ మాకంటే ముందే, మా కంటే బాగా గుర్తించారు.

అనేకమంది వచ్చి చూచెళ్ళడం ప్రారంభించారు మా ఎమ్‌టియెస్‌ని : పార్టీకార్యకర్తలు, సమిష్టిక్షేత్రాల రైతులు గ్రామీణార్థికవేత్తలు, విజ్ఞానశాస్త్రజ్ఞులూ...వచ్చేవారు; అంతా తిరిగి చూచేవారు; ప్రశ్న లడిగేవారు; ఇదివరకు జిల్లాసమావేశాలకీ, ప్రాంతీయ కేంద్రంలో సమావేశాలకీ వెళ్ళినప్పుడు, అంతకుపూర్వం మాతో కలిసి మెలిసి వేటాడిన

వాళ్లు తప్ప యింకెవళ్ళూ ముందుకొచ్చేవారుకారు కరస్పర్శ చేసేందుకు. ఇప్పుడలాకాదే! మేం వెళ్ళడం ఆలస్యం; అందరూ మా చుట్టూ చేరుతున్నారు. మా వ్యవసాయ పద్ధతుల్ని గురించి అడుగుతున్నారు. మమ్మల్ని గౌరవిస్తున్నారు; ఆదరిస్తున్నారు. ఇదివరకటి సంభాషణలకీ, యిప్పటి సంభాషణలకీ పోలికలేదు.

మా జీవితానికొక నూతన అర్థం సమకూరినట్లుంది. పాత జీవితాన్ని తలుచుకునేందుకుగూడా సిగ్గుగా వుండేదినాకు.

అవును, ప్రొద్దుతిరుగుడు పూలమొక్కలుగూడా బాగా పెరిగిన తర్వాత. ప్రతినిధివర్గాలుగూడా రావడం ప్రారంభమైంది. మళ్ళు కట్టడంలో అనేక యంత్రాల డ్రైవర్లు విఫలులయ్యారు మిగతాచోట్ల. అందుకని ఎస్. ఎస్. హెచ్. 6 నంబరు విత్తనాల యంత్రాలంటే నమ్మకం సడలింది గూడాను వాళ్ళకి. వాళ్ళందరూ వచ్చారు మా పొలాలకి. మా మళ్ళు చక్కగా తీర్చిదిద్దినట్లున్నై. ఏ కోణంనుంచి చూచినా సరే, వంకపెట్టేందుకు వీల్లేదు!

ఇంకొక సంగతిగూడా చెప్పాలనుకుంటా నేను; మా క్షేత్రాలకెవరొచ్చినా సరే, తీసికెళ్ళి అన్నీ చూపించే మనిషి మా ఫ్లైన్‌నోవ్. ఆయనే ఎందుకు చూపించేవాడూ అంటే చెప్పడం కష్టం. మంచి ఆజానుబాహువు. చూడడానికి గొప్పగా వుంటాడు. ఎప్పుడూ నోట్లో పైప్; మాట్లాడుతూంటే అధికారం ఉట్టిపడుతుంది. అంచేత జిల్లానుంచి గాని, ప్రాంతీయ కేంద్రంనుంచిగాని, చివరికి మాస్కోనుంచైనా సరే, ఎవరైనా వచ్చారూ అంటే అందరికంటే ముందు ఆయనమీదే పడేవి వాళ్ళ కళ్లు. వాళ్ళడిగిన ప్రశ్నల కన్నిటికీ సమాధానం చెప్పేవాడు. ఎమ్‌టియెస్‌లో కల్లా ప్రముఖవ్యక్తి తానే ఐనట్టూ, సమచతురం మళ్ళ పద్ధతిలో అతి నిపుణుడైనట్టూ ప్రవర్తించేవాడు మా విజయాలన్నిటికీ తానే కారకుడైనట్టు ఆ వచ్చినవాళ్ళనుకునేలా చేసేవాడు. మా చిన్ని నాస్త్యా, ఆ నూలుగుడ్డ లేసుకుని అటూ యిటూ తిరుగుతూంటే. ఒక్కసారిగూడా యీవిడెవరని అడిగిన పాపాన పోలేదు ఎవరూనూ.

మా ఎమ్‌టియెస్‌లో గూడా ఆవిడ చేసిన పనుల ప్రాముఖ్యాన్ని గుర్తించడానికి కొంత సమయం పట్టింది. విజయా లొకదాని మీదొకటి రావడం ప్రారంభించిం తర్వాత, ఆ విజయాల కావిడ చేసిన సూచనలే ప్రధాన కారణమని గ్రహించడం ప్రారంభించారు.

'పుస్తకాల్లోనూ పత్రికల్లోనూ యిట్లా లేదే' అంటూవుండేది నాస్త్యా తరచు. ఆవిడలా అన్నప్పుడల్లా నవ్వుతూవుండేవాళ్ళం. ఏమిటీ మరీ యింత అర్థంలేకుండా, చిలుక పలుకులు పలుకుతుందని. కాని క్రమక్రమంగా అర్థం చేసుకున్నాం. ఆవిడ చిలకగాదు. ఆవిడ చెప్పేమాటలు చిలక పలుకు లంతకంటే కావు. నికార్సైన మనిషి. మంచి మనిషి, ఆలోచించి మాట్లాడే మనిషి. అన్నమాట తప్పని మనిషి.

ఇంతకుపూర్వం ఆవిడ ఏ పథకాన్ని గురించి మాట్లాడినా సరే, పిచ్చి ఆలోచనలని తోసిపారేసే వాళ్ళం. ఇప్పుడు ఆవిడ ప్రతి మాటా వరహాలమూట.

దాంతో ఆవిడ మనసు తేటపారినట్టుంది; ఇదివరకటికంటే మెత్తగా మాట్లాడ్డం ప్రారంభించింది; మనిషి పరిపక్వ మౌతోందని పించింది. ఒకసారి ఆత్మవిమర్శనగూడా చేసుకుంది.

'ఇంతకుముందు మీ నాయకత్వాన్ని అంగీకరించడమన్నా యిష్టముండేదికాదు నాకు' అని చెప్పిందొకసారి నాతో; 'మీ ఆలోచనల్ని గురించి ఆలోచించాలనిగూడా అనిపించేదికాదు నాకు. అందుచేత ఒక్కొక్కసారి మరీ చికాకుపుట్టి చాలా అసందర్భంగా ప్రవర్తించేదాన్ని.'

తర్వాతగూడా అనేకసార్లు వాదించుకున్నాం; వాదులాడుకున్నాం. సూనేజంతో పోట్లాడని, వాదించని గ్రామీణార్థికవేత్త మాత్రం ఏ గ్రామీణార్థికవేత్త గనక! ఐనా మా స్నేహం గాఢమయ్యింది, ఆవిడతో పని చెయ్యడమే ఒక మహదానందంగా కనిప్పించింది. నాకు వున్నట్టుండి, హుషారుగావుంది. నిజమే; ఆవిడమూలాన ఒక్క క్షణంగూడా ఏమరి వుండటానికి వీల్లేకుండా పోయినమాట నిజమే ఐనా మాకేం కష్టం కలగలేదు. ఇది మన సోవియెట్ పద్ధతి; మన

రష్యన్ విధానం. ఆవిడ ప్రక్కన పనిచేస్తూంటే మంచులో నిలబడి నట్టుండేది ఏదో ఒకపైపున కొరుక్కుతినే చలి! బహుశా మరింత వెచ్చని ప్రదేశాల్లో వుండేవాళ్ళకది కష్టంగానే వుంటుందేమో కాని, మాకు మట్టుకు హాయిగానే వుంది!

ప్రథమంలో, ఆవిడా పర్జనోవూ బాగానే కలిసి పోయారనుకున్నా నేను. ఆవిడంటే ఒక విధమైన గౌరవంగూడా చూపిస్తున్నట్టుండేవాడు. మధ్య మధ్య పొగడుతూండేవాడుగూడాను: 'నాస్త్యాస్యావాసిల్యెవ్నా మంచి శక్తిసామర్థ్యాలున్న మనిషి' అనీ, 'మంచి బొరవున్న మనిషి' అనీనీ.

కాని ఆ గౌరవంలో ఏదో వెలితివుంది; తప్పనిసరై కావాలని తెచ్చి పెట్టుకున్నట్టుంది. ఆ పొగడ్తల్లోనూ అంతే: ఒక రకమైన ఎద్దేవ. మొట్టమొదటది గుర్తించలేదు మేం. ఇద్దరికీ పడుతోంది, మంచిదేలే అనుకున్నాం

ఒకనాటి రాత్రి, వేట పూర్తయ్యింతర్వాత. పర్జనోవ్. ఫెద్యా. నేనూ కొలనుల ప్రక్కన విశ్రమించాం. చలిమంటేసుకున్నాం. వెల్లకిలా పండుకుని మాటాడుకుంటున్నాం. ఏదో మాటొచ్చి. నాస్త్యాని ప్రశంసించాడు ఫెద్యా. ఎక్కడే మాట వినబడకుండా పోతుందోనని అతి జాగ్రత్తగా వింటున్నా నేను. కాని. వున్నట్టుంది.

'ఆఁ. ఇక చాల్లెద్దూ! నా దగ్గరా ఆ అమ్మాయి కుప్పిగంతులు' అన్నాడు.

ఆ గొంతులో కోపంచూచి. ఫెద్యా. నేనూ విస్తుపోయాం.

'మీ కేం తెలుసో. చెప్పండి....'

ఏముందిగనక చెప్పడానికి! పూరికే గొణిగాడు అర్థంలేకుండా:

'గోషానీ. నాస్త్యానీ చూస్తే అనుమానంగా వుంది నాకు' అంటూ.

'వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటే మాత్రం. అందులో తప్పేముంది?' అని అడ్డుతగిలాడు ఫెద్యా: 'అదా కారణం ఆవిణ్ణి ద్వేషించడానికి? లోకులు కాకులు. ఎప్పుడూ; ఎవరో వొకళ్ళి గురించి మాట్లాడుతూనే వుంటారు. లీనాకీ, లుకాచ్‌కీ సంబంధం వుందని అంటున్నట్టులా? అంతే

మాత్రాన. వాళ్ళని ద్వేషించారా మీరు? విని విననట్టూరుకున్నారే. ఇప్పుడింత కోపం ఎందుకొచ్చింది మీకు నాస్త్యా మీద? నిజం చెప్పండి :'

చలిమంటపంకే ఉదేపనిగా చూస్తూ 'అహాఁ నా దగ్గరా యీ కుప్పి గంతులు; నేను మోసపోకేఁ' అని మాత్రం అన్నాడు ఫర్జనోవ్ రెండు మూడుసార్లు. అంతే. ఫెడ్యా అడిగిందానికింకేమీ జవాబు చెప్పలేదు చివరికి.

'వర్షం కురిసినప్పుడు బుడగలు లేస్తాయి. బుడగలు గుంటల్లో బుడగలు లేస్తాయి. పోతాయి. లేస్తాయి. పగిలి పోతాయి :' అని అన్నాడు యిక వాదం అనవసరంలే అన్నట్టు

ఆ మాటే యింకా చాలాసార్లన్నాడు. ఆ బుడగలెప్పుడు పగిలి పోతాయా అని కాచుకూర్చున్నట్టు.

'ఎందుకు బాబూ, అంత ఆదుర్దాగా కాచుకు కూర్చోవడం. అవి పగిలే బుడగలు కావులే!' అందాం అనిపించింది నాకు.

కాని. అనలేదు. అతని మాటలు విని ఆశ్చర్యపోవడంతోనే సరిపోయిందినాకు.

అంతే. తరవాతెప్పుడూ పొక్కలేదాయన మళ్ళీ. ఆవిడంటే గౌరపంగానే వుంటున్నాడు. మధ్య మధ్య మా దగ్గర పొగడుతూనూ వున్నాడు.

కాని, ఫెడ్యాగాని నేనుగాని ఆ కొలనుల దగ్గర, ఆ చలిమంట ముందు ఆయనన్న మాటలు మరచిపోలేము; ఆ మాటలకంటే గూడా ఆ గొంతు. ఆ గొంతులో కోపం.

అసలంత కోపం రావలసిన అగత్యం లేదప్పుడు. అందుకనే మేం యిద్దరం మరీ అంత విస్తుపోయింది.

న్యాయాని కాయనకి నాస్త్యా చేసిన అపకారం యేమీ లేదు. ఒక సంగతి మట్టుకు నిజమే ననుకోండి. పవిని గురించి మాట్లాడుకునేప్పుడు ఒకరి అభిప్రాయా లొకరికి నచ్చకపోతే వాదులాడుకునేవారు. ఆ మాట

కొస్తే, మేం మాత్రం తప్పక పోట్లాడుకుం టెక్కడ! ఒక్కోసారి ఫెద్యా, నేనూ గూడా విసిగిపోయేవాళ్ళం; కోపం గూడా వచ్చేది! కాని మేమెప్పుడూ ఆవిడ్నింత భయంకరంగా ద్వేషించలేదే. ఇప్పుడు, మా ఎమ్మేలియన్ కింత మేలు చేసిందని తెలిసింతర్వాత, అందులోనూ ఫర్జనోవ్ కింత పేరు తెచ్చిపెట్టింతర్వాత, అసలా పెద్ద ఆలోచనలు రావడానికి గూడా ఆస్కారం లేదే!

ఆ పేరంతా ఆయనకి పోతోందేమో అని ఆవిడ బాధపడిందీ లేదు. గతంలో ఆయన చేసిన పొరపాట్లు సంగతెత్తి అవమానించి చిరాకు పెట్టిందీ లేదు. నేనింత గొప్పదాన్నని గర్వంగా రొమ్ము విరుచుకుని తిరిగిందీ లేదు. ఆవిడ పుణ్యమా అంటూ, ఇప్పుడు జనం అంతా ఆయ నేదో మహాత్ముడైనట్టు చూస్తున్నారు. అసలు పరిస్థితి ఇలావుంటే, ఆయనట్లా ఆ రాత్రి అంతద్వేషం కక్కడానికి కారణం? అంత ద్వేషంగా యిదివర కెప్పుడూ ఎవరిని గురించీ అన్నవాడు గూడా కాదే. ఇద్దరూ కలిసి పని చేసేప్పుడు ఆవిడ పెట్టిన యిబ్బంది అన్నిటితో పోల్చి చూసినా, యీ ద్వేషమే యింకా ఎక్కువగా వుందే!

అదీగాక ఫర్జనోవంటే నాస్త్యా కేమంత కోపమూ వున్నట్టు లేదు. ఆయన్ని చూసినట్టుగాని గమనించినట్టుగాని వుండేదే కాదు. తనకు గిట్టని సంగతులుంటే చెప్పేది; తర్వాతాయన సంగతే మరచిపోయేది. అంతే తప్ప, ద్వేషించిన పాపాన పోలేదే!

ఐనప్పుడు యీ అటవిక ద్వేషం, యీ గుప్తద్వేషం దేనికి? దీనికిమూలం ఎక్కడ? ఫెద్యాకుగాని, నాకుగాని ఆచూకీ అందలేదు.

అది అర్థంకాలేదు కాని, నాస్త్యా ఫర్జనోవ్‌లు రాజీ పడలేదని మట్టుకు అర్థమైంది. కాకపోతే, ఫర్జనోవ్ తన అసంతృప్తినీ అయిష్టాన్నీ బయటపడనివ్వడం లేదు. దాచుకుంటున్నాడు. అణచుకుంటున్నాడు. అంటే ఆ ద్వేషం నానాటికీ ఎక్కువై పోతోందన్నమాట.

ఇదిలావుండగా, ఫర్జనోవ్‌తో మాకున్న స్నేహంగూడా మెరక బారడం మొదలెట్టింది. ఇదివరకటిలాగానే వేటకెళ్ళేవాళ్ళం. ఇగ్నాత్ యింటిదగ్గర సమావేశమయ్యేవాళ్ళం. కాని మనసులువిప్పి మాటాడుకునే

వాళ్ళంకాదు. ఉన్నకొద్దీ; మా ఎమ్‌టిమెస్ విషయాలు మాట్లాడుకోవా లన్నా యిష్టంలేకుండా పోయింది నాకు.

మా స్నేహం యిలా చెడిపోయిందే అని విచారించనూలేదు నేను. అప్పటికి నాకు మా జిల్లాలోనూ, ప్రక్క జిల్లాలోనూగూడా కొంతమంది కొత్త స్నేహితులు దొరికారు. కొత్తకొత్త స్నేహితులూ. కొత్తకొత్త పనులూ. కొత్త కొత్త సంతోషాలూ....

నా వ్యథ నాది. రోజురోజుకూ ఎక్కువౌతోంది...నాన్సీ.... ఇప్పుడు నాతో బహిరంగంగా. స్నేహంగా మాట్లాడుతోంది, నిజమే. ఒక్కొక్కసారి హాస్యాలాడుతుంది. నవ్వుతూ పేలుతూ మాటాడుతుంది గూడాను. ఏంచేసినా. నేనంటే ఒక ప్రత్యేక భావం వున్నట్టుగాని కనిపించడంలేదు. ఆవిళ్లో. నేనంటే అంత ప్రత్యేకత చూపించవలసిన అవసరం ఆవిడకేముందిలే అని అనుకునేవాణ్ణి మరీ నిష్పాక్షికంగా ఆలోచించుకునేప్పుడు. ఐనా మరుక్షణంలోనే అపరిమితంగా బాధపడి పోయేవాణ్ణి: ఆవిడ మూలాన నాలో యింత మార్పు వచ్చిందిగదా, నేనొక నూతన వ్యక్తినయ్యానుగదా, ఇతరులు కలల్లోగూడా భావించలేని విషయాలు కొన్ని నాకు కరతలామలకాలుగా వున్నాయిగదా. ఇవన్నీ అలావుంచినా ఆవిడే నాకు సర్వస్వమూ....సరే....ఇవన్నీ ఆవిడ ఎందుకు గ్రహించదూ అని.

నిజంగానే. గ్రహించలేదా? నిజంగానే ఆ భావనరాలేదా? నిజం గానే గుర్తించలేదా? గ్రహించితే గుర్తించితే. మరి నాలోనిభావాలే ఆవిడలోనూ మొలకలెత్తాలే. బహుశా గ్రహించే వుంటుంది. గుర్తించే వుంటుంది స్త్రీగనుక, అందుకని బహిర్గతం చెయ్యలేక పోతోంది. స్త్రీలకి సిగ్గు సహజమే.

అనేకసార్లు చూచాను. కాని ఆ వింతేమిటో నా కంతుదొరక లేదు. ఆ హావభావం చూపించితేచాలు నేనేదో విచిత్రవ్యక్తి నైనట్టూ, అంతకుపూర్వం మా యిద్దరికీ ఏ పరిచయమూలేనట్టూ చూచేది నావంక. నా గుండెలో రాయిపడేది. నోటమాట పెగిలేది కాదిక.

ఒకసారి. ముళ్ళుపుతిరుగుతూ. తట్టుకోలేక మోటార్‌సైకిలు మీద నుంచి పడిపోయాను. స్పృహతప్పింది. స్పృహవొచ్చి చూస్తే నాస్త్యా వుంది ఎదురుగా. నామీదికొంగి కళ్ళు సర్దుతోంది; ఒక స్నేహితుడి కోసమో. ప్రేమించిన మనిషికోసమో కలవరపడి పోయినట్టుంది. నేను కనులు తెరిచానని తెలియగానే, లేచి నిలబడింది.

ఆ కలవరం ఏమిటా అని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాను. నాకు మరీ బాగా దెబ్బలు తగిలాయేమోనని భయపడేనా ఆ కలవరం? లేక .... తాను ప్రేమించని వ్యక్తికి తన కిష్టంలేని వ్యక్తికి దెబ్బ తగిలినా యీ భయం, యింత కలవరం కలుగుతాయా?

ఛాలికోవ్‌కి ఉక్కగా వున్నట్టుంది; ఊపిరాడుతున్నట్టులేదు సరిగా. లేచి రైలు కిటికీ తలుపు కింది కొదిలాడు. ఛామ్మని పడింది అద్దాల తలుపు. ఇంతకుపూర్వం ఆ గాజు కిటికీ లేచివున్నప్పుడు రైలుపెట్టె బయటి ప్రకృతి అంతా నిశ్శబ్దంగా. నల్లగా. గతీపతీ లేనట్టుంది.

గాజు తలుపు కిందపడడం ఆలస్యం; చల్లటిగాలి ఒక్కుదుటున దూకింది లోపలికి, అక్టోబర్ నెల చల్లదనం మోసుకుని. బయటినుంచి పువ్వుకాయల పరిమళమూ. ఎం.స్ పొగా కలిసి కొట్టింది. టెలిగ్రాఫ్ స్తంభాల మధ్య తేలి ఆటలాడుతున్నాడు చందమామ.

ఎక్కడో దూరాన రైళ్ళకూతలు వినిపించినై. పాత స్నేహితులు తిరిగి అర్థరాత్రిపూట కలుసుకుని ఆనందించు తున్నట్టున్నై ఆ కూతలు.

ఛాలికోవ్ నిశ్శబ్దంగా వున్నాడు; కాని చెప్పవలసిన కథింకా పూర్తికాలేదు.

'క్రెమ్లిన్‌లో ఏంజరిగిందో చెప్పలేదేనాకు?' అన్నాను నేను.

తత్తరపడినట్టు చిరునవ్వునవ్వుకున్నాడు ఛాలికోవ్:

ఏం జరిగిందా ? వేసవిలో అనావృష్టి. ఆ సంగతింతకు మునుపు చెప్పానుగదూ మీకు. తర్వాత మంచుకూడ కాలానికి ముందే వచ్చి పడింది. గోధుమపైరంతా, గాలికి, పడిపోయింది. విత్తనాలు ముందే జల్లి వున్నాం కాబట్టి. యిలాంటి వాతావరణానికి తగిన స్థానికమైన విత్తనాలే కాబట్టి హెక్టార్‌కు సగటున పదిహేను సెంట్నెర్లదాకా పండింది గోధుమ. అదేమంత పెద్ద ఎక్కువేమీ కాదుగాని ఆ సంవత్సరానికది గొప్ప పంటలాగానే కనిపించింది. మా యిటుసు పొలుగున హెక్టార్‌కి ఎనిమిది తొమ్మిది అయ్యేటప్పటికి పెటపెటలాడి పోయింది. అదీగాక మా జొన్నా, ప్రొద్దు తిరుగుడూ విరగపండింది. ప్రొద్దుతిరుగుడు విత్తనాలే మా ఒక్కొక్క క్షేత్రానికీ దాదాపు రెండులక్షల రూబుళ్ళ ఆదాయం తెచ్చిపెట్టినై. ఇక జొన్న.... పశువులకు కావలసినంత మేత.

కాని, అన్నిటికంటే విశేష మేమిటంటే, యీ యేడు మా వెనకబడిన క్షేత్రాలు గూడా బాగా పండినై.

తర్వాత సెప్టెంబర్ ప్లీనమ్ మా సంతోషానికి మేరలేదు. మమ్మల్ని గురించీ, మా ఎమ్ టి యెస్‌ని గురించీ వ్రాయడం మొదలెట్టినై పత్రికలు. మా ఆశ్చర్యాని కంతులేదు. ఒక్క సంగతికూడా వదలిపెట్టలేదు పత్రికలు! మేం పడిన కష్టాలూ, ఎదుర్కొన్న యిబ్బందులూ అన్నీ వ్రాశారు. కాకపోతే మా విజయపథానికి మేం తడుముకుంటూ తచ్చట్లాడుతూ వెళ్ళిన యిరుకు దారులన్నీ రాజమార్గాలే నన్నట్టున్నె ఆ పత్రికల్లో. మేం వెనక ముందులాడుతూ అనుసరించిన పద్ధతులన్నీ ఒక నిర్ణీతపథకమే నన్నట్టు కనిపించిందా వ్యాసాల్లో ; మేం పూరితే సందేహం సందేహంగా వూహించిన వూహలన్నీ బలమైన పునాదులున్న ఆలోచనలే నన్నట్టు చిత్రితమైనై. ఆ రూపంలోనే నలుగురికీ అందజెయ్యబడినై. మా పథకంలో వున్న గొప్పదనం, మా నాస్త్యా పోట్లాన్, వాదులాడి అనుసరించిన పథకం మరింత ప్రస్ఫుటంగా కన్పించింది ప్లీనమ్ చర్చల్లో. ప్లీనం తర్వాత రెట్టించిన వుత్సాహంతో పనిజెయ్యడం ప్రారంభించాం. దేశమంతా మా ప్రతి అడుగునూ అతి జాగ్రత్తగా పరికిస్తున్నట్టు భావించాం. ఇదివరకు మాకు కావలసిందేదైనా

పైనుంచి అడిగి తెచ్చుకోవాలంటే, గొంతులు బొంగురుపోయేవి. ఇప్పుడదేమీ లేదు, అడగడం ఎడవు, అన్నీ వచ్చేస్తున్నై. అన్నీ యిచ్చేస్తున్నారు. ఇదివరకెవరినైనా పిలిస్తే పలికేవారుగూడా గాదు; ఇప్పుడు వాళ్లే స్వయంగా స్వచ్ఛందంగా వస్తున్నారు।

తర్వాత కొద్దికాలానికి, మా ఎమ్టియెస్ కార్యకర్తలూ, కార్మికులూ మాస్కోలో జరిగే సమావేశానికి రావలసిందని ఆహ్వానం వచ్చింది. నాస్త్యానిగూడా పంపుతారని అనుకున్నాం. కాని, వున్నట్టుండి, ఆ ఆహ్వానం ఫద్జనోవ్‌కీ, ఫెద్యాకీ, నాకూ మట్టుకేనని తెలిసింది. పార్టీ సెక్రెటరీ ఏదో పనిమీద కేంద్రం వదలి వెళ్లిపోయాడు. ప్రాంతీయ కేంద్రంలో వున్న మిగతావాళ్ళకేమో మా యింటిగుట్టు తెలియదు. నాస్త్యా అంటే యీ మధ్యనే వచ్చింది మా ఎమ్టియెస్‌కి; మేమంటే పాతకాపులం ఫద్జనోవ్ వుండడం మా ఎమ్టియెస్ 'అదృష్టం' అనంటున్నారు అందరూ యిప్పటికి చాలాకాలంనుంచీ. అసలు విషయం యింకొకటికూడావుంది; ప్రాంతీయ కేంద్రంలో ఫద్జనోవ్‌కి చాలామంది స్నేహితులున్నారు. అవసరమైన స్థానాల్లో, అవసరమైన వ్యక్తులతో స్నేహం ఎలా చేసుకోవాలో ఆయనకి బాగా తెలుసు. ఎప్పుడు ఎక్కడ ఏ దారంలాగాలో కూడా బాగా తెలుసు, ఫెద్యాగాని, నేనుగాని యీ ఆహ్వానాల విషయం. అవి వచ్చేవరకూ ఆలోచించనేలేదు, అంతా ఐపోయిం తర్వాత ఏమనుకుంటే మాత్రం ఏం ప్రయోజనం?

అలాంటి సందర్భాల్లో ఫద్జనోవ్ పొరపాటునకూడా బరాబరగా వుండేవాడుకాదు. ఆ పరాకాయన ప్రకృతికే విరుద్ధం అసలు। అర్జెంటుగా పట్టణంలో పని వచ్చిపడుతుంది. ఏదోవొకవంక. నా అనుమానం కలగడానికక్కూడా అవకాశంలేదు. పట్టణానికెళ్తాడు. అవసరమైనవ్యక్తుల్ని కలుసుకొంటాడు. తన పనేమిటో చెబుతాడు. తిరిగొచ్చిం తర్వాత నాతో ఒక్క ముక్కగూడా చెప్పడు. తర్వాత చాలా కాలానికి గాని తెలిసిరాదు మాకు, యీయన పట్టణం వెళ్ళినప్పుడంతా 'ఏమిచ్చుకుని' వచ్చాడని. ఆయన్నీ, ఫెద్యానీ, నన్నూ పిలిచారు మాస్కో సమావేశానికి. నాస్త్యాని పిలవలేదు. కారణం ఆవిడ ఎమ్టియెస్ కొచ్చిం దీ మధ్యనే కాబట్టి;

అదీగాక యీయేడు చీవాట్లుగూడా తిన్నమనిషి. ఫెద్యా, రూఛెంకో, నేనూ కలిసి తీవ్రంగా ప్రయత్నించాం మాస్కో ఆహ్వానం నాస్త్యాకికూడా యిప్పించాలని. లాభంలేదు. ఆలస్యమై పోయింది. వెళ్ళేవాళ్ళ పేర్లన్నీ ఎప్పుడో పంపించేశారు మాస్కోకి. ఆయా పేర్లు వ్రాసిన టికెట్లుగూడా వచ్చేశినై. ఇక మేం చేయగలిగిందేమీలేదు. ఫర్జనోవ్, ఫెద్యా, నేనూ బయల్దేరాం మాస్కోకి,

అలాంటి సమావేశంలో యిదివరకెప్పుడూ పాల్గొనలేదు నేను. వేదికెక్కి వుపన్యాసం యివ్వవలసొస్తుందని అసలే అనుకోలేదు. ఏదో కొద్దిపాటి విజయం సాధించినా, యిక్కడ కూర్చున్నవాళ్ళందరికీ తెలియజెయ్యవలసినంత విశేష మేదో సాధించాం అని నేననుకోనేలేదు, ఆ సమావేశం ప్రారంభమయ్యేవరకూ. అక్కడికి వొచ్చినవాళ్ళలో హెక్టారుకి రెండున్నరా మూడు టన్నుల చొప్పున పండించిన ఎమ్టియెస్ ప్రతినిధులు గూడా వున్నారు. మా ఎమ్టియెస్ పండించింది ఒకటిన్నర టన్ను. అందుకనే నేనంత ఆశ్చర్యపోయింది. ఉప మంత్రి నన్ను పిలిచి, 'మీ రా విజయాలెలా సాధించారో చెప్పండి' అని అన్నప్పుడు.

ఉన్నట్టుండి నా బుర్రలో కనేకాలోచన లొచ్చిపడినై ఒకేసారి, ఎలా సాధించాంఅంటే? పైకిచెప్పుకోడానికేమీ కన్పించలేదు. ఆ క్లోవర్ గడ్డి వెయ్యడానికి బదులు జొన్న వేశాం. మంచు ప్రాంతాల్లో సమచతురం మళ్ళపద్ధతి వ్యవసాయాన్ని అమలుపరచిచూచాం. పొలాల కెరువులు తోలాం. విత్తనాల్ని సంసిద్ధంచేశాం, చల్లాం. వాదించుకున్నాం. పోట్లాడుకున్నాం. కీచులాడుకున్నాం. పిచ్చెత్తినట్టటూయిటూ ఆసులో కండెల్లా తిరిగాం. ఈ సంగతులన్నీ ఏమని చెప్పేది? ఎలా చెప్పేది? అర్థంకాలేదునాకు.

'నీ దగ్గర లెక్కలున్నై గదా, అవి చెప్పు,' అన్నాడు ఫర్జనోవ్.

నిజమేనన్నా, దగ్గరం కూర్చుని లెక్కలుతీసి చూశాం. దేనికది విడమరిచి, ఉపన్యాసం తయారు చేశాం.

నేను సమావేశంలో చదవబోయింది ఉపన్యాసమే. ఇంతలో ఉపమంత్రి అడ్డొచ్చాడు: 'ఆ శాఖల సంగతట్లా పెట్టి, ఆ అంకెల వెనకవున్న విషయమేమిటో చెప్పండి మాకు' అన్నారాయన.

నిజమే. ఆ అంకెల వెనకవున్న రహస్యమేమిటి? బుర్ర వేడెక్కింది.

ఇంతకు ముందా ప్రశ్న నేను వేసుకోలేదని కాదు. కాని. పని హోత్తిడిలో. ఎప్పటికప్పుడేదో ఒక ముక్క సమాధానం చెప్పుకుని సంతృప్తిపడ్డాను; అంతేగాని మొత్తం విషయం అంతా, ఒకేసారి, సమాకూర్చుకుని సమాధానం చెప్పుకోలేదు.

చివరికి. ఆ సమావేశంలో. వున్నట్టుండొక్కసారి. తుపాకి పేలినట్టు పేలిందా ప్రశ్న: అందరిముందునూ.

మొత్తంమీద గాభరాపడిపోయాను నేను. పనిలో తలమునకలేమో. చుట్టూవున్న పరిస్థితులంత వేగంగా పరివర్తనమౌతూంటే. ఆ శాఖల వెనకా, అంకెల వెనకా ఏముందో నిలుచున్నపాటున చెప్పేయ్యాలంటే సాధ్యమామరి? మూడు మాటల్లో జవాబు చెబితే సరిపోతుందా అప్పుడు? సరిగ్గా నా ముందు. మొదటి పంక్తిలోనే కూర్చునున్నాడు ఫొటోవ్. ఆజానుబాహువేమో. ఆ రాంబందు తల అందరి తలలకంటే ఎత్తుగా కనిపిస్తోంది. ఎన్ని వేలమందిలో వున్నా సరే. యిట్టే గుర్తుపట్టేస్తా ఆయన్ని. నావంక చూచి, చిరునవ్వు నవ్వాడు: 'నీ తెలివితక్కువ పరాస్త్రా బయట పెట్టుకుంటున్నావు. నీ బదులు నన్ను పిలిస్తేనా ఉపన్యసించటానికి!' అంటున్నట్టుందా చిరునవ్వు.

ఇంతలో ఉపమంత్రి ఇంకొక ప్రశ్న వేశాడు: 'మీ ఎమ్.టి.యెస్.ని పైకెలా తెచ్చారు?' అని అంటూ. దేన్నో పట్టలపంతాన పైకిలేపుతూన్నట్టు చేతులు పైకి వూపుతూ ప్రోత్సహించాడు. అప్పుడు నా కనులముందు మీరిప్పుడెలా కూర్చున్నారో. అంత స్పష్టంగానూ కనిపించినై నాస్త్యా హస్తాలు. మమ్మల్ని పైకితేసిందా చేతులే! ఆవిడ రాకపూర్వం మా బ్రదుకంతా బండబారి పోయుండె. ఆవిడొచ్చింది. ఆ వూబిలోంచి మమ్మల్ని పైకిలాగింది! ఒక్కొక్కసారి మేం సహాయ నిరాకరణంగూడా చేశాం:

ఐనా ఆవిడ పూటుకోలేదు. తనపని తను చేసుకుంది. ఐనా, యిప్పుడిక్కడికి మేం ముగ్గురమే వచ్చాం. ఫర్గనోవ్ ముందువరసలో హాయిగా కూర్చునున్నాడు. నాస్త్యా, ఎక్కడో దూరాన, స్టెప్పీలో ఒక దళం దగ్గర్నుంచింకొక దళానికి పరుగెత్తుతూ వుంటుంది!

అంతా కళ్ళకు కట్టినట్టనిపించింది: నాస్త్యావచ్చిన నాటినుంచీ మాస్కోకొచ్చే మాకు ఆవిడ వీడ్కోలిచ్చే నిమిషంవరకూ జరిగిందంతా ప్రతి చిన్న విషయమూ, కళ్ళకు కట్టినట్టు కనిపించిందప్పుడు నాకు.

మానవుడి మనసే అంత; ఒక్కోసారి వేలకొద్దీ ఆలోచనలొకేసారివొచ్చి ముసురుకుంటై! సమచతురం మళ్ల పద్ధతి, విత్తనాలు జల్లడం, యంత్రాల దళాలు, విత్తనాలు సెర్గీ సెర్గెయెవిచ్‌తో సంభాషణ, ఫర్గనోవ్‌తో పోట్లాట...అన్ని ఆలోచనలూ ఒక్కసారే వచ్చి పడినై; ఐనా, నోటమాట పెగల్లేదు! అవన్నీ మూడు నాలుగు మాటల్లో క్లుప్తీకరించి చెప్పడం ఎలా సాధ్యం? ఏది మొదలని ప్రారంభించేది? ఎక్కడని మొదలెట్టను! ఆలోచనలన్నింటినీ ఒక వరసలో పెట్టుకోవడం చేతగాకపోయె! ఇంతలో ఉపమంత్రి మళ్ళీ అన్నాడు. 'అదంతా ఎలా జరిగిందో చెప్పండి.'

ఎలా జరుగుతాయని? మీరుచెప్పగలరూ? ఒక్కోసారంచరికంటే ఉత్తమ కార్యకర్తకి చీవాట్లు తగులుతై. వెళ్ళి స్టెప్పీలో ఒక మూలకూర్చుని ఏడుస్తాడు; చెప్పుకుంటే వినేందుకుగూడా ఎవరూ వుండరు. ఆ ఉత్తమ కార్యకర్త సంగతెవరికీ తెలియదు. అతని ప్రతిపక్షం మట్టుకు వీరుల్లావచ్చి ముందువరసల్లో కూర్చుంటారు! కొన్ని కొన్నిలాగూడా జరుగుతైమరి. ఇవన్నీ చెప్పేదాలక్కడ? ఆలోచన కొనసాగనంటూ లేకపాయె, ఏంచెప్పడానికైనా నోట మాటలు తేలేకపాయె.

[illegible] అలాగే నిలబడిపోయాను. ఆలోచించే శక్తిలేదు. మాట్లాడే సామర్థ్యంలేదు. నా ప్రక్కనే, వేదికమీద, ప్రభుత్వసభ్యులు కూర్చునున్నారు. ఎదురుగా వేలాది ఉత్తమరైతు లున్నారు. దీపాల

వెలుతురులో కళ్లు చిరతలారిపోయినై; విలేఖరుల కామెరాల క్లిక్ క్లిక్ లతో చెవులు గింగురుమనిపోయినై.

నిజంగానే గాభరా వేసింది. ఏం మాట్లాడాలో పాలుపోలేదు. ఎలా మాట్లాడాలో అర్థంకాలేదు. ఏమందాం? మా ముఖ్య గ్రామీణార్థిక వేత్త చాలా బొడవగల మనిషి, శక్తిసామర్థ్యా లున్నమనిషి అని అననా? అది చాలదే! ఏం చెయ్యాలిక? అదిగాక, నా ప్రక్కనే, వేదిక మీద ప్రభుత్వసభ్యు లున్నారు: మా పురోగమనానికి దారులుతీసే సభ్యులు, దారిచూపే సభ్యులు. పురోగమనం! నేను పురోగమనం మానేసి యీ కుంటుపట్టులాడడం ఏమిటి! ఆ సభ్యుల ముందూ, నా ముందు కూర్చున్న వేలాది ఆసక్త రైతాంగం ముందూ నిలబడే సాహసం కూడా లేకుండాపోయింది నాకు. సిగ్గు ముంచుకొచ్చింది. నా అనుభవా లేమిటో తెలియజెప్పమని కోరారు వాళ్లు. చెబుతానని అను కున్నారు. నేనేమో అంకెలూ; ఖాతాలూ చెప్పేటందుకు సిద్ధపడి వచ్చాను. పశ్చాత్తాపపడుతూ ఉపన్యసించవలసింది నేను; కాని అంత త్వరగా మార్చివేయడం నావల్ల కాలేదు ... సరే. ఒక్కమాటకూడా నోరువిప్పి చెప్పలేకపోయాను, ఇంకేం చేస్తాను, వేదిక దిగి వచ్చేశాను.

కాని, నా మనసులో ఒక మాటపుట్టు కనుక్కున్నాను: ఇదే చివరి అవకాశం కాదుగదా నాకు యీ వేదిమీదికి రావడానికి! మళ్ళీ రాదూ ఆహ్వానం! అప్పుడు, అంతా ముందుగా పూర్వమే సిద్ధం చేసుకుని వస్తాను. అప్పుడు వున్న విషయమంతా చెప్పేస్తాను నిష్కపటంగా. అప్పుడుగాని అర్థంకాదు అందరికీ, యీ పనులింత తేలికగా పూర్తి కావని; అప్పుడుగాని మేం జేసిన తప్పులు జరగకుండా జాగ్రత్త వహించరు!

పైప్ తీసి వెలిగించాడు ఛాలికోవ్; కాని ఎందుకనో, పూర్తిగా గుక్క లాగకుండానే నోట్లోనుంచి పైప్ బయటికి తీసేశాడు.

ఇది ఫర్జనోవిచ్చిన బహుమానం. ఆ వేదిక మీదలా యెందుకు కంగుతిన్నానో, యెందుకు మాట్లాడలేకపోయానో అర్థంకాలే దాయనికి. ఊరికే ఎగతాళి చెయ్యడం మొదలెట్టాడు. కాని, ఫెద్యా అర్థం చేసుకున్నాడు.

ఆ రాత్రి ఫెద్యాకూ, నాకూ నిద్రపట్టలేదు. వేకువవరకూ అలాగే మాట్లాడుతూ కూర్చున్నాం. మేం వుంది మాస్క్వా హోటల్లో. మా గది కిటికీలోంచి రెడ్ స్క్వేర్ కనిపిస్తుంది. ఇంకా బాగా కనిపించడానిగ్గాను గదిలో లైటార్పి, కిటికీలో కూర్చున్నాం. క్రెమ్లిన్ గూడా కనిపిస్తోంది. స్పాస్కాయా టవర్ మీద గడియారం మెరుస్తోంది. గడియారం ముళ్ల కదలడంగూడా కనిపిస్తోంది మాకు. గంటలు గడిచిపోతున్నై; మా మాటలు తరగడం లేదు. ఉపమంత్రి వేశిన ప్రశ్నకి సరైన సమాధాన మేమిటా అని మా ఆలోచన. ఈ లెక్కలవెనక వున్నది ఏమిటీ అని.

'అదెలా జరిగిందో నా కర్థం కాందే!' అన్నాడు ఫెద్యా; 'అన్నేళ్లు కలిసి పనిచేశాం మనం అందరం. నలుగురు స్నేహితులం. నలుగురు నాయకులం. క్లోవర్ గడ్డిపొలాల్లో పని తిరిగాం. ప్రతిరోజూ పదిసార్లన్నా తిరిగేవాళ్ళం ఆ ఎసెస్‌హెచ్-6 విత్తనాల యంత్రాల చుట్టూ. ఐనా మనమేమీ కనిపెట్టలేకపోతిమి! ఇంతలో, అప్పటి కప్పుడు కాలేజి గేటుదాటొచ్చిన ఆడపిల్ల చెప్పవలశొచ్చింది మనకి, కేంద్ర కమిటీ వుద్దేశం ఏమిటో. ఎందుకు జరిగిందలా?'

నేను ఆలోచించిందీ అదే. ఎందుకని? మా బుద్ధిమాంద్యం వల్ల ఆ పడుచుదనంలో. ఎందుకనోగాని ఫెద్యా, నేనూ మా ముకుదాడు ఫర్జనోవ్ చేతుల్లో పెట్టాం.

కాని ఫర్జనోవ్....ఫర్జనోవ్‌కి అనుభవం లేదనగలమా? తెలివి తేటలు తక్కువనగలమా? విజయాలు సాధించాలన్న కోర్కె లేదన గలమా? మరి యిన్ని వున్నా, ఆ మార్గాన్ని నాస్త్యాయే యెందుకు చూపగలిగింది? ఆయనే ఎందుకు చూపలేకపోయాడు?

ఆలోచించాం.

'చూడు, చూడు! కాపలా మారుస్తున్నారు!' అన్నాడు ఫెద్యా.

నిజమే. సంచీలో నాయకులిద్దరి సంతకాలున్నాయి. వార్నాక్ 'ఆగండి!' అని ఆజ్ఞాపించాడు ఒక పెద్దమనిషి అనాడు. తర్వాత ఎవరి స్థలాల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. కదలకుండా మెదలకుండా నిలబడ్డారు, ఆ వృత్తాంతం అంతటినీ చెప్పుతూ ఉండలేదు ఫెద్యాగాని, నేనుగాని.

తర్వాత. 'చెదురులేని బెదురులేని యూనియన్' .... అంటూ రేడియో. అది వింటూ, పొంగిపోతూ, ఆలోచించుకుంటూ కూర్చున్నాం.

'ఆయనా! ఆయనొక కాం-ట్రా-క్టర్ కూడా' అన్నాడు ఫెద్యా ఉన్నట్టుండి. ఆ మాటలుగూడా స్పష్టంగా వొత్తొత్తి పలికాడు కోపంగా.

ఒక నిముషం సేపటిదాకా, అతని ఆలోచన లెటుపరుగెత్తుతున్నాయో అర్థంకాలేదు నాకు.

'కాంట్రాక్టరేమిటి? ఎందుకని?'

ఫెద్యా విశదీకరించాడు:

'సైన్యంలో నీ కేదైనా పతకం లభిస్తే, నేను సోవియట్ యూనియన్‌కి సేవచేస్తున్నానని అంటావు. ఏ కమ్యూనిస్టయినా, ఏ నాయకుడయినా అనే మాటలవి. మనం అందరం సోవియట్ యూనియన్ సేవకులం; సోవియట్ ప్రజల సేవకులం. కాని, యీయన సోవియట్ ప్రజలకి సంబంధించినంతమట్టుకు కాంట్రాక్టరు. కాంట్రాక్టరు ప్రజల్ని లక్ష్యంచెయ్యడు: అతనికి కావలసిందల్లా చేతనైనంతవరకు, వీలున్నంతవరకు వాడుకోవడం: ప్రజలు చిటికెనవ్రేలందిస్తే, శిరస్సుమీదికెక్కి కూర్చోవడం.'

'ఆయనా తెలివితేటలు కలవాడు, చురుకైనవాడు. పనిగూడా బాగానే చేస్తాడు!' అని అన్నాను నేను.

'పని!' అంటూ చీదరించుకున్నాడు ఫెద్యా: 'ఏం పని! దమ్మిడీ యెత్తు పనిజేసి రూపాయెత్తు ప్రతిఫలం కోరితే? అదీ పనేనా! కాంట్రాక్టర్లలో గూడా అనేకరకాల వాళ్లుంటారు. ఒక్కొక్కరకం మనుషు లొక్కొక్కరకం ప్రతిఫలం కోరుకుంటారు, కొందరికి డబ్బుకావాలి,

మరికొందరికి ప్రశాంత వాతావరణం కావాలి. ఇంకొందరికి కీర్తి కావాలి. ఈ మూడు రకాల్లో ఎవ్వరూ పని కావాలని మట్టుకు కోరుకోరు; పని జేసినట్టు కనబడడం తేలిక. పనిజెయ్యడం కష్టం. అందులో కొందరు తెలివితేటలుగలవాళ్లుంటారు. చురుకైనవాళ్లుంటారు ఉపయోగించే వాళ్ళూ వుంటారు. నేను కాదనడంలేదు. కాకపోతే ఒకటే యిబ్బంది: వాళ్ళ తెలివితేటలవల్ల లాభం ఎక్కడ అంతమౌతుందో, నష్టం ఎక్కడ ప్రారంభమౌతుందో కనుక్కోవడం మట్టుకు మహాకష్టం.'

ఫెద్యా చెప్పే మాటలు వింటూంటే, అదీ నిజమే ననిపించింది నాకు. ఫర్దనోవ్ వల్ల ఎమ్‌టియెస్ కెప్పుడు ప్రయోజనం కలిగిందో, ఎప్పుడు నష్టం కలిగిందో చెప్పడం కష్టమే. మా చుట్టుప్రక్కల వాళ్ళందరికంటే ముందు పంపించేవాడు మా దళాన్ని పొలాల్లోకి. అది మంచా? చెడ్డా? ఏమో. అయినా గూడా ప్రశంసలు పొందాం అందుకు. కాని మా పొలాల్లో జరిగిన పని చుట్టుప్రక్కల పొలాల్లో పనికంటే ఏమీ మెరుగుమట్టుకు కాదు, వాళ్ళ యంత్రాల్లాగానే మా యంత్రాలూ వృధాగా నిలబడి వుండడం తప్పలేదు. పొలాల్లోకి యంత్రాల్ని పంపేవాడు, నివేదిక తయారుచేసేవాడు, పత్రికా విలేఖరులకి కబురుపెట్టేవాడు. తరవాతిక, పత్రికల్లో ఫొటోలు. అధికారవర్గాల్లో ప్రశంసలు. గోట మీటి నట్లుంతా అంత త్వరితంగా ముగిసేది. అలా కాకుండా, పొలాల్లో మంచి పంట చూపించాలంటే రాత్రింబవళ్లు పనిజెయ్యాలి; చెమటోడ్చాలి. ఆ శ్రమకీ, ఆ చెమటకీ ఫలితం ఎప్పుడు కనిపిస్తుందో తెలియదు. ఎప్పుడు పైవాళ్ళు గుర్తించి వీపు నిమురుతారో తెలియదు ....

నేనిలా ఆలోచించుకుంటూనే వున్నాను; ఫెద్యా మళ్ళీ మాట్లాడ్డం మొదలెట్టాడు:

'ఆ కాంట్రాక్టు పనిలోగూడా అతిచిన్న కాంట్రాక్టరాయన. కీర్తి దాహం అపరిమితం; ఆ కీర్తి సరిహద్దులీ జిల్లా ఎల్లల్ని దాటిపోయినా సరే. కోపెక్ దొరుకుతుందంటే చాలు, మైలుదూరం పరుగెత్తమన్నా పరుగెత్తుతాడు. అంతేతప్ప, నడుం వంచి పనిజెయ్యడు.'

'నాస్తాస్యా వాసిల్యెవ్నాని గురించేమిటి నీ వుద్దేశం?' అనడిగా నేను ఏమంటాడో విందామని.

'ఏం. ఆవిడెలా పనిచేసిందో చూడలా నువ్వు? సమిష్టి క్షేత్రాల రైతుల సమస్యలకీ. అవసరాలకీ ప్రధానస్థానం యిచ్చిందావిడ. మానేజ్‌మెంట్ ప్రశంసలకోసమని ఆవిడ పాకులాడనూలేదు; వాళ్ళకోపం వచ్చిందనో. వస్తుందనో వెనకాడనూలేదు. ఆవిడా కొన్ని పొరపాట్లు చేసింది. నిజమే. కాని. ఆ పొరపాట్లుగూడా అసలు పని కద్దుతగ్గలేదు. ఆవిడ పథకమూ, లక్ష్యమూ పార్టీ పథకంతోనూ, లక్ష్యంతోనూ ఏకీభవించడం చూచి మనం యిద్దరం ఆశ్చర్యపోయాం; గుర్తులేదూ నీకు? చివరికా క్లోవర్ గడ్డి. సముచితతరం మళ్ళపద్ధతిలాంటి ప్రత్యేక కార్యక్రమాల్లోగూడా పార్టీ లక్ష్యంతోనూ, సాధనంతోనూ ఏకీభవించినై; మనం విస్తుపోయాం కాని అందులో విచిత్రం ఏమీలేదు నిజంగా ఆలోచిస్తే. ఎందుకనంటే. నిస్వార్థంగా ప్రజలకి సేవచెయ్యాలని మనోవాక్కాయకర్మలా నిర్ణయించుకున్నతర్వాత. ఆ కార్యక్రమం యిక పార్టీ ప్రణాళికతో ఏకీభవించక తప్పదు. అదొక తిరుగులేని సూత్రం. ఇకపై చూచి విస్తుపోవలసిన అవసరం ఏముంది?'

ప్రజాసేవకుల్ని గురించీ. కాంట్రాక్టర్లని గురించీ అలాగే మాట్లాడుకుంటూ కూర్చున్నాం చాలాసేపు. క్రమక్రమంగా. ప్రతి సంగతీ సుస్పష్టంగా గోచరించింది.

వాళ్ళిద్దరూ ఒకళ్ళ కొకళ్ళంత వ్యతిరేకంగా ఎందుకు ప్రవర్తించేవారో అర్థమైంది. నాస్త్యా అంటె ఫర్జనోవ్ కంత అకారణ ద్వేషం ఎందుకు కలిగిందో అర్థమైంది. నాస్త్యా ఆయనంటే అంత వుదాసీనంగా యెందుకుండేదో అర్థమైంది.

ఆవిడ శక్తి సామర్థ్యాల్నాయన గుర్తించాడు, ఏ ప్రయత్నమూ లేకుండానే. ఆ శక్తిసామర్థ్యాల కడ్డుతగిలితే చాలు. తాను సర్వనాశనం కాక తప్పదని గ్రహించాడు అన్నీ గ్రహించాడు కాని ఏం లాభం? ఆవిడ ఆధిక్యతని అంగీకరించలేకపొయ్యాడు.

తన జీవితమంతా సుఖంకోసం. డబ్బుకోసం. పేరుకోసం. ప్రతిష్ఠకోసం కష్టపడుతూ వచ్చాడు. ఇక్కడ కొంతా. అప్పుడు కొంతా కూడబెట్టుకుంటూ వచ్చాడు. ఆ కూడబెట్టుకున్నది చూచుకుని గర్విస్తున్నాడు. సంతోషిస్తున్నాడు. ఇంతలో ఒక చిన్న పిల్లొచ్చింది రంగంలోకి. కన్నుమూసి తెరచేలోపల. తనకంటే మిన్నయై కూర్చుంది! ఇంతకాలం కష్టపడి తాను సంపాదించుకున్న పేరు ప్రతిష్ఠ అన్నిటినీ మించిపోయిందావిడ. కానలా మించిపోయినట్టుగాని, మెరుగైనట్టు గాని నలుగురికీ తెలియాలని గూడా అనుకున్నట్టు లేదావిడ. ఆ పేరు ప్రతిష్ఠలకోసం తానింత తపించడమేమిటి. ఆవిడంత నిర్లక్ష్యంగా వుండడమేమిటి! తనకు రావలసిన ప్రశంసలన్నీ ఫర్జనోవ్ పేర పోతున్నా పూరుకుంది నాస్త్యా. ఆ పొంగిలించిన ధనాన్ని చూచుకుని ఉబ్బి తబ్బిబ్బౌతున్నాడాయన. అతి జాగ్రత్తగా కాపాడుకుంటున్నాడు దాన్ని. ఐనా అది తనది కాదనీ. నాస్త్యాదనీ తెలుసు. ఎందుకనో గాని, బహుశా చివరకు మూలాన్నైనేమో. ఇది నాదేనని అనలేదావిడ. కాని, కావాలనుకున్నప్పు డాసొత్తును స్వాధీనం చేసుకోగలదు. అది చాలదూ ఆయన కంత పిచ్చి రేకెత్తించేందుకు? నాస్త్యా కెదురుపడితే చాలు, ఆయన సర్వస్వం ఏటిపాలై పోవచ్చును.

వాళ్ళిద్దరికీ హస్తిమశకాంతరం వుంది. ఒకళ్ళు పగలైతే, యింకొకళ్ళు రాత్రితో సమానం. నాస్త్యా తనకంటే గొప్పదీ అని అంగీకరించాడంటే, తా నెందుకూ పనికిమాలినవాణ్ణని ఒప్పుకున్నట్టే. ఆవిడకి తెలివితేటలున్నై అని అన్నాడంటే. తన దొట్టి తెలివితక్కువని చెప్పినట్టే. ఆవిడ జీవన విధానం సక్రమమైనదని భావించితే, తా నింత వరకు చేసిన పనులన్నీ చెడ్డవని అనుకున్నట్టే. ఆ పని చెయ్యగలడా?

ఇక ఆవిడ? ఆయన అల్పుడనీ. నిస్సహాయుడనీ తెలుసు. తన కాయనేమైనా అపకారం చెయ్యగలడా? ప్రక్కనే నడుస్తూంటే బస్సు నవి లేవగలదా? బస్సుమంటే అననీ! తనకి లెక్కుంటేగా. దారిలో పడిన పేడకడిని చూచి భయపడతారా ఎవరైనా? ముందొక విశాల రాజమార్గం పరచుకుని వున్నప్పుడు. నాస్త్యా ముందున్నదదే; విశాల మైన రాచబాట!

ఇప్పుడర్థమైంది నాకు స్తెంకా, వెంకాల్లాంటివాళ్లు ఫర్జనోవ్ ఆజ్ఞల్ని ఎందుకు శిరసావహించేవా. ఆయనా తనలాంటివాడేనని తెలుసు వాళ్ళకి; కాకపోతే, తమకంటే యింకా గొప్పవాడు!

ఫర్జనోవ్, నిజంగానే మొదటిరకం కాంట్రాక్టరు. అంత శక్తి సామర్థ్యాలున్నా, సాహసం వున్నా అత్యాశ వున్నా కలలుగనే కోరికల్ని సాధించలేకపోవడానికి కారణం అదే. ఎంత నటనచేశినా, ఎన్ని ఉపన్యాసాలిచ్చినా అంతే; వెళ్ళిపోయిన మర్నాటే మరిచిపోతారాయన్ని, తప్పదు. కాని, నాస్త్యా? ఎంత చిన్నదైనా కానివ్వుగాక, కలకాలం గుర్తుంటుంది.

ఫర్జనోవికి క్రెమ్లిన్ కెళ్ళడు. కాని, నాస్త్యా వెళ్తుంది. ఒకసారి గాదు, అనేకసార్లు. పార్టీగూడా ఆవిడలాంటి వ్యక్తుల్ని వెంటనే గుర్తించగలదు. అలాంటివాళ్ళే కావాలి పార్టీకి. దేశాని కుపయోగపడేదీ, అపూర్వ శ్రేయస్సును సమకూర్చేదీ ఆవిడలాంటి వాళ్ళే.

ఆనాటి రాత్రి యింకా అనేక విషయాలు విస్పష్టమైనై మాకు. అనేక సంగతులు జ్ఞప్తికి తెచ్చుకున్నాం. మా ప్రవర్తనని తలుచుకుని మేమే సిగ్గుపడిపోయాం. మా సంగతి మేం మాట్లాడుకోవాలన్నా కష్టమే ననిపించింది.

'ఫర్జనోవ్ సంగతట్లా అట్టిపెట్టు; మనం చేసింది మాత్ర మేమిటి?' అన్నాడు ఫెద్యా; 'నేను మాత్రం ఏం చేశాను? చౌకబారు పేరు కావాలనే కోరికేమైనా వుందా నాకు? ఏమైనా లాభం రావాలని కోరుకున్నానా? పేరుకోసమేమైనా పాకులాడానా? మనస్ఫూర్తిగా, నిష్కపటంగా పని చెయ్యాలని అనుకునేవాడినే కదా! పార్టీ స్కూల్లో తెల్లవార్లూ పుస్తకాలు చదువుతూ కూర్చునేవాడిని ఎందుకు? డిప్లొమా కనా? కాదు, నాకా పుస్తకాలంటే యిష్టం కాబట్టి. సిద్ధాంతంలో నాకు మించినవాళ్ళు లేనేవాళ్లు. కాని ఆచరణలో ఏం చేశాను? కనబడుతూనే వుందిగదా! నాకు తెలియకుండానే, నేనూ అదేమార్గం పట్టాను కాంట్రాక్టర్ మార్గం. నా కిప్పుడు ఫర్జనోవంటే యింతకోపం రావటాని క్కూడా కారణం అదేనేమో బహుశః. నా మనస్కృతా దాయన కప్పగించి

కూర్చున్నా కదూ. అందుకని మన ప్రధానాలోచన లేమిటి అప్పుడు? మన ఎమ్‌టిఎస్ అన్నిటికంటే గొప్పదని అనిపించుకోవాలి; యంత్రాల బాగుచేత పూర్తయ్యీ కావడంతోనే రిపోర్టులు పంపేశామా. లేదా? ప్రాంతీయ కేంద్రం ఆదేశాల ప్రకారం నిర్ణీత ప్రాంతంలో క్లోవర్ గడ్డి వేశామా, లేదా? అంటే ఏమిటన్నమాట? ప్రాంతీయ కేంద్రం ప్రశంసలు పొందడం మనం విశ్రాంతిగా వుండడం – ఇవి రెండే మనం కోరుకుంది. కాని మన విశ్రాంతివల్లా. పరువు ప్రతిష్ఠలవల్లా. మన మీదాధారపడిన ప్రజానీకానికి ఎంతనష్టం వాటిల్లుతోందీ గమనించనేలేదు మనం.'

ఫెద్యా చెప్పిందక్షరాలా నిజం. నిజంగానే మేమూ సంగతి ఆలోచించిన పాపాన పోలేదు. పెద్ద పొరపాటు చేశాం. క్రెమ్లిన్ సమావేశం ఐంతర్వాత గుర్తించాం అదెంత పెద్ద పొరపాటైందీనీ అందువల్ల కలిగిన విషమ ఫలితాలకి బాధ్యత మాకుగూడా వున్నదని అప్పటికిగాని గుర్తించలేదు మేం.

ఇప్పుడు తెలుస్తోందిగా మీకు? ఆ లెక్కల వెనకా, ఆ ఖాతాల వెనకా ఏమున్నదో చెప్పమని అడిగారే క్రెమ్లిన్ సమావేశంలో: ఇదీ వున్నది!

ఆవేళల్లా ఆలోచించాలోచించి తల దిమ్మెత్తిపోయింది. తెల్లవారుఝామున మూ ఇంటికి, కట్టుబట్టల్తోనే వెళ్ళి పడుకున్నాను పరుపు మీద. నాకు మెలకువ వచ్చేటప్పటికి వెలుగొచ్చింది. అప్పుడు సిద్ధమౌతున్నాడు ఫెద్యా పండుకునేందుకు. ఫెద్యాని చూస్తే, అంత వయసున్నట్టనిపించదు. కాని, ఇవాళ కనులచుట్టూ చక్రాలు; చెంపలమీద జీరలు.

'కానీ, తొందరగా పండుకో. లేకుంటే, నేను చూస్తుండగానే ముసలివాడవైపోయేట్టున్నావ్!' అన్నా నేను.

'నిజమే' అన్నాడతను, నావంక చూచి చిరునవ్వుతో, 'నా జుత్తంతా తెల్లబడిపోయిందేమో చూడొకసారి. దిగులుపడ్డ మనుషుల జుత్తు తెల్లవారేప్పటికి తెల్లనౌతుందంటారు!'

మర్చాము. క్రెమ్లిన్ బార్లి మెట్‌స్కీ హాలులో కలుసుకున్నాం ఫర్షనోవ్‌ని. ఆ హాలు జ్ఞాపకం వుందా మీకు? ఆ యెత్తయిన కప్పు. అదీ చాలా సొగసుగా వుంటుంది. ఏదో దానిపై మాట్లాడాలని చూచా డాయన. సమాధానాలు చెప్పాలన్నా మనసొప్పలేదు మాకు. గ్రహిం చాడు. కనుబొమలు కుంచించి. గోడ చూసుకున్నాడు. నాకు మరీ చిత్ర మంది ఆ హాలులో గోడ లక్షించినా. పైనుంచి క్రిందిదాకా సెయింట్ జార్జ్ క్రాస్ అశ్వికదళ సైనికుల పేర్లు చెక్కారు. అలాంటి గోడలమీద. అందమైన హాలులో తిరగడం చూశానుగాని ఒక్కరూ అనుకోవడం చూడలేదు. కాని. యీయనమట్టు నా గోడమున్నదే అందు కిన్నట్టు అనుకుని నిలబడ్డాడు.

'ఇకిప్పుడు నేను యురాల్స్ కి రావడం మంచిది కాదేమో? ఇక్కడి వాళ్ళందరికి నా గొప్ప తెలుసిప్పుడు. కావాలంటే, మాస్కో లోనే వుండిపోగలను' అన్నాడు కనుబొమలు చిట్లిస్తూ.

'సరే, వుండగలిగితే వుండండి' అన్నానేను.

నేనలా అంటానని అనుకోలేదాయన. కనులు పెద్దవిచేసి చూచి, నిటారుగా నిలబడ్డాడు.

ఇకాయన మా ఎమ్‌టియెస్‌లో కనిపించే అవకాశం లేదని అప్పుడే అనుకున్నాం యిద్దరమూ.

'తర్వాత పశ్చాత్తాపపడతారు, ఫర్షనోవ్‌ని మరిచిపోవడం అంత తేలిగ్గాదు' అన్నాడు ఫర్షనోవ్.

ఏమో, నాకేమీ నమ్మకం లేదు పశ్చాత్తాప పడతానని. మమ్మల్ని ఎప్పుడూ దారి ప్రక్కకి లాగే మనిషి. రోడ్డుమీద నడవనివ్వని మనిషి. అదీగాక ఆయన పెద్దగా పనిచేసేరకం కాదు: పనికంటే నటన ఎక్కువ. మా క్కావలసింది సీదాసాదాగావుండి, పనిజేయగలిగిన వ్యక్తి: యంత్రా లన్నీ సిద్ధంగా వున్నాయని చెబితే, నిజంగానే సిద్ధంగా వుండాలి. బాగుచేత పూర్తయ్యిందీ అనంటే, నిజంగానే పూర్తయ్యుండాలి. అలాంటి మనిషి మా క్కావలసింది.

చివరికి, ఫెద్యా నేనూ అనుకున్నదదీ. ఆ లెక్కల వెనకా, శాతాల వెనకా వున్నదేదో గ్రహించేందుకు చాలా సమయం పట్టింది మాకు; ఇక చాలు.

తెల్లవారుతోంది. రైలుపెట్టెలో దీపం ఆర్పేశాం. దానితోపాటు వస్తువుల రంగులుగూడా మారిపోయినై. పెట్టెనిండా నీడలు మిగిలినై. సింధూరవర్ణం దుప్పటి. వెల్వెట్ నలుపుకు తిరిగింది. అలెగ్జీ ఛాలికోవ్ వేసుకున్న నీలిచారల చొక్కా బూడిదరంగుకు మారింది. ఉన్నట్టుండి రైలప్పుడు మలుపుతిరిగేప్పటికి, పెట్టె అంతటా గులాబిరంగు వచ్చి పడింది. తెల్లని తలగడ లేతెరుపురంగు పులుముకున్నట్టుంది. ఉన్ని దుప్పటి చిక్కని వైన్‌లాగుంది. రైలుపెట్టె కిటికీ గాజుతలుపులో వేకువ వెలుగు ప్రతిఫలించింది

'వెలుగొస్తోంది' అంటూ నా వంక తిరిగాడు ఛాలికోవ్: 'ఇంతకీ యిదంతా మీ కెందుకు చెప్పానో తెలుసా ?' అనడిగాడు.

'ఎందుకు ?'

'మీరు దీన్ని గురించి వ్రాస్తారుగదా అని. క్రెమ్లిన్‌లో నేను గాభరా పడిపోయి, ఏమీ మాట్లాడలేకపోయాను. కాని, యిదంతా యిప్పుడింకెవరికి చెప్పగలను ? ఎప్పుడు చెప్పగలను ? ఎక్కడ చెప్పగలను ? ఐనా, చెప్పాలని వుంది. నా పొరపాట్లనుంచి యితరులు గుణపాఠాలు నేర్చుకోవడం మంచిది. మీరు రచయితలు....మా కథ వ్రాయండి ! వ్రాస్తారు కదూ ?'

'ప్రయత్నిస్తా !

నే నామాట అనగానే నమ్మేశాడు. హుషారు పడ్డాడు.

'పేరేం పెడ్తారు ?' అనడిగాడు వెంటనే.

'ఏమో.'

'నే చెప్పనా? ఒకానొక ఎమ్‌టియెస్ మానేజరూ; అతని అదృశ్య శత్రువైన గ్రామీణార్థికవేత్తల కథ అని అనండి.'

ఆ పేరు పెట్టడం నా కిష్టంలేదు.

'ప్రజా సేవకులకీ, కాంట్రాక్టర్లకీ సంబంధించిన కథ' అని అంటే బాగుంటుందేమో. అన్నాను.

'హొద్దొస్తు! అన్నాడు ఫాలికోవ్: 'ఆ సంగతి పుస్తకం పేరు చూడగానే తెలిసిపోగూడదు కథంతా చదవడం పూర్తయ్యాం తర్వాత పాఠకులే గ్రహించాలా సంగతి.'

పుస్తకాని కేంపేరు పెట్టాలనేది నిర్ణయించుకోలేకపోయాం అప్పటికప్పుడు.

మర్నాడంతా, సాధ్యమైనంతవరకు పెట్టెలో వుండకుండా అటూ యిటూ తిరిగాడు ఫాలికోవ్ బహుశా కుండపగలగొట్టినట్లన్నీ చెప్పేశానే అని సిగ్గుపడ్డాడేమో తెలియదు. తానెళ్ళి ప్రక్కపెట్టెలో కూర్చుని పేకాడ్డం ప్రారంభించాడు. నేనతను చెప్పిందాన్ని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను.

ఎమ్‌టియెస్ మానేజర్, ముఖ్య గ్రామీణార్థికవేత్త అన్న పదాలకి నిర్వచనం ఏమిటి? అవి ఆయా హోదాల్ని తెలిపేందు కుపయోగించే మాటలా? లేక, గ్రామికజీవితాన్ని తెలియజేసేమాటలా? ఆధికారిక కర్తవ్యాల్ని, పరస్పరం సంబంధాల్ని తెలియజేసే పదాలా? లేక, అలాంటి గ్రామిక జీవితంలో మానవజీవితాల అవినాభావ సంబంధ సంపదని తెలియజేసేందుకు తప్పనిసరై వుపయోగించే పదాలా?

పంటలు, పంటల వలయం, యంత్రవశం, విత్తనాల స్థితి ... ఇవన్నీ యేమిటి? మానవ ప్రకృతులా? మానవ భావసంపదా? మానవ భవితా?

అదీ నా ఆలోచన. క్రమేపీ ఆ ఆలోచనలన్నీ ఆగిపోయినై. ఆ ఆలోచనల ప్రతిబింబాలన్నీ మాసిపోయినై. ఇక మిగిలిన దొక్కటే ఆలోచన; ఒక్కటే రూపం—నాస్త్యా.

ఆ వాక్కు రూపంలో నే నింతకుమునుపు కలుసుకున్న అనేక మంది యువతీ యువకుల రూపాలు కలిసిపోయినై. కాని వాళ్ళ ఆంతర్యాల లోతులు గ్రహించలేను నేను.

ఒక్కొక్కరూ ఒక్కొక్కవిధంగా కనిపించారు :

పచ్చని పైర్లతో కళకళలాడే పొలాల్లో, ఆదర్శ సమిష్టిక్షేత్రాల్లో, ఆనందంగా సగర్వంగా పనులు చేసుకునే వాళ్ళని చూచాను.

ఉడుకు నెత్తురుతో వాగ్వాదాలు చేసేవాళ్ళని చూచాను.

తమ శక్తిసామర్థ్యాల్ని తామే గుర్తించలేక, చీకట్లో దారికోసం తచ్చట్లాడేవాళ్ళని, మొట్టమొదట్లో నాస్త్యాలా, మార్గం తడుముకుంటూ నడచేవాళ్ళని చూచాను.

పొరపాటు జరిగినపుడు, పరాజయం కలిగినపుడు దిగాలుపడి కన్నీరు కార్చేవాళ్ళని చూచాను.

బహుశా యీ నాస్త్యా కథ బహు కొద్దిమందిలోనే కౌతూహలం రేకెత్తించొచ్చునుగాక, ఐనా ఫర్వాలేదు. ఈ కథవల్ల నాస్త్యాలాంటి యింకొక యువతికి ప్రయోజనం కలిగినా చాలు; అదే పదివేల పెట్టు. ఈ కథ వ్రాయవలసిందే. తప్పదు.

ఈ కథని అంకితంగూడా వాళ్ళకే చేస్తాను !

నాస్త్యా మార్గాన్ననుసరించే యువతీ యువకుల్లారా ! మీ కిది అంకితం చేస్తున్నాను. మీకే సమర్పిస్తున్నాను !

నాస్త్యా గూడా మీలాంటిదే. ఆవిడ అనుసరించిన మార్గం రాజమార్గంలా వుంటి మీకుందు. మీరూ అనుసరించండా మార్గాన్ని. నాస్త్యా సాధించిన విజయాలు మీరూ సాధించండి. ఆవిడ కున్నంత పట్టుదల మీకూ వుంటే, లక్ష్యంలో ఆవిడ కున్నంత విశ్వాసమూ, నమ్మకమూ మీకూ వుంటే, ఆ లక్ష్యంకోసం అహోరాత్రులూ విసుగూ విరామం లేకుండామీరూ పాటుపడితే నాస్త్యా సాధించిన విజయం మీరూ సాధించ గలుగుతారు. సందేహం లేదు.

సత్యానికున్న శక్తే అలాంటిది. మహత్తరమైన దా శక్తి. బలహీనులికి బలం ప్రసాదిస్తుంది. నిస్తేజుల్ని తేజోమూర్తుల్ని చేస్తుంది.

పూర్వం ఒక సామెతుండేది: యుద్ధరంగంలో ఒక సైనికుడుంటే అతను సైనికుడే కాదు అని. ఆ సామెతని మనమెంత త్వరగా మరచిపోతే అంత మంచిది: తన రంగంలో ఏ మనిషి కా మనిషే ఒక సైనికుడు: ఇదీ యిప్పటి కొత్త సామెత. నాస్త్యా నేర్పిన సామెత యిదే.

తన రంగంలో ఏ మనిషి కా మనిషే ఒక సైనికుడు. ఎందుకనంటే నాస్త్యాకి ఏకాకితనమంటూ లేనే లేదు; ఆవిడలాంటి వాళ్ళవెనక పార్టీ వుంటుంది: అలాంటి అనేక రంగాల్లో, ఆవిడలాంటి యువతీ యువకులు లక్షలాదిగా పనిచేస్తున్నారు. వీరందరూ కలిసి ఒక అపూర్వ పోరాటాన్ని నడుపుతున్నారు తిండికోసం, శాంతికోసం, అనన్య సామాన్య సత్య విజయంకోసం.

ఇలా నాస్త్యాని గురించి ఆలోచించుకుంటూ కూర్చున్నాను; ఆరోజతి త్వరగా గడచిపోయింది. మర్నాడు ఖాలికోవ్ దిగవలసిన స్టేషన్ దగ్గర పడింది. అప్పుడు మళ్ళీ మాట్లాడ్డం ప్రారంభించాడతను నాతో:

నే న్చెబితే మీరు నమ్మరు కాని, నాకు నాస్త్యాని చూచినట్టే వుండదు: ఆఫీసులో కొస్తుంది, ఐనా చూచినట్టుండదు: లినోచ్కా కనుబొమల దగ్గర్నుంచి ప్రతీదీ యిదిలా వుంటుందని చెప్పగలను. కాని

నాస్త్యాని గురించి. అట్లా ఏమీ చెప్పలేను. అందంగా వుంటుందో లేదో గూడా చెప్పలేను అందంగా వుంటుందో లేదో తెలియదసలు నాకు; తెలుసుకోవాలనీ లేదు. ఆవిడ నా ఆఫీసులో కడుగుపెడితే చాలు; నే ననుకునే దొకటే: ఆవిడ అందంగా వుంటుందా వుండదా అనే విషయం అనవసరం నాకు. నా కంతకంటే అందమైన మనిషి మరి లేదు. ఇంతగా ఆవిణ్ణి గురించి ఆలోచించినా, యింతవర కర్థంచేసుకో లేకపోయా నావిణ్ణి నేను నన్ను గురించి ఏమనుకుంటుందో తెలియదు. నా కావిడ హృదయంలో స్థానం వుందో లేదో తెలియదు. ఇతర యువతుల్ని గురించైతే వెంటనే చెప్పేసెయ్యగలను వాళ్ళకి నేనంటే యిష్టం వున్నదీ లేనిదీ. కాని యీ ఆవిణ్ణి గురించి! ఒక్క ముక్క తెలియదు. నా ప్రేమలాంటి ప్రేమంటే వుదాసీనంగా వుండలేదులే అనుకునేవాణ్ణొక్కొక్కసారి. ఒక్కొక్కసారందుకు పూర్తిగా వ్యతిరేకం అనుకునే వాణ్ణి: అలాంటావిడ నేనంటే వుదాసీనంగా వుండక యింకెలా వుంటుందీ అని మేమిద్దరం ఒకళ్ళ కొకళ్ళం తగినవాళ్ళమని ఆవిణ్ణి ఒప్పించాలి. ఐనా నేనింతగా ప్రేమిస్తున్నానే ఆవిణ్ణి, ఆవిడకోసం ఏమి చెయ్యమన్నా జేయడానికి సంసిద్ధంగా వున్నానే, మేమిద్దరం ఒకళ్ళ కొకళ్ళం తగకపోవడ మేమిటి? ప్రేమున్నది నిజమైనదైతే చాలు. వాస్తవమైనదైతే చాలు. యిక దేనితోనూ నిమిత్తం లేదు! అన్ని కోణాలనుంచీ తూచి అది చూస్తున్నాను; ఐనా తలా తోకా కన్పించడం లేదు. ఇప్పుడీ ప్రయాణమే వుందనుకోండి. నేను దూరంగా వున్నందుకు నాస్త్యా విచారిస్తోందో లేదో తెలియదు; అసలు నేను గుర్తున్నానో లేదో తెలియదు. స్టేషన్‌లో దిగేప్పటికి నాకోసం ఎదురుచూస్తూ వుంటుందో వుండదో తెలియదు. నన్ను చూచి సంతోషిస్తుందో లేదో తెలియదు. మంచి అత్తరు, నా కన్పించినవాటిలోకల్లా ఖరీదైన అత్తరు పట్టుకొచ్చాను. దానిపేరు ఎర్రగులాబి. ఈ కానుకని స్వీకరించుతుందో స్వీకరించదో గూడా తెలియదు!

మనం ఒకళ్ళని ప్రేమించినప్పుడు, తెలిస్తే అంతా మరుక్షణంలోనే తెలిసిపోతుంది; లేకుంటే అసలర్థం చేసుకోవడమే దుర్లభమైపోతుంది;

ఎందుకల్లనంటారది? గ్రుడ్డివాళ్ళలా పూర్తికే చూస్తుంటాం. అంతే. కాని తర్వాత్తర్వాత ....కాదు కానవచ్చాము. ఆవిడ్లో నా చిత్తంకానివల్లా నాకు సంబంధించినంతవరకే సుమా. మిగతా అన్ని విషయాలూ అరచేతిలో వొలిచిపెట్టిన అరటిపండులా వుంటాయి. ఇవాళ నాలుగు గంటలూ ఆవిడ్ని గురించే ఆలోచిస్తుంటాను. ఆవిడ కార్యప్రవృత్తి ఎక్కణ్ణుంచి వచ్చిందో తెలుసు నాకు: పుంది కుటుంబంలో పుట్టి పెరిగింది. వాళ్ళ నాన్న ఉరల్స్ ఉక్కు కర్మాగారంలో పేరుమోసిన కార్యకర్త. వాళ్ళన్నయ్య సోవియెట్ యూనియన్ వీరపతకం పొందాడు. ఉరల్స్‌లోకెల్లా మంచిపేరున్న పాఠశాలలో చదువుకుంది. అవసరానుభవం సంపాదించుకునేందుకు వాళ్ళ కాలేజీవాళ్ళు ఉత్తర సమష్టి క్షేత్రానికి పంపించారు. ఉత్తమశ్రేణి వ్యక్తులతో కలిసి మెలిసి పనిచేసిందావిడ. మానవుల్లోవుండే నీచత్వాన్నైతే చూచే అవకాశం కలగలేదు కాని. అనేక కష్టాల్ని చవిచూచింది: యుద్ధం. అందులో తన సోదరుడి చావు ఇవీ ఆవిడ ప్రవృత్తిని మలచిన పరిస్థితులు: తోటి మానవుడిలో విశ్వాసం నమ్మకం. తెలివి తేటలు; చురుకుతనం; ముక్కుకు సూటిగా నడవడం; నిశ్చయం; పట్టుదల; పోరాటమంటే లెక్కలేని తనం. ఆ పరిస్థితులే ఆవిడ్లో వున్న లోపాలకి గూడా కారణమైనై. ఇంటి దగ్గరా, కాలేజీలోనూ గూడా ఆవిడంటే అందరికీ బాగా యిష్టం. ఆ మొండి గుణానికదీ కారణం. యిలా ఆవిడ గుణగణాల్ని గురించెంతైనా చెప్పుకుపోగలను. కాని ఒక్క విషయం మట్టుకు చెప్పలేను నేను: నన్ను గురించావిడ ఏమనుకుంటోంది? నేనంటే ఆవిడకెలా వుంటుంది!

వాలికోవంతా గందరగోళ పడుతున్నట్టున్నాడు ఆ క్షణంలో. ఆశా వున్నది నిరాశా వున్నది నెత్తిమీద మెత్తని జుత్తు చెదిరిపోయి అతని నుదుటిమీద పడుతోంది. ఒక్క క్షణమిలా ఆలోచించి మళ్ళీ చెప్పడం మొదలెట్టాడు:

ఒక ఏడాది క్రితంవరకూ, అప్పుడప్పుడూ చాలా బాధపడిపోయే వాణ్ణి నేను: యౌవనోద్వేగ సాంప్రతలేవీ చవిచూడకమునుపే నా యౌవనం అంతా గడచిపోతోందే అని. కాని యిప్పుడు? కట్టకట్టుకుని అన్నీ ఒక్కసారొచ్చిపడినై! ఇప్పుడు వాటినుంచెలా బయటపడ్డమో అర్థంకాకుండా వుంది! మీరే చెప్పండి. అన్నిటికంటే ముందు మేం సాధించిన విజయాల నన్నిటినీ సుస్థిరం చేసుకోవాలి. అంటే మా ఎమ్టియస్‌లో వెనకబడిన క్షేత్రాలంటూ వుండగూడదన్నమాట యిక. అది తేలికపనా? రెండోది: వచ్చేయేడు గూడా మాస్కో సమావేశానికి హాజరయ్యే అర్హతను సంపాదించుకో గలగాలి నేను: అప్పుడుగాని ప్రముఖ విషయాల్ని గురించి మనసువిప్పి చెప్పేందు కవకాశం కలగదు. దాని కెంత బాధపడుతున్నానో తెలుసా మీకు? ఇది గనక నేను చెయ్య లేకపోతే యిక తలెత్తుకు తిరిగే పనిలేదు! నేనంటే నాకే గౌరవం వుండకపోవడం మాటట్లావుంచి నాస్త్యా నన్ను మనిషిలాగా కూడా చూడదు! మూడోది: మాస్కో సమావేశానికి నాస్త్యా గూడా వెళ్ళేట్టు చూడాలి. ఆ సమావేశానికి హాజరయ్యే అర్హత ఆవిడకి తప్ప యింకెవరి కుంది గనక? నాలుగోది: నన్ను గురించావి డభిప్రాయం యేమిటో తెలుసుకోవాలి .... నే నావిణ్ణెంతగా ప్రేమిస్తున్నానో, ఆవిడకూడా నన్నంతగా ప్రేమించగలిగేట్టు చేసుకోవాలి! ఇవన్నీ అలావుంచి యింకొక అరగంటలో నే నివ్వబోయే యీ అత్తరు కానుక! ఈ కానుక నర్పించేప్పుడు, ఆవిడ తిరస్కరించకుండా వుండేట్టు జాగ్రత్తపడాలి! ఇంకొకటి గూడా వుంది.

స్టెప్పీలోపడి కాళ్ళరిగేట్టు తిరిగిన రోజులింకా గుర్తున్నై నాకు. ఇప్పుడంటే, యీ రైలులాగానే, గ్రామాల్ని పట్టణాల్ని గుర్తించలేనంత వేగంగా పరుగెత్తుతున్నాను! మళ్ళీ ఆ పూర్వపు రోజుల్లోలాగా అతి మెల్లగా జీవితాన్ని గడపడమంటే, నావల్లాకాదు; నా కూపిరాడనూ ఆడదు.

దూరాన్నొక చిన్న రైల్వేస్టేషన్ కన్పించింది. ఫాలికోవ్‌ని సాగనంపేందుకని నేనూ లేచి వెళ్లాను తలుపు దగ్గరకతనితోపాటు. అంతా అతను వర్ణించినట్టేవుంది, ఆ స్టేషన్.

ఎర్రని స్టెప్పీలో ఎర్రగా వెలుగుతున్నాడు సూర్యుడు. చిన్న చిన్న మట్టి యిళ్లు కనిపిస్తున్నై. ఎత్తైన కంచెమీదనుంచి ఒంటె తలొకటి కన్పిస్తోంది. మట్టితో చేసినట్లైవుంది ఆ తలానూ; విచారంగా, దీర్ఘాలోచనలో మునిగి వున్నట్టుంది. ఆ ఒంటెరంగు పక్కే ఒకటి బియ్యర్‌షాపు దగ్గర నిలబడింది మోరెత్తి. కుడికాలు పైకిలేపి ఊపుకుంటూ. ఇంతలో ఒకపాట వినిపించింది. స్టేషన్ లజుగోల ధ్వనులన్నిటినీమించి స్పష్టంగా వినిపిస్తోందాపాట. భరించరాని ఉద్వేగమేదో గొంతుకడ్డ పడుతున్నట్టు, ఆగి ఆగి వినిపిస్తోం దాస్వరం. చుట్టూవున్న యెర్రమట్టి ప్రపంచమంతా మునిగితేలుతూన్నట్టుందా పాటలో :

*...నీ కన్నుల నే గంటిని*
*లోకరహో గీతి ఝురిని...*

ఆ గొంతూ, ఆ పాటా గూడా ఆ వాతావరణానికి తగినట్టే వున్నై; ఆ వాతావరణానికీ, ఆ స్వరానికీ, ఆ పాటకీ యేదో అవినాభావ సంబంధముం దనిపించింది నాకు.

ఫాలికోవ్ వంక చూశాన్నేను. రైలింకా ఆగకముందే పెట్టె ప్రక్కచువ్వలు పట్టుకుని మెట్లమీద నిలబడ్డాడు ఫాలికోవ్. స్టేషన్ ప్లాట్‌ఫారమ్‌వైపుకు చూస్తూ. అతని ముఖంలో భావాలు నీటిమీది అలల్లా పరుగెత్తుతున్నై నిలకడ లేకుండా. మొట్టమొదట అతని ముఖమంతా నిరీక్షణతో బిర్రబిగుసుకున్నట్లైంది. మనసులోని ఆతురతంతా ఆ కన్నుల్లో గూడుకట్టుకుంది. ఇంతలో ఉన్నట్టుండి, ఏదో అవ్యక్తానందం వెల్లివిరిసింది, ఆ చెమ్మగిలిన కన్నుల్లో ఏదో మెరుపు. ఆవేశమో ఆనందమో తెలియని చిరునవ్వు. ఆక్షణంలో నన్నే మరచిపోయినట్టున్నాడు. నిలబడివున్నది పెట్టెప్రక్క మెట్లమీదననీ, ప్లాట్‌ఫారం

మీదినుంచనేకమంది తనవంక వింతగా చూస్తున్నారనీ గుర్తించుతున్నట్టే లేదు. ఆ ముహంలో ఆ వుత్సాహాతిరేకమే లేకపోతే, చాలా పరిహాసాస్పదంగా వుండే దతని కవళిక. ఇంతలో మళ్ళీ ఏదో గుర్తుకొచ్చి వట్టుంది .... నువ్వీ స్త్రీల గౌను వేసుకోవడం మంచిదన్నమాటలు గుర్తుకొచ్చివుంటై బహుశ .... వెనక్కి తిరిగిచూచి ఒకడుగు వెనక్కిగూడా వేశాడు. ఆ చిరునవ్వు మటుమాయమైపోయింది. గట్టిగా ఊపిరి పీల్చాడు. ఏమీ లెక్కలేనట్టు నిటారుగా నిలబడ్డాడు మగవాడిలా. మళ్ళీ తన ప్రత్యేకమైన చిరునవ్వు నవ్వుకున్నాడు; ఆ నవ్వతనికున్న ఆకర్షణల్లో ఒకటి. మరుక్షణంలోనే ఆ మగబీరమూ. ఆ చిరునవ్వూ అంతర్ధానమైనై. భయపడిపోయినట్టైపోయాడు. భీతికుడిచినట్టున్నాడు ప్లాట్ ఫాంమీద క్షణంపాటు కనిపించిన వా రెవరో కనుమరుగై పోతే, ఏమైపోయారో చూద్దామని ప్రయత్నించుతున్నట్టు మునిగాళ్ళమీద లేచి, మెడసారించి చూచాడు. హమ్మయ్య అనుకున్నట్టు నిట్టూర్చాడు. ఇక ఫర్వాలేదన్నట్టు, మామూలుగా శ్వాసపీలుస్తూ, ముహంమీద పడిన జుత్తొకచేత్తో వెనక్కి సవరించుకున్నాడు. రైలింకా ఆగకముందే, గభుక్కున ప్లాట్ ఫాంమీదికి దూకి ముందు కడుగులేశాడు.

అతను కలుసుకోవాలని ఆదుర్దాపడుతూ వెళ్తూన్న మనుషుల్ని నేనూ చూడగలిగా నెలగైతేం, చివరికి.

ఒక లావాటి మనిషి. గుండ్రని ముహమాయన. హుంషారుగా చేయూపాడు ఛాలికోవ్ నిచూచి. ఆ లావాటి మనిషి ప్రక్కనే ముగ్గురు పిల్లలున్నారు. ఎర్రటి బుగ్గలూ వాళ్ళూను. ఓహో. ఈయనన్నమాట ఇగ్నాత్ ఇగ్నతొవిచ్ ! అనుకున్నా నేను. వాళ్ల ముగ్గురూ ఆ 'గుమ్మడి కాయలు' ! బిట్టంగా వున్న వడుచుమనిషొకతను వస్తున్నాడు ఎదురుగా; బహుశా అతనే అయ్యుంటాడు గోషాచూమక్. ముహమంత ముడుతలు పడిన ముసలాయనొకాయన ముసలి గడ్డం వూపుకుంటూ. పసిపిల్లడిలా బోసినవ్వు నవ్వుకుంటూ వస్తున్నాడు; ఆయనే సిలాంతీతాత.

వాళ్ళ ప్రక్క ప్రక్కనే నడచొస్తోందొక అందమైన యువతి. వెత్తినొక నీలిరుమాలు కట్టుకునుంది. రుమాలంచు కనుల మీదికి పడు

తోంది. దుమ్మూధూళీ పడకుండా. ఆ చక్కని అందమైన చిన్న ముఖమూ. ఆ చిన్ని గడ్డమూ. ఆ గడ్డం మధ్యా చక్కని సొట్టా... నే ననుకున్నది నిజమే.

ఫాలికోవ్ పరుగెత్తి వెళ్ళాడు వాళ్ళకెదురుగా. రైలు ఒక్క నిమిషం ఆగినట్టాగి. మళ్ళీ ముందుకు సాగి. పరుగు ప్రారంభించింది.

రైలు మీదినుంచి కిందికిదూకి, ఆ స్టేషన్లోనే దిగిపోయి, అక్కడే వుండిపోయి, వాళ్ళందరి జీవితాల్ని గురించీ తెలుసుకుంటే బావుండుననిపించింది నాకు. అంత శ్రమపడి సాధించిన విజయాన్ని మరుసటేటికి మరింత సుస్థిరం చేసుకుంటారా వాళ్ళు? మళ్ళీ క్రెమ్లిన్ సమావేశానికి వెళ్తారా? ఈసారి అలెగ్జీ ఫాలికోవ్ ఉపన్యాసం యెట్లా వుంటుంది? ఆ అత్తరు కానుకని ఆ యువతికిస్తాడా? ఆవిడా కానుక స్వీకరిస్తుందా? అతన్ని చూచి సంతోషించిందా ఆవిడ? అతన్నావిడ ప్రేమిస్తుందా?

ఆ అందమైన ముఖంవంకా, ఆ నీలి రుమాలువంకా చూస్తూ, అలాగే, రైలుపెట్టె మెట్లమీద నిలబడిపోయాను.

ఇంకాస్సేపటికి, స్టేషన్ ప్లాట్‌ఫారమూ, ప్లాట్‌ఫారంమీది జనమూ, స్టేషనూ .... అంతా కనుమరుగై పోయింది.

